# చతుర

నవంబర్ 1981

సంపుటి : 4 సంచిక : 10


## ఈ నెల సమగ్ర నవల

"గాంధీగోరు సెప్పినట్టు కద్దరేసుకొన్నందుకు పెజాసేవ చెయ్యాల్సిన బాద్యత మనపైన వుంది. పదవుల కోసం మనం మనం కొట్టుకు సావకూడదు. అలా సస్తే మద్దెలో ఇంకెవుడో తన్నుకుపోగల్డు! మరందుకే సర్దుబాటు సేసుకొని వూర్ని పంచుకోవాల!" అంటూ శలవిచ్చిన ఆ నాయకుని గీతోపదేశానికి ఆ వూరి పోటీదార్లిద్దరూ 'అవునవున'ని తలలూపి తదుపరి చేసిన ఘనకార్యాలేమిటి?

ఓటు కోసం కులతత్వాలు, మత భేదాలు, ఆస్తిక నాస్తిక వాదాలూ కల్పించాల్సిన అవసరం ఏమిటి? ప్రజలూ ప్రజలూ కొట్టుకు ఛస్తేనేగాని ప్రముఖులకు—

# స్వర్ణ సింహాసనం

దక్కదా? పదవుల కోసం ప్రజలతో పులిజూదం ఆడే రాజకీయ నాయకులు ఎవరికి ఎలాంటి వారసులు? వీటన్నిటి సమాధానం—

## తల్లావఝ్ఝుల సుందరం

తాజా నవల 'స్వర్ణ సింహాసనం' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : రావూరి రవీంద్రనాథ్

రెండవ కవరు : అంబర్-ఆలయ శిల్పం

మూడవ కవరు : అంబర్-ఆలయ శిల్పం

ఫొటోలు : సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు సూచనలు

- జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
- ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
- *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
- నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
- అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
- ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
- 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.


శుభ్రమైన తాజా శ్వాస...
ఆరోగ్యంవంతమైన గట్టి పళ్ళు
కోల్గేట్
డెంటల్ క్రీమ్ ఫలితం
ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.
మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన దారుణమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.
అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిపేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.
కోల్గేట్ యొక్క నమ్మకమైన మూడురెట్ల రక్షణ ఎలా పని చేస్తుందంటే:
మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.
కోల్గేట్ యొక్క పాటికైన తర్వగం నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.
ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.
కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.
నోటి దుర్వాసనను ఆపండి...
కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
దంతక్షయాన్ని
ఎదుర్కొండి!
Colgate
DENTAL CREAM
Colgate
STOPS BAD BREATH
1 పళ్ళు
2 పళ్ళు
3 చిగుళ్ళకు రక్షణ
DC.G.74 TL

# చతుర

## దయార్ద్ర హృదయులు

జైల్లో వుండే నేరస్తులందరూ కఠిన హృదయులని అందరూ అనుకుంటారు గాని అది నిజం కాదు. జంతువులకు చిన్న దెబ్బతగిలినా బాధపడేవారు వాళ్ళల్లోనూ



వున్నారు. వాషింగ్టన్‌లో ఒక జైల్లో తిరిగే పిల్లి కాలు మిషన్‌లో ఇరుక్కుని విరిగిపోయింది. కాలు పోగొట్టుకున్న పిల్లి బాధ చూడలేక ఖైదీలు కర్రకాలు తయారుచేసి వైద్య సిబ్బంది సాయంతో పిల్లికి అమర్చారు. అప్పటినుంచి ఆ పిల్లి రెట్టించిన ఉత్సాహంతో ఎలకలను పట్టడం ప్రారంభించింది. పిల్లి ఓపికగా ఎలుక లున్న కన్నాలదగ్గిర కూర్చునేది. ఎప్పుడన్నా ఎలుక బయటకి తొంగి చూడగానే కర్రకాలుతో ఠపీమని తల మీద ఓ దెబ్బ వేసేది. దాంతో ఎలుక చచ్చూరుకొనేది.

కొందరు యజమానులు కూడా పెంపుడు జంతువులను సొంత పిల్లలతో సమానంగా చూసుకొంటారు. ఒకావిడ తమ పిల్లి ప్రమాదవశాత్తు, కన్ను పోగొట్టుకుంటే ఓ కళ్ళ డాక్టర్ దగ్గిరకి తీసికెళ్ళింది. అతను పిల్లికోసం రెండు కృత్రిమ కళ్ళు రూపొందించాడు. పిల్లి కన్ను పగలు ఒకరకంగా చీకటిపడ్డాక మరోరకంగా మారుతుంది. అంటే కాంతి కనుగుణంగా పిల్లి కనుపాప పెద్దదవడం గాని, చిన్నదవడంగాని జరుగుతుంది. అందుకే వైద్యుడు మిగిలిన కంటికి సరిగ్గా సరిపోయేలా పగలు ధరించడాని కొకటి, రాత్రి ఉపయోగానికి ఒకటి తయారు చేసి ఇచ్చాడు. న్యూయార్క్‌లో ఒక స్త్రీ తమ కుక్క రాత్రిపూట చీకటిలో దారికనిపించక ప్రమాదానికి గురవుతుందేమోనని భయపడి వెంటనే రెండు బ్యాటరీలతో పనిచేసే లైట్లను కుక్క తలకు అమర్చింది.

# ప్రపంచం

## వింత అంకితం

రచయితలు, రచయిత్రులు పుంఖాను పుంఖంగా రచనలు చేసి ఎడా పెడా అంకితాలిచ్చేస్తుంటారు. కొందరిచ్చిన అంకితాలు చూస్తుంటే 'ఔరా' అని



పిస్తుంది. డెరెక్ లంబర్ట్ అనే రచయిత తను నవల రాసేటప్పుడు మధ్యమధ్యలో మద్యం అందించిన ఒక బార్‌లో పన్చేసే చిన్నమ్మాయికి కృతజ్ఞతగా తన నవల అంకితమిచ్చేడు. డిటెక్టివ్ నవల్లు రాసే జాన్ గార్డ్‌నర్ నిద్రమాత్రలు సరఫరా చేసే కెమిస్ట్‌లకి తన నవలని అంకితమిచ్చేడు. మరోరచయిత తనకి అండర్‌వేర్స్ అమ్మిన ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ వారికి తన నవల అంకితమిచ్చి, తాను నవల టైప్ చేసేటప్పుడు కూర్చోవడంలో ఏ మాత్రం అసౌకర్యం కలిగించని అండర్‌వేర్లు అమ్మినందుకు కృతజ్ఞతలు తెలియజేసేడు. ఓ రచయిత తను రోజూ కాల్చే పైప్‌కు అంకితమిస్తే, మరో పెద్దమనిషి అఫ్ఘన్ కుక్కకి అంకితమిచ్చేడు. రాబర్ట్ పేని అనే రచయిత కారల్‌మార్క్స్ జీవిత చరిత్రను రాసి దాన్ని మాస్కోలోని మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్ ఇన్‌స్టిట్యూట్‌లోనిఅధికార్లకి అంకితమిచ్చేడు. దాంతో పాటు వారు తాను వివరాలు కోరుతూ రాసిన ఉత్తరాలకి సక్రమంగా జవాబివ్వలేదనీ, అందువల్ల తానే స్వయంగా పరిశోధనలు చేయాల్సి వచ్చిందనీ, అందువల్ల ఈ కృషికి పరోక్షంగా కారకులైన అధికార్లకి కృతజ్ఞతగా నవల అంకితం చేస్తున్నానని వివరించేడు.

'ది అరేబియన్ నైట్స్'కి అనుబంధ గ్రంథం రాసిన రిచర్డ్ బర్టన్ దాన్ని బోధలైన్ గ్రంథాలయాధికారులకి అంకితమిచ్చేడు. ఆ గ్రంథాలయాధికారుల అమర్యాదకర ప్రవర్తన వల్ల ఒళ్ళు మండి నిష్పక్షపాతంగా చెడామడా తను చెప్పదల్చుకున్న విషయాలను చెప్పగలిగానని అందులో వివరించేడు.

# మాయదారి పక్షులు

ఈ ప్రపంచంలో మృత్యుకారకాలు కాని వస్తువు, ప్రాణిలేదు. అమెరికాలో లాక్‌హీడ్ జెట్ విమానాన్ని ప్రమాదానికి



గురిచేసి 72 మంది మరణానికి కారణమయ్యాయి కొన్ని పక్షులు. ఒకసారి హంస కారణంగా 17 మంది మరణించారు. పక్షులమూలంగా ఏటా 15 జెట్ ఇంజన్లను మార్చాల్సి వస్తోంది. విమానాశ్రయాలనుంచి పక్షులను దూరంగా వుంచేందుకు అవసరమైన సలహాల నివ్వడానికి జర్మన్ ఎయిర్‌ఫోర్స్ వారు ఒక బయాలజిస్ట్‌ను నియమించారు. ఇదివరలో విమానం స్పీకర్లలో హెచ్చరిక శబ్దాలను, అరుపులను ప్రసారం చేయడం, తుపాకీ పేల్చడంచేసేవారు పక్షులు కన్పించినపుడు. పక్షులు ఈ గోలకీ, శబ్దాలకీ అలవాటు పడిపోయి వాటిని లెక్కచేయడం మానేయడంతో సమస్య మొదటికొచ్చింది.

అందుకని కొందరు నిపుణులు విమానాశ్రయాలవద్ద పక్షులు జీవించడానికి అనువుగా లేని పరిసరాలను సృష్టించాలని సూచించారు.

పొడవైన గడ్డి, ఎలుకలు, పందికొక్కులు వగైరాలను ఏరిపారేస్తే పక్షులు అటురాకుండా వుంటాయి. అంతేకాదు ప్రయాణీకులు పావురాలకి, ఇతర పక్షులకీ ఆహారం వేయకుండా చూడటమే గాక పిల్లులను పెంచాలని కూడా వీరు సలహా ఇచ్చారు. ఈ జాగ్రత్తలు ఏ మేరకు ప్రమాదాల నరికడతాయో చూడాలి.

# గుప్తధనం

చేతిలో డబ్బు, ఒంట్లో ఓపిక వున్నవారు బ్రెజిల్‌కి ప్రయాణం కడితే బోలెడు ధనరాసులు దొరికే అవకాశాలున్నాయి. గుప్తనిధుల అన్వేషకులు బ్రెజిల్ దేశం దగ్గరలోవున్న ఓ చిన్న ద్వీపంలో విలువైన నగలు, బంగారం, వెండి పాతి

పెట్టబడ్డాయని నమ్ముతున్నారు. 3 మైళ్ళ పొడవున్న ఈ ద్వీపం రాత్రికి రాత్రి ధనవంతులమైపోవాలని కలలుగనే సాహసికులను అయస్కాంతంలా ఆకర్షిస్తోంది.

ఈ ద్వీపంలో ఇద్దరు సముద్రపు దొంగలు కొన్ని కోట్ల విలువచేసే నిధులను దాచారని ఓ వార్త ప్రచారంలో వుంది. ఈ దొంగలు తిరిగొచ్చి ఈ ధనాన్ని తీసుకొందామనుకున్నారు గానీ తమ నిధిని చేరుకొనేలోపలే మరణించారు. ఈ వార్త క్షణాల మీద ప్రపంచ వ్యాప్తంగా వున్న నౌకాశ్రయాలకి పాకిపోయింది. అయితే ఈ ద్వీపం భౌగోళిక

కొన్ని 'మేప్స్' సంపాదించి నిధి కోసం అన్వేషణ కార్యక్రమాన్ని సాగించాడు గాని ఫలితం లేకపోయింది.

ముసలి నావికులు ఇప్పుడు ప్రచారంలో వున్నవన్నీ అసలైన 'మేప్'లు కావని, నిజమైనది ద్వీపంలోని రాళ్ళ అడుగున ఎక్కడో వుందని అంటారు. ఇంతవరకూ ఆ గుప్త నిధి ఎక్కడ వుందో సూచించే పటం ఎవరికంటా పడలేదు. ఈ మధ్య బ్రెజిల్‌కి చెందిన ఒక సంస్థ నిధి అన్వేషణకు పథకాలు వేస్తోంది.



స్వరూపం నిధుల అన్వేషకులకు అనువుగా లేదు. ఇది అంతా రాతిమయం. ద్వీపం మధ్య భాగంవద్ద 2వేల అడుగుల ఎత్తు వుంటుంది. ద్వీపం తీరభాగం దట్టమైన, ప్రమాదకరమైన పగడపు దుబ్బులతో నిండి వుంటుంది. 1880లో కొందరు సాహసికులు ఈ నిధుల కోసం అన్వేషణ జరిపారు. కానీ వీరు ఎండ్రకాయ సమూహాలు దాడి చేయడంతో పనికి అంతరాయంకలిగి చివరికి ఉత్త చేతులతో వెనుదిరగాల్సి వచ్చింది. ప్రతి కలకు సంబంధించిన ఒకతను వెలుగులోకి వచ్చిన నిధి ఉనికిని తెలియజేసే

వీరు అత్యంతఆధునికమైన వలలు, తవ్వే పరికరాలను ఉపయోగిస్తారట. వీరింత కష్టపడ్డా ఫలితం దక్కుతుందో లేదో మరి.

# పారితోషికం

పల్లెల్లో, పట్టణాల్లో ఆఖరికి విదేశాల్లో కూడా వేరుసెనగ గింజలకు బాగా గిరాకీ వుంది. అందుకే 'పాప్' గీతాల

పాడేవారు ఒకోసారి డబ్బుకి బదులు కాఫీపొడి, వేరుసెనగపప్పులు పారితోషికంకింద వసూలు చేస్తున్నారు. ఈమధ్య దక్షిణ అమెరికా టూర్ చేసిన 'పాప్' బృందం ఓస్మండ్స్ పారితోషికం క్రింద వేరుసెనగ పప్పులు, కాఫీ తీసుకున్నారు. ప్రపంచ సంగీత ప్రియులను ఓ ఊపు ఊపిన స్వీడన్‌కి చెందిన పాప్ 'అబ' బృందం తను కార్యక్రమాలకు పారితోషికంగా ఆహార పదార్థాలు, కాయగూరలు, ఉత్పాదక వస్తువులు బంగాళదుంపలు, న్యూస్‌ప్రింట్, ఆయిల్, ముడి పదార్థాలు వగైరాలను తీసుకుంటూ స్వీడన్ దేశపు ప్రధాన ఎగుమతిదారుల క్రింద చేరిపోయారు. వీరు వస్తు రూపంలో వసూలు చేసిన ఆహార పదార్థాల,వస్తువులమూలాన వీరికి సుమారు ఏభైలక్షలరూపాయల ఆదాయం వచ్చింది. టామ్‌జోన్స్ తనపారితోషికాన్ని రోల్స్ రాయిస్ లేక బెంటెలె వాహనాల రూపంలో పుచ్చుకుంటాడు. ఫ్రాంక్ సినత్రా మాత్రం ఒక టూర్‌చేసి విలువైన జెట్ విమానాన్ని సంపాదించాడు.

# గడ్డి కోస్తావా?

“నా ముంగిట్లో పెరుగుతున్న గడ్డిని నా ఇష్టం వచ్చినట్లు పెంచుకుంటాను,



నాఇల్లు, నాగడ్డి నా ఇష్టం అంటే కుదరదని న్యాయాధికారులు హెలెన్‌కి బాగా గడ్డిపెట్టారు–

ఉత్తర అమెరికా నగరవాసి అయిన హెలెన్ తన వాకిట్లో 'లాన్'ని దట్టంగా పెంచింది. ఎప్పటికప్పుడు గడ్డిని చక్కగా ట్రిమ్ చేయకుండా వదిలేసింది. ఇంటిముందు లాన్ పెంచకుండా చిట్టడివిని పెంచదల్చుకున్నావా అని ఆగ్రహంతో మూడొందల పాతిక రూపాయలు జరిమానా అయినా కట్టులేదా నాలుగు రోజులు జైల్లో కూర్చొని మా ఆతిథ్యం స్వీకరించమని హుంకరించాడు న్యాయాధికారి–

ఆరంగుళాల మంచు కింద వున్న గడ్డిని కోయడం సాధ్యంకాదని, మంచుతో కప్పబడిన గడ్డిని కోయడం ఎంత కష్టమో తమరే ఆలోచించండని న్యాయాధికారికి విన్నవించుకుంది హెలెన్.

నాకు కథలతో పనిలేదు–పనే ముఖ్యం. నీ ఆర్గ్యుమెంట్లేవీ వినదల్చుకోలేదు. “ఫైను కడతావా, జైలుకెళతావా! గడ్డి కోస్తావా! మూడింట్లో ఏదో ఒకటి నీ ఇష్టం” అన్నాడు న్యాయాధికారి ముఖం చిట్లించి–

తీర్పు విన్న ఇతరులు ముక్కుమీద వేలేసు కోవడం చూసి చేసేదేంలేక కత్తెర వెతకడం మొదలెట్టింది హెలెన్.

ఆరోజు తెలతెలవారుతుండగానే ఆఊళ్ళో ఓ బాంబు పేలింది.

ఆ వూరి పేరు కుమిలిపల్లి.

పేల్చిన వాడి పేరు బాంబురాజు. చరిత్ర గ్రంథాల్లోగాని, రాష్ట్ర రంగుల పటాల్లో గాని భూతద్దం పెట్టి వెతికినా ఆ వూరి స్థానం కన్పించదు. అక్కడ మహా పురుషులెవరూ జన్మించలేదు. మహత్తర సంఘటనలేవీ అక్కడ జరగలేదు. అందుకే ఆ వూరి గురించి ఎవ్వరికీ తెలీదు. రిజర్వుడు నియోజక వర్గంలా అటు పట్టణాలకి ఇటు పల్లెలకు మధ్యస్తంగా గాలికి కొట్టుకొచ్చిన ఎండుటాకులా పడుంటుంది ఆ ఊరు.

దేశ పురోభివృద్ధి వీళ్ళ కంట పడకుండా మూడు వైపులా పదవి పోయిన అధికార పార్టీ వాళ్ళలా మూడు కొండలు సరిహద్దులుగా నిలిచేయి. పట్నం వెళ్ళే తారోడ్డు దగ్గరనుంచి చెరిగిపోయిన జుట్టులా వున్న చెట్ల మధ్యనుంచి రాయి రప్పల డొంకల మధ్యగా చచ్చినపాములా పడుంటుంది ఆ దారి. ఆ గతుకుల్లో పడి కాలు బెణకకుండా రెండు మైళ్ళు నడవగల్గితే ఆ వూరిని చేరుకోవచ్చు.

ఊరి నడిబొడ్డున తలా, కర్రా విరిగిన గాంధీగారు దీనంగా నిల్చునుంటారు. ఆయనకు ఎండ తగలకుండా విస్తరించుకొన్న వేపచెట్టు నీడ పూసిబోని కబుర్లకీ, రాజకీయ చర్చలకు, పనిలేనివాళ్ళకు ఆశ్రయం ఇస్తుంది. ఏనాడూ సరిగా వినబడని వార్తలనే ప్రసారం చేసే ఓ పాత రేడియో అక్కడ చేరే జనానికి వినోదం కలగచేస్తూ వుంటుంది.

దగ్గర దగ్గర ఐదువందల గడపలుంటాయి.

ఆ వూరు సందుగొందుల్లోంచి బయట పడ్డంకన్న పద్మవ్యూహంనుంచి బయట పడ్డం తేలిక. అక్కడి పెంకుటిళ్ళూ, ఒకటీ అరా మేడలూ షోగ్గా పాకలకేసి చూస్తూవుంటాయి. చెరువుకి ఓ ఫర్లాంగు దూరంలో వూరికి పుట్టుమచ్చలా మాలపల్లి -మానని గాయంలా మాదిగవాడ.

ఉత్తర దిశగా నిశ్శబ్దంగా వుండే సమాధులు - పడమర వైపు దిక్కూమొక్కూ లేని వాడిలా ఓ దేవుడు అతి దీనంగా కూలడానికి సిద్ధంగా వున్న దేవాలయంలో బిక్కుబిక్కుమంటూ వుంటాడు.

ఆ దేవాలయం తలుపులు ఎపుడూ తెరుచుకునే వుంటాయి. ఆ గుడికి ఇళ్ళు దూరం. గుడిలో సాయంత్రం పిల్లలు ఆడుకొంటారు. పావురాళ్ళు రెట్టలు వేస్తుంటాయి. పిచ్చి మొక్కలు గోడలమీద ప్రాణం పోసుకొని వుంటాయి. చౌకబారు శృంగారానికి అనువైన చోటు. ముష్టివాళ్ళకు అంతఃపుర మందిరం అది.

పుచ్చిపోయిన ధ్వజస్తంభం దేవుడి ఆర్థిక పరిస్థితిని ఎలుగెత్తి చాటుతూ వుంటుంది. కళ్ళముందు ఏనాడూ నైవేద్యం చూడనివాడిలా భయంగా, బెదురుగా, బాధగా కలియుగ అంతం కోసం ఎదురు చూస్తున్నట్లు వుంటాడు దేవుడు.

రాజకీయ రంకులాటలు, కులం కుమ్ములాటలు అక్కడ సర్వసామాన్యం. మూర్ఖపు పట్టుదలలో సరదాగా పొడిచేసుకోవడం అక్కడివాళ్ళకు హాబీ. 'ఆ పైనున్న వాడే..!' అని అన్నిటికీ గోడమీద దేవుడి బొమ్మలను నమ్ముకొనే పరమ భక్తులు - అంతోఇంతో చదువుకొన్న వాళ్ళూ,వున్న వాళ్ళు మైనారిటీయే.

పిచ్చి తెలుగు తల్లికి మల్లెపూదండ ఆ వూరు.

ఆ ఉదయం....

వూరు మీదున్న ఆకాశం పిడికిలి విప్పింది.

కల చెదిరి కళ్ళు తెరిచినట్లు తూర్పు తెల్లవారింది.

స్కూలు కెళ్ళనని మరాం చేసే చిన్నపిల్లవాడిలా కొండలచాటు నుండి సూర్యుడు విసుగ్గా మెల్లగా పైకి వస్తున్నాడు.

గవర్నరుగారు వస్తుంటే రక్షకభటుల సైరన్ దారిచేసినట్లు చెట్టూ చేమా చ్కుమంటూ వస్తున్న వాడి కిరణాలకు ఊళ్ళోకి దారి చూపించేయి.

కాకులు మేలుకొలుపులు ఆలపిస్తూనే వున్నాయి.

పొలం పన్లులేని వాళ్ళూ, తీరని కోరి కల్ని దుప్పట్లో దాచుకొని కలల్లో అమృతం తాగేసి అలాగే బతికేద్దామను కొన్న వాళ్లూ, పట్నం బైస్కోప్‌లో బట్ట లూడదీసిన నాట్యతార కళ్ళల్లో కథకళి చేస్తుంటే ఆ ఆనందాన్ని వదులుకోలేని వాళ్ళూ, రాత్రి తాగిన ముంతడు కల్లూ, ఎప్పుడో లేచిపోయిన మొదటి పెళ్ళాం ముద్దులూ గుర్తు చేసుకుని ఆ తన్మయత్వంలో తరించే వాళ్ళూ మాత్రం ఇంకా కళ్ళు తెరవలేదు.

ఆ వూళ్ళో అందరికన్న ముందు లేచేది గుళ్ళో దేవుడూ, ఊరి బయటి హోటలు అయ్యరూ.

వెలుగు రాకకు ముందే చీకటి చీల్చు కుంటూ పూజారి పంతులు శివనామం జపిస్తూ గర్భాలయంలోకి ప్రవేశించేరు.

అక్కడ పేరుకుపోయిన చీకటికి వెలుగు ప్రసాదిస్తూ దీపం వెలిగించేరు.

దేవుడు కళ్ల తెరిచేడుగానీ వరండా లోని బైరాగులు, బిచ్చగాళ్ళు ఇంకా లేవనే లేదు.

పూజారిగారు నిత్యం జరిపే తతంగం పూర్తి చేసుకొని బయటకొచ్చేసరికి వెలుగు వరద మీద పడింది. ఆ ప్రాంగణంలో ఆదమరచి నిద్రపోతున్న వాళ్ళను చూడ గానే ఆయన మరోసారి బాధపడక తప్ప లేదు. దేవాలయం గురించి ఎన్నిసార్లు విన్నవించుకొన్నా పట్టించుకోని ఊరి పెద్దల్ని క్షమించమనీ,అజ్ఞానాంధకారంలో మునిగిపోయిన వీళ్ళందర్నీ ఆదుకోమనీ దేవుణ్ణి మరోసారి ప్రార్థించేరు.

అంతెంగర్నే అప్పుడుగాల్నొచ్చిన ఆఫీ సర్లా ఇబ్బందిపడ్డ దేవుడు తన బాధను చెప్పుకోలేక మౌనంగా వుండిపోయేడు.

సరిగ్గా అప్పుడే లేతకిరణాలు గుళ్ళోకి ప్రవేశించేయి. ఆ లేవెలుగులో పూజారి గారి నుదిటి మీద విభూతి పట్టీ మరింత తెల్లగా మెరిసింది. చేతిలో రాగి చెంబు తళుక్కుమంది.

నందీశ్వరుడి దగ్గర చతికిల పడ్డా రాయన. 'నెమరు వెయ్యడానికి గడ్డి లేదు స్వామీ!' అన్నట్టు నీరసంగా చూస్తోంది నంది.

ఇప్పుడు వూరు పూర్తిగా ఒళ్ళు విరుచుకొంది.

హోటలు అయ్యరు పాచి మొహాలకి పుల్లలు – ఆ పని ముగించిన వాళ్ళకు వేడి వేడి ఇడ్లీలు, దోశెలు అందిస్తున్నాడు.

రోడ్లమీద జనసంచారం మొద లయ్యింది.

ఎండ వూరి మీద బాగా పరుచుకు పోయింది.

వెచ్చపడ్తున్న చల్లగాలి వేప చెట్టును కదిలించి పట్నం దారి పట్టింది.

అప్పుడు......!

పొయ్యిలోకి పుల్లల కోసం బయల్దేరిన


గ్రహాబలం...!
గ్రహాలు, నక్షత్రాలు, తిథులు, వారాలు, వర్జ్యాలు సమస్తం ఆయనకు ఆరాధనీయాలు. వాటిని సంప్రదించకుండా ఏ పని చేయడు ఆయన. ఏది చేసినా శాస్త్రోక్తంగానే చేసి తీరాలనేది ఆయన జీవిత సూత్రం.
అయినా 'ఏదీ' అనుకూలించినట్లు లేదు. కొడుకు నిరుద్యోగిగానే వున్నాడు; కూతురు లేచిపోయింది; దుకాణం గుమాస్తాల దోపిడీ పాలై మూతబడింది. భార్యకు పావు పిచ్చెక్కింది... అయినా తన నమ్మకాలు సడలించుకోని తీవ్రమైన వ్యక్తి ఆయన... అటువంటి మనిషి జీవితం చివరకు ఏవిధంగా పరిణమించింది
విశ్వకథా విపంచి 'విపుల' నవంబర్ సంచికలో అశోక్‌కుమార్ సింధ కథ "నక్షత్రాలు" చదివి చూడండి. ఈ కథతో మరెన్నో వాసిల ఆసక్తికరమైన అద్భుత కథలు అచ్చతెనుగులో అందజేస్తుంది 'విపుల'. కథలకు ఆకర్షణీయమైన వర్ణచిత్రాలు, కవ్వించే జోకులు, కార్టూన్లు, ఆశ్చర్యకరమైన విచిత్ర విశ్వవిశేషాలు 'విపుల' ప్రత్యేకతలు.
132 పేజీలతో, రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో, కంటికి మనసుకు విందు చేసే ఏకైక పత్రిక విపుల.
ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథా విపంచి 'విపుల' పాఠకులకు అందజేసే వివిధ భాషల కథానికా సుమ సౌరభంలోని వైవిధ్యం అనంతం ప్రపంచంలోని అనేక భాషల నుండి సేకరించిన విశిష్ట కథానికలకు నెలవు 'విపుల' కథా ప్రియులకు రసోపేత విందు 'విపుల'
విపుల
132 పేజీలు · రెండు రూపాయలే

వాళ్లు, గోలీలాటకోసం, పార్ట్నర్ షిప్ కోసం ఎదురు చూస్తున్న చొక్కాలేని గుంటగాళ్ళు, గడ్డిమోపుల గోచీగాళ్ళు, తలలేని గాంధీగారు, ఆలీసెం అయిపోనాది అని పరుగులు పెడ్తున్న గైరమ్మలు-

అందరూ ఓ క్షణం హడావుడి మర్చిపోయి ఆగి విస్తుపోయేరు.

అందుక్కారణం గాంధీగారు పోయిన తల తెచ్చుకొని ప్రాణం పోసుకొని అరుగు మీదనుంచి రచ్చబండ దగ్గరకు రావటంకాదు.

ఆ వస్తున్నవాడు గాంధీగారూ కాదు, సుయోధనుడూ కాదు.

'మరి వసున్న అతగాడెవరయ్యా?' - అని అడిగితే అడిగిన వాడిది ఆ వూరుకాదనే అర్థం. 'ఏటి ఇసాపట్నం పిచ్చాసుపత్రి నుంచి గాని ఎలుపొస్తున్నావేటి?' అని ఎగాదిగా చూస్తారు అక్కడి వాళ్లు.

అతనా వూరికి న్యూస్ పేపర్లాంటి వాడు. ఆ మారుమూల ఊరికి రాజధాని నుండి గొప్పగొప్ప కబుర్లు మోసుకొచ్చే వాడు. వయస్సు నలభై వుంటుంది. తెల్లటి ఖద్దరు గుడ్డలో, పుట్టినప్పటి నుంచీ పదవిలో వున్నవాడిలా మెరిసిపోతుంటాడు. లాల్చీ జేబులో న్యూస్ పేపరు, చెరగని క్రాపు అతనికి ఆభరణాలు. మనిషిని చూడంగానే గౌరవభావం కలుగుతుంది. అతని స్టేట్ మెంట్సు పేపర్లలో పతాక శీర్షికలో వెయ్యొచ్చు గానీ ఎవరూ వెయ్యరు. ఈ దేశంలో పని చెయ్యక పోయినా కేవలం కబుర్లతో బతికెయ్యగల నేర్పు బహు కొద్దిమందికి వుంటుంది. అందులో అతడు అగ్రగణ్యుడు.

సదరు శాల్తీ పేరే బాంబురాజు.

అసలు పేరు వాళ్ళ అమ్మగారు కూడా మర్చిపోయేరు అతనితోపాటు.

అతను చెయ్యలేని పని అంటూ ఏదీ లేదు.

అతడు రచ్చబండ దగ్గర చేరితే అక్కడ ఏ పార్టీ మీటింగో అర్థంకానంత జనం చేరిపోతారు. అతను మాత్రం ఏ పార్టీలో చేరలేదు. ఒకే పార్టీ, ఒకే సిద్ధాంతం అంటే గిట్టదు. అధికారపార్టీ మీటింగుకి, అనధికార పార్టీ మీటింగుకి కూడా చాలా హడావుడి చేస్తాడు. పెళ్ళికీ, చావుకీ పిలవకపోయినా వస్తాడు. అడక్కపోయినా సానుభూతి చూపిస్తాడు. అడక్కుండానే అప్పు సంపాదించగల నేర్పు వుంది. అప్పు తీర్చటం బొత్తిగా అలవాటు లేని పని.

బాంబురాజుకి హైద్రాబాద్ వెళ్ళి రావటం ఓ హాబీ!

సినిమాల్లో దేవుడిలా సడెన్‌గా మాయమైపోతాడు. ఎప్పుడు హైద్రాబాద్ వెళ్ళేడో, ఏప్పుడు తిరిగొచ్చేడో మాత్రం ఎవరికీ తెలీదు. అసలు ఎందుకు వెళ్తాడో నిజానికి అతనికే తెలీదు.

ఆ వూరి పెద్దలందరికీ అతను సన్నిహితుడు.

ఆ వుదయం ఎండతో పాటు వూళ్ళోకి పాదం మోపిన బాంబురాజును చూడంగానే ఎవ్వరూ స్వాగతం పలకలేదు. కానీ అతను చెప్పబోయే కొత్త వార్తల కోసం ఆసక్తిగా చూస్తున్నారు.

"ఏటి బాంబురాజు ఇప్పుడేనేటి రావటం?'' చుట్ట పెద్ద పలకరింపు.

"హయిదరాబాదు బస్సుదిగి డైరక్టుగా వస్తున్నా... అందరూ బాగున్నారా?!"

"కబుర్లేమిటి? ... మళ్ళీ ఎపుడెళున్నావ్?" "సేనా పన్లు పెండింగులో

పెట్టేసి పారొచ్చినాను ... ఎపుడెళ్తానో తెలీదు" అని రెండడుగులు వేసి అయ్యరు పాక దగ్గర కొచ్చేసరికి మూకుమ్మడిగా చాలామంది పలకరించారు. అందరికీ చిర్నవ్వులు పంచాడు సమానంగా – బాంబుని మాత్రం భద్రంగా ఉంచేసుకొని.

"ఏటి రాజుగారు అయిదరాబాదు నుంచే!" కాఫీ చప్పరిస్తూ పలకరించేడు లింగం.

"ఇదే రావటం .ఓరయ్యరూ కొంచెం మంచి కాఫీ కొట్టించు. హయిదరాబాదులో మనకు నాగా కాఫీ దొరకదు. ఎంతసేపు టీ నీల్లు తాగటంతో నోరు సెడిపోయింది." –జనాంతికంగా అన్నాడు బాంబురాజు.

"ఏటి కాఫీ దొరకదా?" – బోల్డు ఆశ్చర్యపోతూ అంది ఓ శాల్తీ.

"అదేటి! కుమిలిపల్లనుకున్నావేటి కాఫీ తాగనీకి. అది దేసెం టీ కాదు మరి మాంచి గుమగుమలాడిపోద్ది. ఓ పాలి తాగినావంటే మరి కాపుసారా జోలికి పోవు, అలగుంటది." అని విశద పర్చేలోపల అయ్యరు కాఫీ ఇచ్చేడు.

"సూరిగా!మీ అయ్యగారెలావున్నారు" ఎదురుగా వున్నవాణ్ని పలకరించేడు.

"ఆయనకేటి మారాజు...."

"వూళ్లోనే వున్నరా! పట్నంగాని ఎలి పోనారా?!"

"నేదు వూళ్లోనే వున్నారు. అర్తోగాని పని బడిందేటి?"

"నేడేస్ .... ఆయనగోరు మేనల్లుడు హయిదరాబాదులో ఆపడ్డాడు ... సిన్న కబురు అంపసెయ్య మన్నాడు..అందుకో సరవని..."

"ఏటో సెప్పు నేనాదకే ఎల్తున్నా!"

"అది నీతో సెప్పేది కాదులే! అయ్యరూ...సక్కెర ధర మానావు పెరిగి పోనాదట. మనోళ్లొకడు ఓ బస్తా ఇప్పిస్తానన్నడు. బరువేద మోస్తావని నానే వద్దని వచ్చేసినా...రాత్రి బస్సులో ఎవరో సెప్తుంటే మతోయింది. కుసింత కష్టమైనా తెచ్చి నీకిచ్చుంటే బాగుండి పోయేది"

యాగం చెయ్యకుండానే ఫలం పొందిన వాడిలా అచ్చెరువొందేడు అయ్యరు.

"ఎంత పన్జేసేరు రాజుగారు..?"

"మరేటి బయం నేదు. మళ్లా ఎల్లినప్పుడు ఏయించుకొత్తాగా! సొమ్మయితే ముందు జమసెయ్యి. ఆనక ఇసయం నా కొదిలెయ్ ... వందకి సిల్లరుందా?!" జేబులో కాగితాలు తీస్తూ అడిగేడు.

"తమరి దగ్గర కాఫీ డబ్బులేంటి రాజుగారు.."

"భలేవోడివేనయ్యా ! సాలుసాలుగాని సిల్లరసూడు.."

"పర్వాలేదు రాజుగారూ ! నెమ్మది మీద ఇయ్యండి"

"మరి వస్తా" అంటూ లేచేడు బాంబురాజు.

బాంబురాజు వూళ్లోకి వచ్చినట్లు వూరంతా క్షణంలో పాకిపోయింది. రాజు రచ్చబండ దగ్గరకొచ్చేసరికి కరణంగారు ఎదురయ్యేరు. ఇద్దరూ మౌనంగా పలకరించుకొన్నారు.

"ఇదేనా రావటం? మా అమ్మాయి, అల్లుడు ఎలా వున్నారు?!"

"బాగున్నారు. మిమ్మల్నోపాలి రమ్మన్నారు. పెద్దపాపకి ఆ మద్దెన సిన్న జెరం కాసిందట. ఇపుడు తగ్గిపోనాదట."

"అలాగా! మరి వుత్తరం రాసేరు కాదేం?!"

"అనే మానావు బాదపడ్డారు.." అని వాళ్ళకన్నా ఎక్కువ బాధపడ్డాడు బాంబురాజు.

"రాజధాని వా ర్తలు చేప్పేవుకాదు.." చుట్టవెలిగిస్తూ కదిల్చేరు.

"అది సెబ్దారనే పారొచ్చేను. మొన్న మంత్రుల మీటింగులో సర్పంచులందరికీ ఎలక్షన్లు పెడ్తారని తీర్మానం జరిగిందట. రేపో మాపో పేపర్లో వచ్చేత్తుంది... ముందుగా మనోల్లందరికీ తెలియపర్చాలి గదా!''—అదే తన విద్యుక్త ధర్మం అయినట్లు సెలవిచ్చేడు.

"నిజంగానా?"

"అనే అక్కడందరూ సెప్పేరు. మంత్రిగార్ని కలుద్దారంటే మీకు తెలువం దేముంది. మన పనుల్లో పడి కుదిరింది కాదు.." చాలా అపోలజిటిక్‌గా అన్నాడు.

"ముందు రాజుగారికి చెప్పాలి కదా! వస్తాను.. మళ్ళీ కలుద్దాం"

"అయ.."

కరణం గారు రాజుగారి మేడవైపు కదిలేరు.

"ఏటి బాంబురాజు నువ్వు సెప్పింది నిజవేనా?!" - ఉత్సుకత ఆపుకోలేక అడిగాడు అంతావిన్న కుంటి సత్తి.

"నేనేటి హయిదరాబాదు నుంచి అబద్ధాలు సెప్పడానికి పారొచ్చేనేటి?! నీలాటి కుంటి లంజకొడుకులందరికీ మానావు సులకనైపోనాయి నామాటలు.."

"సిన్నదానికే అగ్గయిపోతావేటి?!"

"అదేటి సిన్నమాట? పొద్దుటే తాగేవేటి?"

"ఛస్.. వాగ్గేయి.. గాని ఇంతకీ ఎప్పుడో సెప్పినావుగాదు"

"అది అల్లకే తెలవదు"

"మరి కాయంగా ఉంటాయా?!"

"నువ్వు గాని సుల్సుంటావేటి?!"

"మనకులాటోల్లకి పదవులెందుకు.. దానికి అదురుట్టం వుండాల..నెక్కుండాల. ఆ రెండే వుంటే ఇలాగెందుకుంటాం. మరి ఎలా"

"నీదే ఆలీసెం" అంటూ ఇంటిదారి పట్టేడు-అలా బాంబును చల్లగా పేల్చేసిన బాంబురాజు.

అతను పేల్చిన ఆ ఎన్నికల బాంబు అంత్తై.. ఇంత్తై.. అంతంత్తై కరెంటుకన్నా వేగంగా, వెలుగుకన్నా తొందరగా చేరాల్సిన చోట్లకి చేరింది..

ప్రజాస్వామ్యంలో ఎన్నికలంటే నాయకులకి సరదా! పనీపాటలేని వాళ్ళకు కాలక్షేపం- పోలీసులకు, డాక్టర్లకు చేతినిండా పని- కల్లుపాకలకి మంచి గిరాకీ- వ్యాపారస్తులకి చందాలివ్వాలని భయం- గుండాలకి, ఖద్దరు గుడ్డలకి మంచి డిమాండు.

కాని, రాజుగారికి ఎన్నికలంటే అసహ్యం.

సెంద్రరావ్ నాయుడికి మాత్రం ఆనందం.

"ఏటి! అప్పుడే ఎన్నికలా?! ఎవలు సెప్పేరీమాట?!" ఆశ్చర్యంగా అడిగేరు రాజుగారు.

"బాంబురాజు!" వినయంగా చెప్పేడు కరణం.

"అదికెవలు సెప్పేరట?"

"పెద్దమంత్రి దగ్గర పనైసేవోడు సెప్పేడట"

"అలాగయితే అది నిజవేనన్నమాట అయినా ఎలక్సన్లకి అంత తొందరేటి?!"

"మరి పదేళ్ళు దాటింది కదా!"

"ఏటి! పదేళ్ళే!!" తెరచిన రాజుగారి నోరు మూతపడలేదు.

భవిష్యత్తు ఏమిటో చెప్పగల్గేవాడు మంచి జ్యోతిష్కుడవుతాడు. కాకుంటే మానవరూపంలో వున్న దేవుడతడు. మరి జరగబోయేది తెల్సికూడా చెప్పని వాళ్ళు మంచి నాయకులౌతారు.

కాగితం ముందు పెట్టంగానే దాని భవిష్యత్తు చెప్పగల్గేవాడు గుమస్తా అవుతాడు. దానిమీద సంతకం పెట్టకపోతే ఏమౌతుందో చుద్దాం అనుకునేవాడు ఆఫీసరౌతాడు. ఇవేవీ కాలేని వాళ్ళు ఓటున్న ప్రజలౌతారు.

దేవుడ్ని కొలిచే ప్రతిసారీ ఈ ఒక్క ఆపదనుంచి ఆదుకోమని ఓ నమస్కారం కొట్టి నెత్తిన వెంట్రుకలు సమర్పించుకోవడం సహజం. అప్పటికవి తగ్గినా, మళ్ళీ మళ్ళీ కష్టాలు రావడం, యధా ప్రకారం జుట్టు సమర్పించుకోవడం అలవాటై పోతుంది.

పైనున్న వాడికి ఇవన్నీ బాగా తెల్సు కాబట్టే రాబోయే అరిష్టాలు ముందుగానే చెప్పకుండా రాయిలా అయిపోయేడు.

'అందరూ తనవాళ్ళే అనుకునే దేవుడు అందర్నీ ఆదుకోడేం?' - అని కుమిలి పల్లి ప్రజలు ఎప్పుడూ అనుకోలేదు.

ఇప్పుడావూరు వూరులాలేదు.

స్మశానంలో పాతబడిన సమాధుల్లా కనిపిస్తున్నాయి కొంపలన్నీ! పచ్చటి పొలాలన్నీ ఎండిపోయి రెల్లుగడ్డి పొదల్లా గాలికి అల్లాడుతున్నాయి. చెట్టూ చేమా ఎండిపోయి ఆకలి చావని మనుషుల్లా ఆకాశం కేసి చూస్తున్నాయి.

అక్కడి రోడ్లమీద మిలమిలా మెరుస్తున్నవి మంచి ముత్యాలుగానీ, ముత్యాల వంటి మంచు బిందువులుగానీ కావు. అవి ఎండకి ధగధగమంటున్న రాళ్లు. కొండల



బండలు నిప్పుముద్దల్లావున్నాయి. నీళ్లెండి పోయిన చెరువు రోగిష్టి ముదుసలి శరీరంలా వుంది.

దొంకల్లోనూ, గోతుల్లోనూ కన్పిస్తున్న ఎముకల పోగులు తవ్వకాల్లో దొరికిన ప్రాచీన అవశేషాలు కావు – పచ్చిక బయళ్లన్నీ ఎడారుల్లా మారిపోతే పశువులు శాశ్వతంగా కన్నుమూసిన గుర్తులు అవి. బావుల్లో కప్పలు బయటకు రాలేక తెలుగు వాడి అరవ సంగీతంలా కొన్నాళ్లు అరిచి మరి ఓపిక లేక చచ్చిపడుతున్నాయి.

అసలే ఆకలి కడుపు దహించేస్తుంటే పడమరగాలి దావానలంలా చుట్టబెట్టేస్తుంటే దాహం తీరక వడదెబ్బతో ఇహలోక బంధాలు తెంచుకొంటున్న వాళ్లు అడపా దడపా ఒకళ్లిద్దరుంటున్నారు.

ఎండ తీక్షణతకు చెట్ల నీడల్లో తల దాచుకోలేని వాళ్లు నిలవ నీడలేని వాళ్లు మరోచోటు దొరక్క దేవాలయాన్ని ఆశ్రయిస్తున్నారు.

రోజు రోజుకీ పెరిగిపోతున్న ఎండ తీక్షణతకూ, దొరకని నీళ్ళకూ తల్లడిల్లి పోతున్నారు ప్రజలు. వాళ్ళ గోడు పట్టించుకునే నాథుల్లేరు.

ఈ విపత్తర పరిస్థితి నుంచి ఓటర్లను ఎలా ఆదుకోవాలో ఆ ఊరి నాయకులకు అర్థం కాలేదు. మరో రెండు రోజులు పోతే జనానికి ఎదురెళ్ళడం కూడా కష్టం.

ఎక్కడ చూసినా నీళ్ళ గురించిన చర్చలే... నీళ్లు వచ్చే మార్గం గురించిన అన్వేషణలే....!

'ఊరికి పెద్దలై వుండి –అందులోనూ అధికారంలో వుండి ప్రజలని ఇలాంటి కష్ట దశలో ఆదుకోపోతే ఎలా?!' అని అధికార పెద్దలు అనుకొన్నారు. ప్రజలూ అదేమాటఅన్నారు. 'తాత్కాలికంగా ఏవో కథలు చెప్పి తప్పించుకొన్నా ... ఇలా ఎంతకాలం?' అన్న అనుమానంలో పడ్డారు నాయకులు.

ఎవ్వరికీ ఏ పరిష్కారం తోచలేదు. ఏవేవో సలహాలు వస్తున్నాయి కానీ ఇవ మిద్దంగా ఇలా చేస్తే నీటి బాధ తొలగి పోతుందని ఎవ్వరూ తేల్చటం లేదు.

తేల్చిన ఒక్క శాస్త్రిగారి మాట అందరూ కొట్టేసేరు.

లేచిపోయిన కూతురి కోసం వూళ్ళన్నీ గాలించి ఇంటికి ఊసురోమని వచ్చేసరికి పెళ్ళాం పక్కింటి వాడితో సరసాలాడుతూ కన్పిస్తే ఎలా వుంటుందో సరిగ్గా అలాగే వుంది నాయకుల పరిసితి. ఇంతలో సూర్యుడు పడమర్న మరోసారి వురేసుకొన్నాడు.

కాలిపోయిన ఆకాశం ఇంకా ఆరిపో లేదు గానీ చెదిరిన ఎర్ర బొట్టులా వుంది. ఎండకి కాలిపోయిన ఇళ్ళని వెతు క్కుంటూ వచ్చింది కొండలచాటు నుంచి వెచ్చటి గాలి. వేపచెట్టు ఆకులు రాలుస్తూ స్వాగతం పల్కింది.

రచ్చబండ దగ్గర చేరిన జనానికి సహనం పూర్తిగా చచ్చిపోయింది. అందరూ కలిసి మునసబు మీద పడ్డారు.

'మరి ఆరేటంటారో?' –అన్న అను మానం మనసులోనే దాచుకొన్నారు మునసబుగారు.

ఇలాటి సమస్యలను రాజుగారే పరిష్క రించగలరని అక్కడున్న అందరికీ నమ్మకం.

"మరి పదవిలో వుండి దేనికేం?" అని గట్టిగా అన్నవాళ్ళూ వున్నారు.

అందరూ మునసబు, కరణాలకేసి

చూస్తున్నారు.

"మరి ఈ ఇసయంలో రాజుగారు ఏటిసేత్తారో అడుగుదాం. ఆరు ఏదో రకంగా నీళ్ల తెచ్చే ఏర్పాటు సేత్తారు. మీరేం బెంగెట్టుకోవద్దు. బేగి నీల్లొచ్చే ఏర్పాటు సేత్తాం... మీరెల్లండి..." అని సౌమ్యంగా చెప్పేరు మునసబుగారు.

ఓటు వెయ్యడానికి కారులో వెళ్ళి-ఓటేసింతర్వాతతీసురోమంటూ నడుచుకు పోతున్న వాళ్ళలా ఇళ్ళ దారి పట్టేరు ప్రజలు.

మునసబు, కరణం, కుంటి సత్తి, పోతరాజులు మాత్రం రాజుగారి ఇంటి దారి పట్టేరు.

వెలుగును మింగడానికి చీకటి సన్నద్ధం అవుతోంది.

పంచాయితీ రేడియో గరగర మంటోంది.

గాంధీగారి బొమ్మదగ్గర శనక్కాయలు, జీళ్ళ బుట్టలు చేరుకొంటున్నాయి. అయ్యరు హోటలు దగ్గర చెదురు మదురుగా జనం.

ముస్లిం చక్రవర్తులు ముందుగానే సమాధులు ఏర్పాటు చేసుకొన్నట్లు చాలామంది నాయకులు ముందు జాగ్రత్తపడి అభిమానుల్ని, యువజన సంఘాల్ని అడ్డు పెట్టుకొని శిలావిగ్రహాలుగా వెలిసిపోతున్నారు. మరి కొందరికి ఆపాటి శ్రమకూడా వుండదు.

అలా ఆయాస పడకుండా రాజుగారి పేరే ఆయనింటిదారికి ఏర్పాటయి పోయింది. గాంధీగారి బొమ్మ దగ్గర నుంచి కొంచెం ఎడమవైపుకొచ్చి వెలగని మూడో దీపపు స్తంభం దగ్గర కట్టేసిన గేదెల్ని దాటుకొని చిన్న మురికికాలవకు అసింటామళ్లీ కుడివైపుకు వస్తే అక్కడ బుట్టల్లో కోళ్ళు కిచకిచమంటూవుంటాయి. సరిగ్గా అక్కడ నిల్చునిచూస్తే...

వేపచెట్టు ఆ ఇంటికి కాపలా కాస్తూ వుంటుంది.

పెరటివైపు కొబ్బరిచెట్లు సెంట్రీల్లా వుంటాయి.

ఆ చెట్లమధ్య విశాలమైన స్థలంలో అలసిపడున్న గున్నేనుగులా పడుంటుంది ఆ పెద్ద పెంకుటిల్లు. ఆ ఇంట్లో ఎన్ని గదులున్నాయో తెల్సుకోవాలంటే వాళ్ళింట్లో పాచిపని చేసేవాళ్ళనడగాలి. వరండాలో వున్న పాతచెక్కపడక్కుర్చీ గత వైభవానికి గుర్తుగా వుంటుంది. బూజుపట్టిన కృష్ణుడు గోడకి వేల్లాడుతూ గోపికలకోసం ఎదురుచూస్తుంటాడు. ఆ పక్కన గాంధీగారు మంచంమీద సుఖాసీనులై వుంటే నెహ్రూగారు ఆయన దగ్గర పెద్దబాలశిక్ష చదువుకుంటున్నట్లుగా వినయంగా వుంటారు. వాళ్ళిద్దర్నీ జాయింట్‌గా మాసిపోయిన ఖద్దరు దండల్లో ఏనాడో వురేసేరు.

మరోవైపు మూడునామాల బొమ్మ వుంటుంది. అది ఆ ఇంటియజమాని బుద్ధికి ప్రతీకని గిట్టనివాళ్లు అనుకుంటారు.

ఆ ఇంటి యజమానిపేరు సెంద్రరావ్ నాయుడు.

సదరు నాయుడుగారికి ఆయనకు తెలీనంత భూమివుంది. ఎదుటి మనిషిని వేలంలో కొనగల శక్తివుంది. అవసరమైతే ఎవర్నైనా పట్టపగలే చంపేసి పక్కవీధి వాడిమీదికి ఆ కేసును తోయించగల తెలివితేటలున్నాయి. వయస్సుడిగిపోయిన భార్య వుంది. ఆవిడ తెచ్చిన బంగారం బేంకులో వుంది. ఊళ్ళో ముండలున్నారు.

ఆయనకు "గాంధీగారంటే గౌరవం. పేదలంటే ప్రేమ, వారికోసం ప్రాణా

అర్పించగల్రు" అని ప్రచారం చేసే థ క్టుకున్నారు.

పదవిమీద అత్యంత వ్యామోహం.

సర్పంచి రాజుగారందే అమితమైన అసహ్యం.





మాదిగవాడ జనం అంటే బోల్డు అభిమానం.

నాయుడుగారు కార్యశూరులు. అనుకున్నవి సాధించడం కోసం ఆఖరిక్షణం వరకు పోరాటం సాగిస్తారు. కాకుంటే ఆయనకు దక్కిందల్లా సర్పంచి పదవి ఒక్కటే!

అయినా పదవి కావాలని ఎప్పుడూ మారాం చెయ్యలేదు. తనకు రాజకీయ చైతన్యం కలిగింది రాజుగారి వల్లేనని చాలాకాలం ఆయన్నే నమ్ముకొన్నారు.

కాని, నమ్ముకొన్నవాడు మెచ్చి వరం ఇవ్వకపోతే...? దేవుడ్ని తిట్టిన పరమ భక్తులున్నారు. నమ్మిన నాయకుడ్ని నట్టేట్లో ముంచి పార్టీలు మార్చిన పెద్దలున్నారు.

సరిగ్గా వాళ్ళనే అనుసరించి ఓ శుభ ముహూర్తంలో రాజుగారితో తెగతెంపులు చేసుకొన్నారు నాయుడుగారు.

డబ్బొక్కటే పదవికి ప్రధానం అని నమ్మిన నాయుడుగారు బయటకొచ్చిన తర్వాత డబ్బుతోపాటు మరొకటి కూడా వుండాలని గ్రహించేరు. ఆనాటినుంచి ప్రజల్ని తనవైపు తిప్పుకునే ఏర్పాట్లలో నిమగ్నమైపోయారు.

రానురాను రాజుగార్ని గద్దె దించాలన్న పట్టుదల పెరిగిపోయింది.

ఏ మనిషిని, ఎక్కడ కొడ్తే చప్పుడు చేయకుండా చస్తాడో నాయుడుగారికి బాగాతెల్సు. ఏ కులాన్ని ఎపుడు రెచ్చ

గొడ్డే ఓట్లొస్తాయో రాజుగారు అదివరకే నేర్పేరు.

పట్నంలో పనులు ముగించుకొని వచ్చిన నాయుడుగారు అలసిన శరీరాన్ని పడక కుర్చీలో వాల్చేరు.

వరండాలో దీపం వెలగటం లేదు.

కుర్చీలో వాలి చుట్ట కాలుస్తూ కాళ్లు స్తంభానికి ఆనించి ఆలోచనల్లో మునిగిపోయిన నాయుడుగార్ని చూడగానే తపస్సు చేస్తున్న రుషిలా కన్పిస్తారు.

ఆయన వుక్కు మీసం గాలికి కదలటంలేదు.

బారెడు చుట్ట జానెడయింది. కనురెప్పలు మధ్య మధ్య మూసుకొంటున్నాయి. నిద్రలేని కళ్ళు చుట్ట నిప్పులాగే ఎర్రగా వున్నాయి.

అలా ఆయన అవస్థ పడుతుండగా...

గేటు తెరుచుకొని వస్తున్న ఇద్దర్నీ చికాగ్గా చూసేరు. ఎదురెళ్ళి స్వాగతం చెప్పాల్సిన అవసరం లేదు కాబట్టి చుట్ట నుసిరాల్చి కొంచెం కుర్చీలో కదిలేరు.

వచ్చిన వాళ్ళిద్దరూ నాయుడుగార్ని చూడంగానే మొహాలు చాటంత చేసుకుని వినయంగా నమస్కారం చేసేరు. ప్రతినమస్కారంగా నాయుడుగారు తల దించేరు.

"ఇదేనేటి తవరు రావటం...." కూర్చుంటూ అడిగేడు లింగం.

"ఎల్లిన పనైపోనాదా?" – సూరి పలకరింపు.

"పెపంచకం అంతా మోసవేనయ్యా! మాటమీన నిలబడే నా కొడుకు నేడుకదా! ఏ కాటికి దబ్బూ... దబ్బూ అంటూ కాకుల్లా అరుత్తారు. సి...సి..."మథన పడ్డారు నాయుడుగారు.

"బాంబురాజు అయిదరాబాదు నుంచొచ్చేడు..." – లింగం.

"ఆశికి కొత్తేం గాదుగా...సంగతు లేటంట?! మావోళ్లందర్నీ సూసొచ్చేడంటనా! పూర్నించి వచ్చిన నంజ కొడుక్కు ఆపదాలన్న బుద్దినేదు – ఎల్లేముందు పదో పాతికో దండుకోవడం తప్ప..ఛీ...ఛీ.. మనుసుల్లో ఇస్వాసం నశించిపోతోందయ్యా!" – మళ్ళీ చింతించేరు నాయుడుగారు.

"సర్పంచులకి ఎలక్సన్లట..ఓ వారంలో పేపర్లోకూడా ఏసెయ్యబోతున్నారంట... మంత్రిగారు సెప్పేరట..." – సూరి పూర్వం టెలిగ్రాఫ్ ఆపీసులో పన్జేయకపోయినా దేన్నయినా ముచ్చటగా మూడు ముక్కల్లో చెప్పగల నేర్పరి.

ఆ ఒక్క మాటతోనే......

నాయుడిగారి గుండె సడెన్‌గా ఆగిపోలేదుగానీ ఓఆర సెకండుమాత్రంఆగి మళ్ళీ యదావిధిగా కొట్టుకోవడం ఆరంభించింది. ముక్కుపుటాలు పులి గుహల్లా తెరుచుకొన్నాయి. కళ్లుపెద్దవై మొహం మీదకి పాకేయి.చేతిలో చుట్ట రవ్వలు చిందిస్తూ నేలను తాకింది. పిచ్చెక్కిన ఏనుగులా సడన్‌గా కుర్చీలోంచి లేచి చెంబులో మంచినీళ్లు ఒక్క గుటకలో మింగేరు.

"నిజవేనట్నా...?"

"మనకే ఆలీసెంగా తెల్సింది... అందరూ అప్పుడే పెచారాల్లో పడిపోనారట."

ఈసారి మాత్తరం ఎన్నికలు జరగాల్సిందేనని తేల్సేసినారట మంత్రులు. మరి మనం ఆలీస్సెం చేత్తే రాజుగార్ని కాసుకోవడం సేనా కట్టం." – లింగం అలుపు తీర్చుకోవడం కోసం ఆగేడు.

"అసలే నీల్లు నేక జనం సత్తా వుంచే ఇప్పుడే రావాలా ఎన్నికలు..." – సూరి

చాలా ఆలోచించి పదం వాడాడు.

"ఇలాటి సమయాల్లోనే సుకంగా గెల్సి యొచ్చు. అపొజిసనోల్లంటే ఏటి? ! సమయం సూసి అడావిడి సెయ్యటం... అనక బుద్ధిగా నుల్సోడం... ఓట్లు గుద్దించుకోవటం... ఆ దారినే మనం పోవాల..." నాయుడుగారు తాపీగా అన్నారు.

"అది నిజమే కానీండి! మరి మనూరు జనం అట్టగాదుగా... ఓటన్నావంటే నీల్లంటారు. ఇప్పుడు పొజిసనలాగుంది. అందుసేత మనం పెజల తరపున రాజు గారి మీదకు పబ్లిక్కుగా తిరగబడాల" – కర్తవ్యం బోధించేడు లింగం.

"ముందే తిరగబడ్తే ఎలక్సన్లటయానికి జనం మనల్ని మర్చిపోతారు. ముందు పిల్లకాకుల్ని అరిపించేసి అనక మనం ముందుకురావాలి" – సూరి.

"ముందు మనోల్లనందర్నీ రేపు కలవ మను. ముందు ఎవలు ఎక్కడ నుల్సో వాలో... ఖర్సెంతో తెల్సుకోవాల. అనక రంగంలోకి దిగొచ్చు" నాయుడుగారు నిదానంగా అన్నారు.

"తాలిపారి మనం అపోజిసన్లో నుల్సోటం... సేనా జాగర్తగావుండాల. ప్రతి సిన్నదాన్ని అడ్డెట్టుకొని పెజల్లోకి జొరబడి పోవాల..."–సూరి.

"ఇన్నాల్లకి మనకి సేన్సొచ్చింది. జాగర్తగా కాసుకుంటేసాలు రేపొద్దున్నే అందర్నీ తోలుకురండి...ఎల్లండి..."

రాజాజ్ఞ అయింతర్వాత ఇద్దరూ అక్కడనుంచి కదిలేరు. తమ పార్టీ గెలిస్తే నాయుడుగారు తమకేంపదవి ఇస్తారోనన్న వూహ ఇద్దర్నీ రోడ్డుమీదకు లాక్కొచ్చింది. గుమ్మం దాటి రోడ్డుమీదకు రాగానే బాంబు రాజు ఎదురయ్యేడు.

"నాయుడుగారున్నారా?!"–అడిగేడు లింగంను.

"నీమీదగయి పోతున్నారు..."

"ఎందుకేటి?!"

"నిన్న పొద్దుగాల వచ్చి ఆపడ్నేదని"

"ఇది మరీ సిత్రం. నాయుడుగారు పట్నం పోనారుగదా?!"

"బేగెల్లు. తిండికి కూకుంతారు..."

"సూడు... హయిదరాబాదు పోతున్నా...ఏమైనా పనుందా?!"

"ఎప్పుడెల్తున్నావ్?!"

"రేపు రేలెక్క పోతా. బోలెడు పన్లాగిపోనాయి... రేపాపద్దా... వుంటా మరి."–అంటూ బాంబురాజు నాయుడు గారి ఇంటిముందుకు గెంతేడు.

వరండాలోంచి గదిలోకి వెళ్ళబోతున్న నాయుడుగారు క్షణం ఆగేరు. అడుగులో అడుగేసుకుంటూ వస్తున్న శాల్తీని చూడంగానే ఉగ్రనర్సింహమూర్తిలా మారి పోయేరు.

అర్ధంటుగా మొలిచిన చెట్టును చూసినట్లు ఆశ్చర్యపోయేడు బాంబురాజు. –వెంటనే వినయంలో మునిగిపోయేడు. అప్రయత్నంగా నమస్కరించేడు.

అధికార పార్టీనుంచి అపోజిషన్ పార్టీలోకి దూకేసిన బావమర్దిని చూసినట్లు ఓ చూపు పారేసి మీసాల చాటునుంచి పల్చటి నవ్వును పెదాలమీదకు పంపేరు నాయుడుగారు.

ఆ నవ్వును భూతద్దంలో చూసి తబ్బిబ్బయిపోయాడు బాంబురాజు.

అతగాడి కొడుకులెవ్వరూ ఆఫీసర్లు కాలేదు. బంధువులెవ్వరూ పేపర్లో స్టేట్మెంట్సు ఇచ్చేంత నాయకులు కాలేదు. అతగాడి తండ్రి గాంధీగారితో పాదయాత్ర

చెయ్యలేదు. అంబేద్కరుకు సలహా దారుడూ కాదు. పాకల మధ్య మేడ కట్టు కునే లౌక్యుడూ కాదు. అయినా ఆతగాడి పేరు అందరికీ తెల్సు.

అతడు చేసిందల్లా తన తాతలు చేసిన అప్పులకు ఇప్పటివరకు వూడిగం చేసేడు. పెళ్ళి చేసుకొన్న పాపానికి పిల్లల్ని కన్నాడు. ఒళ్ళు కాలి చచ్చిపోయిన పెళ్లానికి ఖర్మ చేశాడు.

పుట్టిన మొదటి ముగ్గురూ ముందుగా ఇంటిమేషన్ ఇవ్వకుండానే చచ్చిపోయేరు. అందుకు భార్యతోపాటు గుక్కపెట్టాడు. పేదవాడు ప్రార్థించినా దేవుడు ఆలకిస్తా డని ఏడాది తర్వాత ఓరోజున రుజువైంది. ఆరోజు తనే దేవుడికి గుడి కట్టించినంత సంబర పడ్డాడు. నాటుసారాకి బదులు కంపెనీ బ్రాందీ తాగినంత సంతోషిం చాడు. అందరిలా పుట్టిన వెంటనే చావ కుండా బతికివున్న కూతుర్ని చూసి, చేతులెత్తి పైకి చూసి నమస్కరించాడు.

పువ్వుల్లో పెట్టి పోషించే స్తోమతలేని కోటేశు గుండెలో దాచుకొని పెంచాడు అలా పుట్టిన చింతల్లిని.

చింతల్లికి నాలుగో ఏడు వచ్చేసరికి తల్లి ఒంటికి నిప్పంటించుకొని చని పోయింది. కారణం ఎవరికీ తెలీదు. అది దాని ఖర్మ అనుకొని సరిపెట్టుకున్నాడు కోటేశు.

ఎదుగుతున్న పిల్లను చూసి తరుగు తున్న తన వయస్సునీ, కరగని కష్టాల్నీ సంతోషంగా మర్చిపోగల్గుతున్నాడు కోటేశు.

అర్జంటుగా కూతుర్ని కాన్వెంటులో చేర్చి వచ్చీరాని ఇంగ్లీషు కబుర్లు వినాలని అతను ఆశపడలేదు. మంచి చదువు చెప్పించి డాక్టరుకో, ఇంజనీరుకో ఇచ్చి



కట్టబెట్టాలని కూడా కలలు కనలేదు.

రోజూ సాయంత్రం వేళ చింతల్లిని భుజాలమీద ఎక్కించుకొని ఐదు పైసల జీడి కొనిపెట్టి వూరంతా తిప్పటం అతగాడికి అలవాటు. పండగనాడు పెద్దోరి యింట్లో ఇచ్చిన పిండివంటల్ని బలవంతంగా కూతురి గొంతులో కుక్కేవాడు. క్షణం కూతురు పక్కన లేకపోతే తల్లడిల్లి పోయేవాడు.

చింతల్లి పుట్టింతర్వాత కోటేశుకి దిగులంటే ఏవిటో తెలీదు. ఉన్నా అది కూతుర్ని చూడంగానే ఇట్టే మాయం అయ్యేది.

చింతల్లికి వరదలా వయసొచ్చేసరికి మొదలయింది కోటేశుకి అసలు దిగులు. అంతవరకూ గుట్టుగా వుంటున్న సంసారం రోడ్డుమీది కొచ్చింది. 'రాబోయే రోజుల్లో కూతురు బతుకు ఎలానా?' అని దిగులు పెరిగి పెద్దదయింది. దాంతో పాటు వయస్సు, శక్తి సన్నగిల్లింది.

చింతల్లి చిరిగిన రంగుల లంగాలో విచ్చుకొన్న నల్లకలువలా, నూనె రాసిన నల్లశిల్పంలా మెరుస్తూ వుంటుంది. ఆమె పరుగుకి కదిలే వక్షోజాల కదలిక నల్లకొండ జలదరింపులా వుండి చూసే జనంకి మరో అడుగు పడనీయదు. పిగిలిన జాకెట్టులోంచి కన్పించే అందాలు గుండెకు వేగాన్ని, రక్తానికి పరుగును పెంచుతుంది.

చింతల్లి అందచందాల్ని చూసిన ప్రతివాడూ కోటేశు ఇంటి అడ్రస్సు తెల్సుకుంటాడు. దార్నపోయే ప్రతివాడూ అతగాడి యోగక్షేమాలు కనుక్కోవడం ఆరంభించేరు. మాలపల్లి వరకే వున్న అతగాడి ఖ్యాతి మెల్లగా వూళ్ళోకి కూడా పాకింది.

"ఏంటా కోటిగా! అది నీ కూతురేనేటి.. మా ఇదిగా పెటపెటలాడిపోతోంది" అని చింతల్లిని చూస్తూ చుట్టకు బదులు నాలిక కరచుకొన్న వాళ్ళను చూసినపుడు పులుల మధ్య కుందేలు పిల్లలా బెదిరిపోయేవాడు కోటేశు.

పేదోడి కూతురు అందంగా వుండడం వల్ల వచ్చే ఇబ్బందులు అప్పుడు గాని అర్థం కాలేదు కోటేశుకి. ఇంతమంది ఆకలి చూపుల మధ్య నుంచి కూతుర్ని ఎలా దక్కించుకోవాలో తెలీలేదు.

చాలామంది వలలకి దొరకని అల అయ్యింది చింతల్లి.

ఎదుటి వాళ్ళ చూపులకి అర్థం, కనుగీటుల తాత్పర్యం తెల్సుకునేసరికి చింతల్లి అబ్బుల చూపుల వలనుంచి మాత్రం తప్పించుకోలేకపోయింది.

అబ్బులు కొంటెగా చూస్తే చక్కిలిగింత పెట్టినట్లుగా వుండేది. అతన్నలా చూస్తూ ఎన్ని గంటలు గడిపినా ఒక్కక్షణంలా అన్పించేది. అతగాడి పలకరింపు కోసం తహతహలాడిపోయేది. ఏ పని చేస్తున్నా అతగాడే ఎందుకు గుర్తుకొస్తాడో ఓ పట్టాన అర్థం కాలేదు.

తండ్రికి అన్నం పట్టుకెళ్ళేటప్పుడు అన్ని చేలవైపు కళ్ళు చీల్చుకుని మరీ చూసేది చింతల్లి. అబ్బులు కన్పించకపోతే కసిగా తిట్టుకునేది. ఏడుపొచ్చేది. అతగాడు కనబడగానే అడుగుపడేదికాదు. చుట్టూ వున్న జనం ఏమనుకుంటారోనన్న ఆలోచన అసలొచ్చేదికాదు.

ఇద్దరూ కళ్ళతో మాట్లాడుకునేవారు. నవ్వుల్లో లోకం మర్చిపోయేవాళ్ళు.

కూతురి పరధ్యానం, మతిమరుపు చూసి కోటేశుకు మతిపోలేదు. కానీ వచ్చిన మార్పు గురించి తెలుసుకోవాలన్న దుగ్ధ మాత్రం పెరిగింది.

"తల్లీ... ! నీలో నువ్వే మానావు సంబరపడిపోతున్నావ్ ! ముద్దు ముద్దుకి గతుకులేతుంటావ్. నీకేటయింది అలగై పోతున్నావ్ ?" అని అడిగేడో రాత్రి.

"ఏట్నేదు..." అని సింపుల్‌గా చెప్పి కలలోకి జారుకొంది చింతల్లి.

మరో ప్రశ్న స్ఫురించలేదు కోటేశుకు.

ఆ రాత్రి కలలో చింతల్లికి అబ్బులు కత్తి పట్టుకొని కోట దూకి తన పాక దగ్గరకొచ్చాడు. తనేమో పంజరం నుంచి బయటపడ్డ పిట్టలా అతగాడి కౌగిట్లోకి దూరిపోయింది. ఇద్దరూ పట్నంలో బయస్కోపు చూసి వూరిమొదట్లో తుమ్మచెట్ల తుప్పలదగ్గర ముద్దుల వెచ్చదనంలో కరిగి అలసిపోయేరు.

ఆ అలసిపోడానికి అంతులేదు కాబట్టి చింతల్లికి మెలుకువ రాలేదు. వచ్చేసరికి ఎండ చుర్రుమంటోంది. 'ఇప్పుడు నేనెక్కడున్నాను'—అని స్వగతంలో తెలుగు సినిమా హీరోయిన్‌లా అనుకొని చుట్ట కాలుస్తున్న తండ్రిని చూడంగానే తెలిసి సిగ్గులో మొగ్గలేసింది.

అబ్బులు ఆరడుగుల అందగాడు, ఆజానుబాహుడు, వంకీల జుట్టువాడే. అయినా పద్మనయనంబులవాడు కాదు. అతగాడికి చదువుకోవాలన్న సరదాలేదు. కరణంగారి అబ్బాయిలా బొమ్మల చొక్కాలు వేసుకోవాలని లేదు. సర్పంచి పదవి చేజిక్కించుకోవాలనే కోరికాలేదు.

చింతల్లిని పెళ్ళాడాలన్న కోరిక మాత్రం ఉంది.

'ఆ కోరిక తీరుతుందా ?' అన్న బెంగ వుంది.

'తీరినా సవ్యంగా బతగ్గలమా ?' అన్న భయం కూడాఉంది.

ఇష్టమైన ఆడదాన్ని పెళ్ళి చేసుకోవాలంటే చాలా రూల్సు రెగ్యులేషన్సుఏడుస్తాయని అబ్బులుకి తెలీదు. తెలిసేసరికి చింతల్లి ప్రేమనుంచి బయటపడ్డం అసాధ్యం అనే స్థితికి వచ్చేసేడు.

ఏట్టి పరిస్థితుల్లోనూ చింతల్లిని స్వంతం చేసుకోవాలన్న పట్టుదల పెరిగింది.

తమ ప్రేమ బయటపడ్తే జరగబోయే పర్యవసానం అబ్బులుకి బాగాతెల్సు. అలా అని చింతల్లిని వదులుకోలేదు. 'నాకో మార్గం చూపించు ప్రభూ!' అని దేవుడ్ని మాత్రం సాధ్యమైనన్ని సార్లు వేడుకొన్నాడు.

ఈ దేశంలో చదువుకొన్నవాడికి వుద్యోగం, దేవుడికి దయ సకాలంలో రావనుకొన్న అబ్బులుకి సెందర్రావు నాయుడు గుర్తుకొచ్చేడు.

వెంటనే హాయిగా వూపిరి పీల్చుకొన్నాడు. ఆనందం పెల్లుబికింది అది గంతులేయించింది. తన ఆనందం ఎవరితో పంచుకోవాలో అర్థం కాలేదు. అది గుప్పెట్లో పొగలా అతన్ని స్థిరంగా వుంచలేదు.

అబ్బులు నడక మానేసి పరుగు ప్రారంభించేడు.

అప్పటికి ఆకాశం నల్లచీర చుట్టుకుంటోంది.

వెచ్చటిగాలి దుమ్ముతోకూడి అబ్బులుకి అడ్డుగా నిల్చింది. చెరువుగట్టు అవతల వైపుకు వచ్చేసరికి ఆయాసం వచ్చింది. కళ్ళురెండూ నాలుగు చెరగులా కలయ చూస్తున్నాయి.. ఎక్కడా చింతల్లి జాడ లేదు. చిరు చికాకు అతగాడ్ని బంధించింది. కోపంగా చీకట్లోకి రాళ్ళు విసుర్తూ కూర్చున్నాడు అబ్బులు.

అడుగుల శబ్దం అయ్యింది.

తలెత్తి చూడలేదు అబ్బులు. అయినా

ఆ వచ్చేది చింతల్లేనని గ్రహించేడు.

మధ్యమధ్యలో తిరిగి చూస్తూ తన్నె వరూ చూడటం లేదని నిర్ధారణ చేసుకొని అంతులేని ఆనందంలో అబ్బులు చేరిన చింతల్లి మధ్యరాత్రి గోడదూకి వచ్చినా మొహం మృదంగంలా బిగించుకొని కూర్చున్న ప్రియుడ్ని చూసినట్లు ఆశ్చర్య పోయింది.

శిలలా వున్న వాడి భుజం పట్టుకొని కుదిపింది.

ఆఖరు సీనులో చావు మంచంమీద మూరెడెత్తు పైకిలేచి గుండె పగిలేలా ఓ చిన్న నవ్వు విసరి "వచ్చేవా?" అని మెల్లగా అని ఢపీమని చచ్చే హీరోలా అతను చింతల్లి కేసి చూసేడు.

ప్రియుని భావం ప్రియురాలికి తెలీక పోవటం చాలా దారుణం.

చింతల్లికి చిరుకోపం వచ్చింది.

"ఏటలగ వులుకు పలుకు లేకుండా కూకుంది పోనావ్?" అని అంది ఆఖరికి.

"ఇంతసేపేటి సేత్తున్నావ్?"

"ఏటి సెయ్యమంతావ్?.. నీకేటి కబుర్లు సెపావ్. ఎవలూ సూడకుండా రావటం అంటే మాట్లేటి?!" చిరాకు పడింది.



అలక నటించటం అబ్బులుకి చేత కాలేదు. మరికాసేపు తనలా బిగుసుకుపోయి భారంగా మాట్లాడితే చింతల్లి రుసరుసలాడుతూ వెళ్ళిపోవటం ఖాయం. అందుకని—

"నీ కోసరం జపంసేత్తూ కూకుంది పోనాను పన్లన్నీ వొగ్గేసి"

"పన్లన్నీ వొగ్గేసినందుకేనేటి ఇసారవంతా..!"

"ఆ...ఆ.. నిన్ను సూడ్నేదని.."

"ఇదెప్పట్నుంచి..?!"

"ఏటిది?"

"అబద్ధాలాట్టం గూడా నేర్సినావు. ఇంక కతలేటయినా సెప్తావ్.."

"మన పెల్లిగురించి సెబ్తారని వేగం పారొచ్చేను. నువ్వేటో దొరపిల్లనాగా కులాసాగా పారొచ్చినావ్. కోపం రాదేటి?"

"నీ కోపంకేటిగాని... పెల్లి సంగతేటి?! సెప్పవా...బేగి సెప్పవా?!"

"సెప్పేననుకో...ఏటిత్తావ్?!"

క్షణం ఆలోచన్లో పడింది చింతల్లి. ఆమె నోటినుంచి రాలబోయే మాట కోసం ఎదురు చూస్తూ అబ్బులు.

"నువ్వే సెబ్దూ ఏటియ్యమంతావో!"

"కుసింత జరుగు సెప్తాను" అంటూ అబ్బులు చింతల్లి నడుంచుట్టూ చెయ్యి వేసేడు.

"అర్థమైపోనాది.. నీకిదేటి జబ్బు. ముందు సెప్పు" – అతని బంధం నుంచి తప్పించుకోలేదు చింతల్లి.

"ఇన్నిరోజులూ మన పెల్లి గురించి ఇసారంలో పడిపోనామా? ఇక మనకేటి బయం నేదు. ఎలగంతే..సెంద్రరావ్ బావునేడా? ఆరితో సెప్పి.."

"ఏటింకా సెప్పనేదా?!"

"నాసనుకుందే ఇందాకల.. మానావు తొందరపడిపోతున్నవ్?!"

"నీకు నేదేటి తొందర..!"

"ఆ బాబుగాని తల్సుకుంతే..మనకి పెల్లి కాయం. ఆనక ఎవలేడ్సినా మనకేటి బయం వుండదు.. అర్దమైందా?!"

"నువ్వెప్పుడు సెప్తావ్?! ఆ బాబెప్పుడు సేత్తాడు.." – స్వగతంలోనే అనుకొంది.

"పెల్లికాడ, కూడుకాడ నిదానం వుండాల.."

"అలాగేటి.. నన్నొగ్గు. మా అయ్య నా కోసరం వూరంతా గాలింతేత్తుంటాడు.."

"సెప్పేసి రాకపోనావా?!"

"నీగ్గాని మతోతాందేటి?!"

"కాబోయే మొగుడ్ని గాదా"

"సంబడం.. ఈ మాటగాని మా అయ్యకు తెల్సిపోనాదో ఇద్దరి పేగుల్నీ తీసేతాడు. మరి నానెల్తాను.."

"ఏటి వచ్చిన కాడ్నించి సూత్తున్నాను..ఎల్తాను..ఎల్తానంటూ వూగింజుకుంతావేటి. ఆపాటిదానికి రావటం ఎందుకోస్" – మరింత దగ్గరగా లాక్కుంటూ అన్నాడు.

చింతల్లి సమాధానం చెబ్దామనుకొంది కానీ ఆ ప్రయత్నం ఫలించలేదు. అతని బాహువుల్లో ఇరుక్కుపోయింది.

ఇద్దరూ చీకట్లో చుక్కయిపోయేరు.

చీకటి ఇద్దర్నీ చూసి సిగ్గుపడ్తోంది—గాలి ఇద్దరిమధ్య ఇరుక్కుపోయి ఇబ్బంది పడ్తోంది.

కాలానికి ఆవేశం వచ్చింది.. అంతే..

క్షణాలు వేగంగా పరిగెట్టడం ప్రారంభిం చేయి.

* * *

ఆ సాయంకాలం ..

మాలపల్లి కెవ్వరూ నిప్పంటించలేదు.

అర్థంటుగా ఏ మంత్రిగారూ వచ్చి గబుక్కున రోడ్డు మీద దుమ్ము లో హాయిగా ఆడుకొంటున్న కుర్రగాడ్ని ఎత్తుకొని ముద్దాడలేదు. నడిరోడ్డుమీద ఆడదాన్ని కామందులొచ్చి సరదాగా మానభంగం చెయ్యలేదు.

పాకల మీద పొగ మాలపల్లి మీదున్న ఆకాశానికి మరింత నలుపు రంగు పూస్తోంది.

పిల్లల పరుగులు రేపిన దుమ్ము ఇంకా నేలను చేరలేదు.

కాని మాలపల్లిలో క్షణంలో సంచలనం రేపింది.

సన్నని ఏడుపులు సాయం సంగీతంలా వినిపిస్తున్నాయి. గోచీలేని పిల్లలు, గోచీలున్న వృద్ధులు, చీరపైట జారినా ఏ కళ్ళూ తమని గుచ్చి గుచ్చి చూడవన్న నమ్మకం వున్న ఆడవాళ్ళు, ఏం తోచని వాళ్ళు, తోచినా ఏం చెయ్యాలో అర్థం కానివాళ్ళు అందరూ ఆ పాక దగ్గర గుమిగూడేరు.

గుంపు మధ్యన పడున్న శవం నల్లగా పాచిపట్టి రాయిలావుంది. చర్మం కప్పేసిన అస్తిపంజరంలా వున్నాడు అతగాడు. బతికున్నప్పుడు రెండవున్సుల రక్తం వుందికాబోలు ఆ కాస్తా బయటకొచ్చి గడ్డకట్టింది. రక్తం కూడా అతగాడిలానే నల్లగా వుంది.

అతగాడు అలా హాయిగా చీకూ చింతా లేకుండా పడుండక ముందు మాలపల్లికి నాయకుడు కాదు. కేవలం ఓ అందమైన ఆడపిల్లకు తండ్రి. బాకీలకు వడ్డీలు తీర్చలేనివాడు. మూడు పూట్లా సవ్యంగా ముద్ద చూడనివాడు.

చీమల బారులోంచి దారితప్పిన ముసలి చీమలా అతను పొలం గట్టుమీద అడుగులో అడుగేసుకుంటూ వస్తుంటే అతగాణ్ని ఆపి సరదాగా కొమ్ముల మధ్య ఇరికించుకుని భయంతో సగం ప్రాణం పోయిన అతగాణ్ని కిందపడేసి కాళ్ళతో తొక్కి చక్కాపోయింది ఓ అంబోతు.

అది కామందు గారిది కాదు.

నాయుడుగారు పందెం కోసం పెంచిందీ కాదు.

దారితప్పి ఆవూరు వచ్చిందీ కాదు.

ఫలానా పొలంలో మాత్రమే గడ్డితినాలన్న రూలుకి కట్టుబడి వుందికాదు. ఎక్కడ మేసినా దెబ్బ కొట్టరన్న నమ్మకం కలది. తనేం చేసినా చెల్లుతుందనే ధీమా దానికి దేవుడిచ్చేడు. దేవుడికెవరో దాన్ని దానంచేసేరు. పంచాయితీ వెంటనే ముద్రకొట్టింది.

అదే మరో అంబోతు అయ్యుంటే ఈ పాటికి కర్రలు, కారం, తలకాయలు గాల్లో ఎగురుతుండేవి. కాని ... ఇప్పుడు సాక్షాత్తు భగవంతుడే ఈ పుణ్యకార్యం జరిపించేడని అక్కడున్న పెద్దలందరూ ఏకగ్రీవంగా తీర్మానించేరు.

"ఇప్పుడేటి సెయ్యాల....?" అని తమలో తాము చర్చించుకొన్నారు.

"ఎవరి జోలికి వచ్చేటోడు కాదు. వున్నంత కాలం మారాజునాగా బతికేడు. సేనా అదురుట్టవంతుడు. మంచంలో తీసుకొని సచ్చేకన్నా సుకంగా పోనాడు"— అని కొందరు సానుభూతి చూపించేరు.

"పాపం ఆబొట్టినొగ్గేసి పోనాడు.."

అంటే 'కూతుర్ని కూడా తనతోపాటు

తీసుకు పోలేదేం ?' అని వాళ్ళవుద్దేశం కాదు.

రాజుగారు పోతే దిగులుపడ్డ ప్రజల్లా, గాంధీగారు పోయినప్పుడు దేశంలా అందరూ అతగాడి మంచితనం గురించి, కూతురి వయస్సు గురించి, ఆమె ముందు జీవితం గురించి గుంపులు గుంపులుగా చర్చల్లో మునిగిపోయేరు.

పాకల్లో లాంతర్లు నిప్పంటించుకోలేదు.

పొయ్యిలోకి పుల్లలు ఇంకా చేరలేదు.

కోటేసు శవం మీదపడి పాలుదొరకని చిన్నిపాపలా రోదిస్తోంది చింతల్లి. ఆమెను గట్టిగా పట్టుకొని ఓదారుస్తున్న ఇద్దరూ ఏడ్చే వోపిక లేనట్టుగా వున్నారు.

చింతల్లి చెరిగి పోయిన జుట్టుతో, కరిగి పోయిన బొట్టుతో,కన్నీళ్ళ చారికల్తో అబ్‌స్ట్రాక్టు ఆర్టులా వుంది.

ఏమీ అర్థం కాని చిన్నపిల్లలు తల గోక్కుంటూ చూస్తున్నారు.

ఆస్తీ అంతస్తూ వున్నవాడు పోతే ఏర్పాట్లన్నీ అర్జంటుగా జరిగిపోతాయి. అదే దిక్కూ మొక్కూ లేనివాడు పోతే ఖర్చు ఎవరు పెట్టుకోవాలో తెలీదు. అందుకే వాడు బతుకున్నా, చచ్చినా



సమస్యే.

చీకటి బాగా చిక్కబడింది.

గాలి పల్చన పడింది

సానుభూతి చూపించేసిన వాళ్లు ఇళ్ళ దారి పట్టేరు.

దూరంగా వున్న అబ్బులు చింతల్లిని ఓదార్చలేదు. వెళ్ళి ఆమెకు ధైర్యం చెప్పాలని వుంది.కాని ఆపనిచేస్తే అందరికీ అసలు విషయం తెలుస్తుందన్న భయం. అందుకే మౌనంగా వుండిపోయేడు.

అందరూ అలా చింతాక్రాంతులై వుండగా మాలపల్లిలో చీకటి చీలింది.

అదే వైపు అందరూ దృష్టి సారించేరు.

కదలి వస్తున్న ఖద్దరు చొక్కాలను చూడంగానే వినయంగా లేచినుల్చున్నారు. దారి చూపించడం కోసం దీపాలు పట్టుకొన్నారు. కాల్తున్న చుట్టల్ని ఆర్పి చెవుల్లో దోపుకొన్నారు.

భగవంతుణ్ని చూసిన భక్తుల్లా అందరూ అతివినయం ప్రకటిస్తూ ఆశ్చర్యంలో మాటలు మర్చిపోయేరు.

వచ్చిన ఆయనపేరు చెబితే చచ్చిన కోటేశు కూడా భయంతో గబుక్కున లేచి కుర్చోవచ్చు!

ఆయన అడుగులు చేరువయ్యేయి.

అందరూ దారిచ్చి దండాలు పెట్టేరు. అదే మరొక్కప్పుడైతే దండలు కూడా వేసేవాళ్లే!

ఆయన బాధగా తలొంచుకొని దుఃఖించేరు.

పక్కనున్న వాళ్లు ఆయన్తోపాటు మరోసారి బాగోదని ఏడ్చేరు. కొన్ని క్షణాల తర్వాత—

"అసలేటి జరిగింది ...?"అన్నట్టుగా జనాంతికంగా చూసేరు.

ఓ ముసలి బక్క చిక్కిన ఎండు పుల్లలాంటి ముసలాడు వణుకుతూ అసలు విషయం చెప్పేడు.

'దేశం మరో మేధావిని కోల్పోయింది' అన్నట్లుగా గట్టిగా కళ్లుమూసుకొని ఆకాశంకేసి చూసేరు.

శవం చుట్టూ వున్న జనం ఇప్పుడు ఆయన చుట్టూ చేరేరు.

కొంపలు కాలిపోయినా,మునిగిపోయినా తాపీగా విమానంలోవచ్చి చచ్చినవాడికి, చావబోయేవాడికి చందాలు ప్రకటించి పోయే మంత్రిగార్ని చూస్తున్నట్లు అందరూ ఆయన నోటి వెంట రాలబోయే మాటల కోసం ఎదురు చూస్తున్నారు.

పెల్లుబికిన దుఃఖం ఆయనకు మాట రప్పించలేదు.

"సూడమ్మా... మనం ఎంతేడ్సినా పోయినోడు తిరిగొత్తాడా?! కష్టమైనా కుసింత దిగమింగుకోవాల. మావందరం వున్నాం. నీకేటి బెంగనేదు" అని ఆయన వేదాంత ధోరణిలో చింతల్లిని ఓదార్చేరు.

"సూడు ... మునసబూ తర్వాత ఏర్పాట్లు సూడు" అంటూ జేబులోంచి ఓ యాభైరూపాయల నోటు తీసి అందించేడు.

అక్కడున్న అందరికీ నిజంగా మతి పోయింది. కోటేశు అదృష్టాన్ని తల్చుకొని ఈర్ష్యపడ్డారు. తాము చచ్చినా యాభై గ్యారంటీఅనుకొన్నవాళ్ళు మనసు కుదుట పర్చుకొన్నారు. రాజుగారి విశాల హృదయాన్ని గబగబా పొగిడేరు.ఆయన మంచితనం, ఔదార్యం చర్చనీయాంశాలుగా మారేయి.

మునసబుగారు అక్కడున్న నలుగురైదుగుర్ని పిలిచి మిగతా తతంగానికి ఏర్పాట్లు చేయించేరు. వురుకులు పరుగుల మీద కోటేశు అంతిమయాత్రకి సర్వ

సన్నాహాలు సిద్ధం చేసేరు. ఎవ్వరి కష్టం రాజుగారు వుంచుకోదల్చుకోలేదు. శ్రమకు తగ్గ ప్రతిఫలం ముట్టచెప్పేరు.

అందరూ ఆఖరిసారిగా మౌనంగా బాధపడ్డారు.

పాడెక్కుతున్న తండ్రిని చూసి గొల్లు మంది చింతల్లి.

హారతి పాటలా అందరూ మరోసారి ఓపిక తెచ్చుకొని చింతల్లికి వంతపాడేరు.

"ఆ బొట్టి గురించి ఎవరూ సింత పడక్కర్లేదు. రాజుబాబుగారే సుకం కష్టం చూసి పెల్లి అదిగూడా సేయిత్తారు. అరికి కష్టాల్లో వున్నవోల్లని ఆదుకోవటం మొదట్నించి అలవాటు. అంసేత మరెవ్వరూ దిగులు పడకండి" అని మునసబు అందరి సమక్షంలో వెల్లడించేరు.

ఆలస్యం జరక్కుండా అందరూ రాజుగారికి జోహార్లు అర్పించేరు. పేదల ఎడల ఆయనకున్న శ్రద్ధను మరోసారి వేనోళ్ళ కొనియాడేరు.

స్వంత డబ్బుతో సన్మానం చేయించుకొని సభా ముఖంగా సిగ్గుపడ్తూ సమాధానం చెప్పేవాడిలా—

"ఇదేటో పెద్ద ఇసయం కింద మునసబు సెప్పేడు. నా పెజల్ని నానాదుకోపోతే ఎలాగ? మీరోటి నేనోటి గాదు. నా సొంత బిడ్డల్లా కాసుకుంతాను పెజల్ని" అని పొడిపొడిగా అన్నారు రాజుగారు.

చప్పట్లు చరిచేరు.

ఖద్దరు గుడ్డ లేసుకొన్న దేవుడిలా కన్పించేరు రాజుగారు అందరికీ. అందుకే వారు చేతులెత్తి దండాలు పెట్టేరు.

కోటేశు శ్మశానం చేరడానికి ప్రయాణం అయ్యేడు.

రాజుగారు మాలపల్లిలో అందర్నీ కలుసుకొన్నారు. అందరి బాధల్ని ఓపిగ్గా విన్నారు. చింతల్లి పోషణ భారం గురించి అందరికీ చెప్పేరు.

మునసబు, కరణాలు చింతల్లిని ఓదారుస్తున్నారు.

చాలా పాకల్లో కోటేశు గతం గురించి, రాజుగారికి పేదల ఎడలగల ప్రేమ గురించి పొగుడుకొంటున్నారు.

కోటేశు పాకలో దీపం దీనంగా వెలుగుతోంది. రాట నానుకొన్న చింతల్లి పాతిపెట్టినా బయటకొచ్చిన శవంలా వుంది.

చాలామంది శ్మశానం దాకా వెళ్ళేరు.

మిగతా వాళ్ళు ఇళ్ళకు చేరేరు.

రాజుగారు వూళ్ళోకి బయల్దేరేరు. ఆయన్ని సాగనంపుతూ మరి కొందరూ.

అందరూ కనుమరుగయ్యేం తర్వాత చిన్నగా అబ్బులు పాక దగ్గిరకొచ్చేడు.

దీపం వెలుగు మసక మసగ్గా వుంది.

గుమ్మంలోంచి అబ్బులు నీడ చింతల్లి మీదకి పాకింది.

చింతల్లి కళ్ళు ఎర్రగా వున్నాయి. మొహమంతా వుబ్బిపోయింది. ఆమె కన్నీటిలో దీపం వెలుగు కరుగుతోంది.

అబ్బుల్ని చూసింది చింతల్లి. కంటి కొనలనుంచి కన్నీ రొలికింది.

అబ్బులు మౌనంగా వుండలేక పోయేడు చింతల్లిని దగ్గరకు తీసుకొన్నాడు.

దీపం దిక్కులు చూస్తోంది.

వీధి చివరి కుక్క తాపీగా అరుస్తోంది.

మాలపల్లి మళ్ళీ మామూలుగా మారింది.

చింతల్లి అబ్బులు సాన్నిధ్యంలో కుమిలిపోతోంది.

అబ్బులు అసహాయంగా చూస్తూ వుండిపోయేడు.

చీకటి చెదిరిపోలేదు ఆ పాకలో...

* * *

"ఇయ్యాల పేపర్లో ఎలక్సన్ల గురించి ఏసినారు" అక్కడున్న మౌనాన్ని ఛేదించింది మునసబు గొంతు.

"రెండు నెలల టయం వుంది సరిగ్గా ఈ రోజుకి.." – మళ్ళీ ఆయనే.

"దాన్ని గురించే ఆలోచిస్తున్నట్లున్నారు" – కరణంగారు.

"ఆలోసింసనీ కేటుంది రాజుగారు గెలవటం కాయం.." – పోతరాజులు తన అభిప్రాయం వెల్లడించేడు.

"అందులో మరి ఢోకా లేదు. కొంచెం కష్టపడాల్సి వస్తుందేమో" – కరణం గారి అనుమానం.

"ఏటి సెంద్రరావ్ నాయుడు మనల్ని వొగ్గేసినంత మాత్రాన భయపడాల్సిన అవుసరం ఏంది? కులం పెకారం సూసుకొన్నా ఆడికి సేన్సు సున్నా..!" – ధీమాగా అన్నాడు కుంటిసత్తి.

"అసుమంటి పిచ్చుకల్ని సూసిగాదు.. పెజలకి నీల్లునేక గిజగిజలాడిపోతున్నారు. ముందు మనం ఆల్లని కాసేత్తే..... ఆనక అల్లు మనల్ని కాసుకుంతారు" – మునసబు అసలు విషయం కదిపేడు.

"కట్టుకున్న దాంతోనే ఏడవనేక పోతుంటే పక్కింటిది కన్ను గీరినట్టుంది. అసలే సచ్చిపోతుంటే ఇదొక గొడవొచ్చి పడినాది" చిరాకు పడ్డాడు కుంటిసత్తి.

"ఇది నిజంగా మనకి పరీచ్చా సమయం"

ముందున్న గ్లాసుల్లో మందు తరిగిపోతోంది.

గాలి తుళ్ళి పడుతోంది. మబ్బులచాటు నుంచి బయట కొచ్చేడు చంద్రుడు. కాలుజారి సీసాలో మునిగి పోయేడు.

వాళ్ళ కళ్ళకి ఆకాశంలో చాలామంది చంద్రుళ్ళు కన్పించేరు.

అక్కడున్న అందరికీ ఎన్నికల గురించి బెంగపట్టుకొంది. ఓ విధంగా ఓటర్ల గురించి కాదు. పుచ్చు పట్టుకొన్న విపత్కర పరిస్థితి గురించి. దాన్ని అవకాశంగా తీసుకొని ప్రజల్లో సెంద్రరావ్ నాయుడు సుస్థిర స్థానం ఏర్పరుచుకుంటాడన్న భయం కూడా లేకపోలేదు.

ఊరు వెన్నెల వెలుగులో కళ్లు మూసుకొంది.

వేపచెట్టు ఆకులు రాలుస్తూ వుంది. గడ్డిదొరకని గేదెలు పళ్లు కొరుక్కుంటున్నాయి. ఏం తోచని కుక్కలు వీధిలో తిరుగుతున్నాయి. ఆరుబయట నులక మంచాల్లో జనం సుఖనిద్రలోకి జారుకొన్నారు.

గుమ్మం దగ్గర కొబ్బరి చెట్ల ఆకులు వెన్నెల వెలుగు పూసుకొని వెండి రేకుల్లా మెరుస్తున్నాయి.

మందు సీసాలకేసి చూస్తున్న వాళ్ళు ప్రతిమల్లా వున్నారు.

అందరి ఆలోచనా ఎన్నికల గురించే!

రాజుగారు ఎన్నికల ప్రచారానికి నాందిగా మాలపల్లి పాదయాత్ర–కోటేశు కూతుర్ని పోషిస్తానని పబ్లిగ్గా స్టేట్మెంటు జారీచెయ్యడం జరిగేయి. అది ఎన్నికల ప్రచారం అని అందరికీ తెలీదు. కొన్ని అవకాశాలు చెప్పకుండా వస్తాయి వాటిన్ని సద్వినియోగం చేసుకోవడం విజ్ఞుల లక్షణం.

అనుకోకుండా వచ్చిన అవకాశాన్ని సరిగ్గా వుపయోగించుకొన్నారు రాజుగారు.

ఎన్నికల్లో వాళ్ళ ఓట్ల విలువ ఏమిటో ఖద్దరు తొడిగే పెద్దలకు తెల్సు. చదువు

కొన్ని జనానికి వాగ్దానాలు చేస్తే తబ్బిబ్బయి పోతారు. చదువురాని వాళ్ళకు చిన్న సహాయం చేస్తేచాలు వుప్పొంగి పోతారు.

ఈ దేశంలో ప్రజాస్వామ్యం కేవలం ఐదు రూపాయలకి, కల్లు ముంతలకి అమ్ముడు పోయిందన్న నిజం రాజుగారికి బాగా తెల్సు.

కల్లు, డబ్బు ఆరగించినా సమయానుకూలంగా వాళ్ళు జెండాలు మార్చేస్తారని అనుభవం నేర్పింది. అందుకే ప్రజల్ని ఆకట్టుకునే ప్రయత్నాలు, పథకాల గురించి తీవ్రంగా ఆలోచించేరు.

ఎవరి సంతాపం కోసమో మౌనంగా వున్నట్లున్న ఆ నల్గురి మధ్యా ఆయన.

మత్తెక్కిన ఆ కళ్ళు సిమెంటు కళ్ళలా స్థిరంగా, చలన రహితంగా వున్నాయి. వెన్నెలకి మెరుస్తున్న నుదుటి మీద కత్తితో గీటు పెట్టినట్లున్న నామం అంతులేని ఆలోచనలకు నుదురు ముక్కలై రక్తం స్రవిస్తున్నట్లుంది. ఒరలో వున్న కత్తిలా వున్న ముక్కుచివర వెన్నెల కొలనుగా మారింది. ఉక్కు పెదాల మధ్య ఆరిపోయిన ఖరీదైనచుట్ట తెగనిసమస్యలా వుంది. ఖద్దరు చొక్కా మాటున ఎగిరి పడుతున్న ఛాతీ పంటలేని నల్లరేగడిలా వుంది. పడక్కుర్చీలో పడున్న ఆయన పట్టాభిషేకంచేయించుకొన్న రాజుగారిలా, ప్రతిష్టించని విగ్రహంలా వున్నారు.

ఆయన ఆ వూరికి రాజులాంటివారు. లాంటి వారేకాదు రాజే! అని ఎవర్నడిగినా చెప్తారు. ఆయన్ని చూడగానే కిరీటం లేని చక్రవర్తిలా కన్పిస్తారు.

పుట్టంగానే కలెక్టరే అవుతాడో, కట్టెలే కొట్టుకుంటాడో చెప్పడం కష్టం. అనుకొన్నవి తారుమారు కావడం పెద్ద వింత కాదు. ఆఫీసరుకొడుకు గుమస్తా అవుతాడు. డాక్టరు కొడుకు కొండొకచో కాంపౌండరవుతాడు. పండితుడి కొడుకు చదువబ్బక కూలికిపోవచ్చు. జడ్జీగారబ్బాయి జేబు దొంగ కావచ్చు. అడుక్కునే వాడి కొడుకు అందలం ఎక్కొచ్చు. మంత్రిగారబ్బాయి ఎమ్మెల్యేగానే మిగిలిపోవచ్చు. ఎప్పుడెవరు ఏమౌతారో చెప్పడం చాలాకష్టం.

కాని, వెంకటపతి రాజుగారు పుట్టంగానే యువరాజు పుట్టేడని అందరూ మురిసి పోయేరు. బూడిదలిచ్చిన బాబాలు, చేతులు చూసిన జ్యోతిష్యులు కూడా అదేమాటన్నారు. వాళ్ళ నమ్మకాన్ని, తండ్రి తాతల ఆశల్ని వమ్ము చెయ్యలేదు వెంకటపతి రాజుగారు.

ఎదుగుతున్న కొడుకులో పెరుగుతున్న రాజకీయ బుద్ధికుశలతని, బయట పడకుండా గుట్టుగా సాగిస్తున్న రంకుని చూసి మురిసిపోయిన తండ్రి తన తదనంతరం వూర్ని, ప్రజల్ని పాలించ గలడన్న సంపూర్ణ విశ్వాసం కలగ్గానే ఓ సాయంత్రం సుఖంగా బాల్చీని తన్నేసేరు.

ఉగ్గుపాలతో రాజకీయం రంగరించి పట్టేగాని నేటి బాలురు రేపటి నాయకులు కారని గట్టినమ్మకం వున్న తండ్రిగారి విశ్వాసానికి చక్కటి వుదాహరణ వెంకటపతిరాజుగారు.

రాజుగారి నూగు మీసాలు నల్లపడగానే సర్పంచి పదవికి పట్టాభిషేకం జరిగింది. దాంతో గడ్డి మేటుల మాటున, చెరువు గట్ల మీద జరిపే శృంగారకాండకి స్వస్తివాక్యం పలికి సంసారజీవితం సాగించ నిశ్చయించుకొన్నారు వెంకటపతి రాజుగారు.

ఆయన సముచిత నిశ్చయానికి మంచి రేటు పల్కింది.

రాజుగారి భార్యామణి తెచ్చిన బంగా రంతో పది బంగళాలు కట్టించుకోవచ్చు. ఆమెఅందచందాలు చూడంగానే మంచంలో మనిషికూడా మరోమారు శోభనం చేసుకోవాలనిపిస్తుంది. పచ్చగా మిస మిసలాడే ఆమెను చూస్తే చిదిమి ట్యూబ్ లైట్‌గా పెట్టుకోవచ్చనిపిస్తుంది. రాత్రి పూట చూస్తే పందిరి మంచంమీద పరు పక్కర్లేదనిపిస్తుంది. ఆవిడ నవ్వితే ఎదుటి వాడికి పెరాల్సిస్ వచ్చినట్లు మెలి కలు తిరిగిపోతారు. గదిమితే పాలేర్లు గజ గజ లాడతారు. అలకబూనితే రాజుగారు కృంగిపోతారు.

ఆవిడ గుడ్డల కంపెనీ వాళ్ళ కేలండర్లో లక్ష్మీదేవిలా వుంటుంది. ఆవిడకు మొగు డన్నా, దేవుడన్నా విపరీత భక్తి.

అందమైన భార్య, అంతులేని ఆస్థి. మంచితనం మూర్తీభవించిన ఆమెను సహధర్మచారిణిగా పొందటం నిజంగా చాలా అదృష్టం అని రాజుగారు అందరితో అంటూవుంటారు.

రాజుగారి చదరంగపు ఎత్తుగడల్లో రాజెప్పుడూ కట్టుబడలేదు. ఖద్దరు పంచెల పెద్దలకుగాని, కాషాయిగుడ్డల సన్యాసులు గాని, కాకీగుడ్డల అధికారులుగాని ఎవరు ఆ వూరులో పాదం మోపినా ఆయన ఆతిథ్యం తీసుకోక తప్పదు. అందుకే ఆయన పేరు చెప్తే వూరు పేరు చెప్తారు - వూరుపేరుచెప్తే ఆయన పేరు చెప్తారు.

ఆయన పేరుచెప్తే శత్రువులు బిక్క చచ్చిపోతారు. పేకముక్కలు పరుచు కుంటాయి. మందు సీసాలు మూతలేకుండా ముందు కొస్తాయి. కాంట్రాక్టులు కదిలి వస్తాయి. అందమైన ఆడవాళ్లు పరువం పరు స్తారు. పేదలు దండం పెడ్తారు. దేవుడు గుడితలుపులు స్వయంగా తెరుచుకొస్తాడు. లంచం లేకుండా ఆయన దేవుడి దగ్గర వరాలు పొందగల్రు. ఆఫీసుల్లో కాగితాలు కదిలించగల్రు. కుత్తుకలు కోయించ గల్రు. అడ్డువచ్చినవాళ్ళను అడుక్కు నేలా చేయగల్రు.

ఏది చేసినా ఎలా చేసినా గుట్టుగా చేయించగల్రు. ఆవులించక పోయినా పేగులు లెక్కబెట్టగల్రు. లెక్క తప్పు పోతే పీకెయ్యగల్రు.

చిల్లరకోసం ఆయనెప్పుడూ కక్కుర్తి పడలేదు. తన్నే నమ్ముకొన్న వాళ్ళకు చిన్నచిన్న కాంట్రాక్టులు, పదవులు అప్ప గించి వాళ్ళను తృప్తి పరుస్తుంటారు. అందర్నీ సమానంగాచూసే మంచితనం చాలా అరుదుగా వుంటుంది రాజకీయాల్లో వున్నవాళ్ళకు. అందుకే ఆయనంటే చాలా మందికి గౌరవం. అది లేనివాళ్ళకు ఎక్కువ భయం వుంది.

ఆయన మాట, కోపం సౌమ్యంగా వుంటాయి. ఆయన చిరునవ్వుల్లో రాజ కీయం విరబూస్తుంది. నడకలో ఠీవీ తొంగి చూస్తుంది. సరసంలో శృంగారం సిగ్గు పడుతుంది. ఆయన సందిటిలో నలిగే మల్లె లకు మంచి ఖరీదు గిడుతుంది. ఆయన మీసాల్లో రాజసం వుట్టిపడుతుంది.

రాజుగారి రాసక్రీడలు కుర్రకారు కథలుగా చెప్పుకొంటారు. కేవలం కథల్లో మాత్రమే మిగిలి పోకుండా అపుడప్పుడు పంచె సవరిస్తుంటారు.

బాగా వూహతెల్సినప్పటినుంచి రాజు గారు పదవి లేకుండా వుండలేదు. అందుకే అది జన్మహక్కుగా ఫీలౌతారు. ఇన్నేళ్ళు ఏకఛత్రాధిపత్యంగా సాగించుకొస్తున్న పదవి - తద్వారా వచ్చిన పలుకుబడిని, గౌరవ ప్రతిష్ఠలను కేవలం తనకన్నా

ఎందులోనూ సాటిరాని ఓ వ్యక్తికి ధారా దత్తం చెయ్యడం బొత్తిగా ఇష్టంలేదు.

తన మోచేతి నీళ్ళుతాగి తను విసిరేసినపదవుల రొట్టెముక్కలుతిని పరపతి పెంచుకొంటున్న సెంద్రరావ్ నాయుడు దిక్కూమొక్కూలేకుండా పోవడం ఆయన ధ్యేయం.

ఊర్ని పట్టుకొని పీడిస్తున్న సమస్యను తల్చుకోగానే మరోసారి ఆయన మనసు వికలమైంది. ఏంచేస్తే ప్రజలు తనకి మద్దతునిస్తారో, ఎలాచేస్తే తన పదవి నిలబడుతుందోఅర్థంకాక అయోమయంలో పడ్డారు రాజుగారు.

ఆయన ప్రతి ఆలోచనలోనూ సెంద్రావ్నాయుడు చోటు చేసుకుంటున్నాడు. దేవుడని పాలుపోస్తే విషం ఎగజిమ్మే పాములా అన్పించేడు నాయుడు.

కుర్చీలో రాజుగారు చలించేరు.

గ్లాసులో మందు నరాల్లోకి పాకింది. మెదడు పదునెక్కింది.

అక్కడున్న అందరూ ప్రజల బాధల్ని మందులో మర్చిపోయే ప్రయత్నంలోనే వున్నారు. పదవిపోయిన నాయకుడిచుట్టూ అనుచరుల్లా, కేసులో యస్.ఐ. గారు ఇరుక్కుపోతే ఏం చేయాలో తెలియని కానిస్టేబుల్సులా బాధగా, మౌనంగా వున్నారు.

"గవర్నమెంటోడికి వుత్తరం రాత్తే నీల్లకోసం అల్లే యేర్పాట్లు సేత్తారటగా?" అన్నాడు కుంటిసత్తి ఆఖరిముక్క గొంతులోకి జారుస్తూ.

"అల్లు సేసేసరికి వూళ్లో వోటల్లుండరు''-పోతరాజులు.

"అల్లుమాత్తరం నీల్లు ఎంతకాలవని తేగ్గలు..!"మునసబుగారు దౌట్ వెలుబుచ్చేరు.

"అయితే మనవేటి సెయ్యాల?"

"అదే తెలియటంలేదు" మొత్తెక్కని కరణంగారు తాపీగా అన్నారు.

"ఇంతకీ తమరాలోసెన సెప్పేరు గాదు "మునసబుగారు రాజుగార్ని డైరెక్టుగా అడిగేరు.

రాజుగారు ప్రశాంతంగా చుట్ట వెలిగించేరు.

అగ్గిపుల్ల వెలుగులో ఆయన కళ్ళు ఎర్రటి గాజుకళ్ళలా మెరిసేయి. బయటకొచ్చిన పొగని గాలి తరుముకు పోయింది.

"పట్నంలో నీల్లుపడే సోట్లు సెప్పే పంతుళ్ళు, ఇంజనీర్లు వుంటరుగా! మరి అల్లని పిల్చుకొచ్చి వూరుసూపించి అల్ల సలహా మీద పోదారని"రాజుగారి గొంతు పెగిలేసరికి మేఘాల రాపిడిలా, రేకుల మీద కొరడా దెబ్బల్లా వచ్చేయి మాటలు.

''అల్లొచ్చేటిసేత్తారు?"- అని అడగలేదు పోతరాజులు.

"అల్ల పరిచ్చల వల్ల నీల్లు పడేసోటు తెలుత్తది. ఆసోట్లో బావో, సెరువో తవ్విద్దారి''అనేసి కుర్చీలో వాలిపోయేరు.

''సెంద్రరావ్ గోడు మాదిగ వాడలో మా అడావిడీ సేత్తున్నాడట..." మాంసం ముక్క కొరుకుతూ అన్నాడు కుంటిసత్తి.

"అదెన్ని సేసినా ఆకర్న పెజలు ఇస్వాసం సూపించేది మనకేగా!" భరోసా ఇచ్చేడు పోతరాజులు.

"మాలపల్లి ఏసుపాదంగాడు, సెదులుగాడు ఈమద్దిన నాయుడుతో తిరిగేత్తున్నారట"-మునసబు.

"అల్లెవరు?!" అసహ్యంగా చూస్తూ అన్నారు రాజుగారు.

"మాలపల్లిలో చిల్లర నాయకుల్లెండి.."

"మనం నిన్న సేసినదానికి సచ్చేసట్టు

మనవైపు మొగ్గాల్సిందే..."

"అయినా అల్లేటి గాంధీగోరా?! సెప్పంగానే ఆల్లెనక సేరిపోనీకి''.

"వచ్చేది ఎలక్సన్లు. సిన్నసిన్న ఎద వల్ని కూడా వల్లోకి నాక్కోవాలి. నేక పోతే ఇలాటి అలగా నా కొడుకుల్తో నూసెన్సయిపోద్ది" – మునసబుగారు రాజకీయ రహస్యంబోధించేరు.

"రేపోపాలి ఆ పూజారి పంతుల్ని ఆపడమన్నానని సెప్పు" మునసబును చూస్తూ అన్నారు రాజుగారు.

"ఎందుకండి?" అని మాత్రం ఎవ్వరూ అడగలేదు.

మరో రౌండు మందుకోసం అందరూ సన్నిద్ధులౌతుండగా చంద్రుడ్ని పల్చటి మబ్బుతెరలు కమ్మేయి..

రాజుగారు చిన్నగా కలల సామ్రాజ్యానికి వెళ్ళేరు.

* * *

అధికార పార్టీ టికెట్టు దొరికిన అనామకుడిలా వురుకు పరుగున వచ్చింది వూళ్ళోకి ఆ జీపు. రోడ్డు మీద జనం పక్కలకు దారిచ్చి అందులోవున్న ఖద్దరు గంజి చొక్కాకి దండాలు పెట్టేరు. అంత మాత్రం చేత సదరుశాల్తీ అందరికీ తెల్సునని కాదు. ఖద్దరు ధరించి గోల్డుఫ్రేం కళ్ళద్దాలు పెట్టుకొని వుంటే అతగాడు పెద్ద నాయకుడు అయ్యుంటాడని ప్రజల నమ్మకం. గుళ్లో రాయిని పెట్టినా దేవుడని కొలుస్తారు.

ఆయన పదవి లేకుండా ఎప్పుడూ లేరు.పదవి లేనప్పుడు వుద్యమాల్లో బిజీగా వుండేవారు. ఆయన తాలుకా స్థాయికి చేరుకొన్న నాయకుడు. అనుభవం మనుషుల్ని బుట్టలో వెయ్యడం నేర్పింది. నేర్చుకొన్నదాన్ని అమలులో ఎలా పెట్టాలో ఆయనకు రాజకీయం ఔపోసన పట్టిన గురువుగారు నేర్పేరు. ఎటొచ్చీ గురువుగారు అపోజిషన్లోచేరి జెయిల్లో భగవద్గీతమీద రీసెర్చి చేయగా ఈయన మాత్రం అధికారంలో ఆనందం అనుభవిస్తూ, దాన్ని కాపాడుకోవడం కోసం భజన నేర్చుకొని ప్రజాసేవకి అంకితం అయ్యేరు.

ప్రస్తుతం రెడ్డిగారు సమితిప్రెసిడెంట్ పదవికి మరోసారి నిల్చునే ఏర్పాట్లలో వున్నారు.

రాజుగారికి రెడ్డిగారు రాజకీయపరమైన స్నేహం. ఆయన సలహాలంటే రాజుగారు గౌరవిస్తారు. "మహ కాని మడిసయ్యా! ఢిల్లీలో వుండాల్సినోడు" అని ఆయన్ని గురించి ఆత్మీయుల్తో అంటూ వుంటారు.

జీపు రాజుగారి ఇంటిముందు ఆగింది.

గోచీలేని గుంటలు జీపుచుట్టూ గుమిగూడేరు.

పెద్దలు గౌరవ సూచకంగా ప్రణామాలు చేసేరు.

గుమ్మంలో ఆగిన జీపును చూడంగానే రాజుగారు నామం పెట్టుకోవడం ఆపి ఎదురొచ్చి స్వాగతం పల్కేరు.

"సెప్పా సెయ్యకుండా ఎలుపొచ్చేరు. ఎలాగున్నారూ!!" – మందహాసంతో అన్నారు రాజుగారు.

"మా బాగుసంగతి ఆలోచించే తీరికేది? పెజల సంగతుల్తోటి మతోతోంది" కుర్చీలోకుచ్చుంటూ అన్నారు రెడ్డిగారు.

"ఏదేనా అర్జెంటు పనిబడిందేటి? ఒరేయ్! అమ్మగారికి సెప్పి మజ్జిగట్టుకురా!"–అక్కడున్న భటునికి ఆజ్ఞ జారీ చేసేరు.

"ఎండ పేల్చేస్తుందయ్యా!" నుదుటి చెమట తుడ్చుకుంటూ అన్నారు రెడ్డిగారు.

"మరేనండి.."—రాజుగారు.

"వూరెలగుంది?"

"నీల్లునేక పెజలు సచ్చిపోతున్నారు. ఏటిసెయ్యాలో అర్థంగాక సికాగ్గా వుంది. ఈటికితోడు ఎలక్షన్లు.." దారుణ దుఃఖంలో రాజుగారు అన్నారు.

"ఇలాటి సమయాల్లోనే మనిసి కుంగిపోకూడదు...నాల్రోజులు పోతే వర్షాలొస్తాయి. కానీ ఎలక్సన్లు రావుగా? ఏటి సెంద్రరవ్ అపోజిసన్లో సేరేడట?"

సిగెరెట్టు వెలిగించేరు రెడ్డిగారు.

"ఇస్వాసం లేన్నాకొడుకు. అడి వూసెందుకు?"

"రాజకీయాల్లో ఇస్వాసం ఏటండి రాజుగారు! ఎవలం ఏపార్టీలో సేరిపోతామో మనకే తెల్దు. కావల్సింది పదవి, ప్రెజా సేవ అంతేగా? ఏ పార్టీ అధికారంలో వుంటే అదే మనిల్లు. మళ్లీ మనింటికి మనం వొచ్చేత్తాం ఓడిపోతే. ఇదో ఆట. ఆడి సంగతి నాను సూసుకుంతాను. పెచారాలు పేరంభించేరా?"

"ఇంకా నేదు. దానిగురించే ఆలో



సితున్నాం.అయినా వూల్లో మనకెదురేటి! నేజేసిన సేవకి ఓట్లెయ్యకుండా వుంటారేటి! నాయుడుగాడి తాటేకు సప్పుల్లకి దడిసిపోతే మరి సర్పంచి పదవి ఇంకేం ఎలగ బెడ్తాం!" తొణకని కొండలా అన్నారు రాజుగారు.

ఆయన ధీమాచూసి రెడ్డిగారు ముచ్చటపడ్డారు.

గ్లాసులో మజ్జిగ గుటకలో తాగేరు.

"అందరూ మనోల్లు వచ్చేత్తే ఆనక పెజలకి సేవ తృప్తిగా సెయ్యొచ్చు.."

"ఇంతకీ తమరి పొజిసను.."

"పెజల మీద ఇస్వాసం వుంది. గాంధీగారి మీద భారం ఏసేను. ఆయనకుతెల్సు మనసేవ సంగతి. మల్లా కొద్ది రోజుల్లో వత్తాను. పెచారం బాగా సెయ్యండి. డబ్బుగురించి ఆలోసెన సెయ్యకండి. అది తప్పదు. కార్యకర్తలు గావాలంటే సెప్పండి అంపుతాను. నాయుడుగాడ్ని పట్టించుకోకండి. ఆడిది పసితనం. మరి నన్ను ధైర్యంగా ఎల్లమంటారా?" లేవబోయే ప్రయత్నంలో అన్నారు రెడ్డిగారు.

"బొత్తిగా మజ్జికసుక్క తాగెలి పోతున్నారు.." బాధపడ్డారు రాజుగారు.

"నీ దగ్గర నాకు మరేదేటయ్యా! మల్లావత్తాగా! ఏదీనా అవుసరం బడ్తే కబురెట్టు" అంటూ లేచేరు రెడ్డిగారు.

"పెచారం మొదలెట్టగానే తమరి మీటింగు కూడా ఎట్టిద్దామని.."

"తప్పకుండా వస్తాను. బేగి రంగంలోకి దిగండి..అట్టె దూరం నేదు.." అంటూ రెడ్డిగారు బయిటకొచ్చి నిరీక్షిస్తున్న పెద్దలందర్నీ సాదరంగా పలకరించేరు.

రాజుగారు జీపుదాక సాగనంపేరు.

అందరికీ సందేశాలు పంచి జీపెక్కేరు రెడ్డిగారు.

ఆయనరాక కొండంత బలాన్నిచ్చింది అందరికీ!

అందరూ మరోసారి చేతులెత్తి రెడ్డిగారికి నమస్కారాలు చేస్తుండగా...

దుమ్ము రేపుతూ జీపు కదిలింది బెదిరిపోయిన గొడ్డులా.




సెంద్రరావు నాయుడు గారికి అర్జంటుగా చచ్చిపోవాలనిపించింది.

సడన్‌గా అటువంటి దారుణమైన నిర్ణయానికి ఎందుకొచ్చేరు చెప్మా అనేదానికి సమాధానం ఆయనే చెప్పాల్సి వుంటుంది.

రాజకీయ రంకులాటలో చిన్న విషయాన్ని పెద్దదిగా చేసి ప్రజల్లో పేరు తెచ్చుకోవచ్చు..హడావిడి చేసేసి అధికార వర్గాన్ని దింపెయ్యవచ్చు... రెండురోజులు అన్నం మాని శిబిరం నెలకొల్పితే మంత్రి పదవి కూడా దక్కించుకోవచ్చు — అని నాయుడుగారికి ఎవరూ చెప్పలేదు. స్వతంత్ర భావాలు కల వ్యక్తి కావడం వల్ల కొన్ని సిద్ధాంతాల్ని ఆయనే సృష్టించుకొని వాటినే అనుసరిస్తున్నారు.

సూర్యుడు మంచినీళ్ళు తాగడం కోసం ఆ వరండాలోకి ఇంకా రాలేదు.

సమ్మెలు లేకపోవడంతో ఏం చెయ్యాలో తోచని చోటా నాయకుడిలా—

కాళ్ళొచ్చిన కొండలా ఆయన వరండాలో తిరుగుతుంటే సూరి, లింగం విషయం అర్థం కాక ఆయన్ని ఈ లోకంలోకి లాక్కొచ్చే ప్రయత్నంలో పడ్డారు.

"మొన్న మాపిటేల మాలపల్లి కోటేశుగాడు సచ్చిపోనాడట" నాయుడు గారు ఎవర్నడిగేరో అర్థంకాలేదు ఇద్దరికీ. అడిగింది మాత్రం తమనేననే విషయం స్పష్టం చేసుకొన్నారు.

హత్య చేసి దొరికిపోయిన వాళ్ళలా ఇద్దరూ అతిబాధగా చూసేరు. నాయుడు గారికి అలుపొచ్చింది కాబోలు తిరగటం మాని కుర్చీలో చేరారు.

"బంగారం నాటి సేన్సు జారిపోనాది" నాయుడుగారి హృదయం బావురుమంది.

"రాజుగాడు మా అడావిడీ సేసేడట" సూరి చిన్నగా అన్నాడు.

నాయుడు గారికి సూరి చెప్పిన నిజం తుపాకీ గుండులా తాకింది. ఆ దెబ్బకు విలవిలలాడిపోయి కొనవూపిరితో కొట్టు కుంటున్న పిట్టలా చూసేరు.

ఆ చూపులో కోపం లేదు. కళ్ళల్లో గూడు కట్టుకొంటున్న బాధ మాత్రం కన్పించింది. రాజుగారు ఏభైరూపాయల్తో ఎంత పేరు తెచ్చుకుందీ తల్చుకోగానే గుండెను రంపంతో కోసినట్లయింది.

"మాలపల్లిని మనవేపు తిప్పుకోవా లంటే ఏటిసెయ్యాలో తెలవటం నేదు. ఆల్లని కలుపుకోపోతే మనం సర్పంచి పదవిని సేరడం సేనా కట్టం" - స్వగతంలో అనుకొన్నా ఇద్దరికీ విన్పించేలా అన్నారు నాయుడుగారు.

"ఆడి కూతుర్ని పోసించే బారం కూడా సేపట్టేరు. మరి మన జనం.." నసిగేడు లింగం.

"కూతురంటే..!ఆ నల్లగా వుంటది."

"అదేనండి"

అంతే....చంద్రుణ్ని చూసిన నల్ల కలువలా మొహం విప్పారింది నాయుడు గారికి. రాజకుమార్తెను మాయం చేసి తన గుహలోకి తెచ్చుకొన్న మాయల ఫకీరులా ఆనందించారు.

సమయానికి వూళ్ళో లేనందువల్ల ఎంతటి అవకాశం జారిపోయిందీ పూరిగా అర్థమైంది నాయుడు గారికి.

ఎన్నికల్లో పండాలంటే మాల మాదిగ ఓట్లు చాలా ముఖ్యం. వాళ్ళను ఆకట్టు కోవడం వల్లనే గెలుపు ఖాయం. అందు కోసం కుప్పిగంతులేసి వాళ్ళను మోసం చెయ్యడం రాజకీయ నాయకుల విధి. ఇష్టం వున్నా లేకపోయినా పదవికోసం వాళ్ళను ప్రేమించడం, తద్వారా ముద్దర గుద్దించు కోవడం, ఆ తదుపరి వాళ్ళ మొహం చూడ కుండా పోవడం మామూలుగాజరిగే పద్ధతి.

కొన్ని ఆనవాయితీలు మార్చటం ఎవడితరం కాదు. రాజుగారు పలికిన ఎన్నికలనాంది సంఘటన నాయుడుగార్ని కదిలించింది. ఎన్నికల గురించి తెల్సి వారం రోజులైనా తను స్తబ్దుగా వుండటం అదోలా అన్పించింది.

ఆలోచనల్తో నాయుడుగారి నరాలు అలసట చెందేయి.

దాహం తీర్చుకోవడానికి చుక్క నీళ్ళు లేని ప్రజలు—

వయస్సొచ్చిన అందాల పొంగులో అమాయకంగా, అందంగా నవ్వుతున్న చింతల్లి – నాయుడుగారి కళ్ళముందు నుండి మాయం కాలేదు.

ఎన్నికల ప్రచారం అంటే గోడల మీద పేర్లు రాయడం ఒక్కటే కాదన్న నగ్న సత్యం నాయుడుగారికి తెల్సు.

వైరిబాగుల జనాన్ని ఆకట్టుకోవడం

నాయకులకి పెద్ద కష్టంకాదు. ఏ చేతులెత్తే కర్రలెత్తుతాయో ఆ చేతుల్లోనే దండలు వేయించుకోవడం వాళ్ళకు కూసు విద్య.

* * *

అగ్ర రాజ్యాలకు ఏం తోచకపోతే బుల్లిబుల్లి దేశాలకు ఆయుధాలు ఇచ్చి సరిహద్దు వివాదం కల్పిస్తాయి. వాళ్లు ఒళ్లు మర్చిపోయి ఆవేశంతో కొట్టుకుంటుంటే శాంతిసందేశాలను ఇస్తూ తమ ఆధిక్యతను ప్రపంచానికి చాటిచెప్పడం సాధారణ విషయం. తమ వునికి ఇతరులకు గుర్తు చెయ్యడానికి ఇదో దారి.

దేశం సుభిక్షంగా వుంటే దేవుణ్ని తల్చుకునేదెవరు? అందుకే ఆ దేవుడు కష్టాల్ని భక్తుల మీద రుద్దేసి కొండెక్కి కూర్చుంటాడు. అవసరం భక్తుల్ది కాబట్టి అన్ని కొండలూ ఎక్కేసి గుండు కొట్టేసుకుని మరీ వస్తారు. పరీక్ష రాసిన అందరూ పాస్ అయిపోతే దేవుడికి తల నప్పగించేదెవరు? రోగం రాగానే మందు డాక్టరుకన్న దేవుణ్ని రిక్వెస్టు చెయ్యడం కూడా ఇందుకే. కడుపొచ్చినా రాకపోయినా దేవుణ్ని నమ్ముకోవడం భక్తుల విధి. నా అనుకొన్న వాళ్ళకు కష్టాలు కలిగించి 'నేనున్నాను సుమా' అని చెప్పుకోవడం చాలా మామూలు విషయం.

అందరూ సుఖంగా వుండటం కొందరికి ఇష్టం వుండదు. కొన్ని వైరాలు లేకపోతే కొందరికి కాలక్షేపం వుండదు. ప్రాణాలు పోయేలా కొట్టుకు చస్తుంటే చూసి ఆనందించడం మన సంస్కృతి.

కోడి పందేలకు, గొర్రె పందేలకు లక్షలు తగలేసి గొంతుకలు కోసుకోవడం మన ఆచారం. ప్రాణాలకు తెగించి అవి కొట్టుకుంటుంటే ఆనందంగా చప్పట్లు చరుస్తూ తన్మయం చెందడం మన కళా హృదయానికి తార్కాణం.

కుమిలిపల్లి పెద్ద గ్రామాల అడుగుజాడల్లోనే నడుస్తూ తరతరాలుగా వస్తున్న ఆచార వ్యవహారాలనే అనుసరిస్తోంది. ఊరు పుట్టినప్పటి నుంచీ మాలపల్లి, మాదిగవాడకి బొత్తిగా సఖ్యత లేదు. వాళ్ళు కలసిమెలసి సర్దాగా వుండాలని అనుకొన్నా నాయకులు మాత్రం అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. అందుకే వాళ్లు కలుస్తున్నారని అనుమానం కలిగినప్పుడల్లా చిన్నచిన్న తగాదాలు పెట్టేసి సరదాగా తీర్పులిచ్చేసి మంట పెట్టడం అగ్రనాయకులకు హాబీ!

అందుకే మాలపల్లి గాలి మాదిగవాడ వైపు రాదు.

ఒకళ్ళ బావుల్లో నీళ్లు మరొకరు ముట్టుకోరు.

వాళ్లకు వియ్యాలు లేవు కయ్యాలు తప్ప.

మాదిగవాడ శవం మాలపల్లి శ్మశానంలోకి రాకూడదు. వస్తే మరికొన్ని శవాలు తయారవుతాయి.అక్కడ కులానికున్న విలువ మనుషులకి, వాళ్ళు నమ్మే దేవుడిక్కూడా లేదు. రెండు కులాలు కల్సి ఓ పనికి రావు. ఇద్దర్నీ కలపాలని ఎవ్వరూ ప్రయత్నం చెయ్యకపోగా కలవకుండా వుండటం కోసమే కృషి చేశారు. పెద్దల రాజకీయపు చదరంగంలో వీళ్లు పావులు.

కలుపులకు, ఎన్నికలకు తప్ప వీళ్లతో వుపయోగం బొత్తిగా వుండదు.

సెంద్రరావ్ నాయుడికి మాదిగవాడలో మంచి పేరుంది.

వాళ్ళకు గాంధీగారంటే నాయుడుగారే! తమ కష్టాల్ని ఆదుకోడానికి దేవుడు పంపిన ఏజెంటు. పెళ్ళిళ్ళకు,

చావులకు ఆయన ప్రత్యేక అతిథి.

రాజుగారితో తెగతెంపులు చేసుకున్నాక ఇష్టం వున్నా లేకపోయినా రోజు కొకసారి మాదిగవాడకు రావడంఅలవాటు చేసుకొన్నారు నాయుడుగారు.

సాక్షాత్తు దేవుడే రోజూ వచ్చి పరామర్శిస్తున్నట్లు భావించేవారు నాయుడుగార్ని చూసుకొని.

ప్రతి చిన్న విషయానికి నాయుడుగారి సలహా అవసరం వాళ్ళకి. ఆయనకు చెప్పకుండా ఏ పనీ చెయ్యరు. ఆయన ఫొటోలు ఫ్రేం కట్టించి ఇస్తే అందరూ ఇళ్ళల్లో దేవుడి ఫొటోలు పీకేసి ఆ స్థానంలో నాయుడుగారి బొమ్మ వుంచుతారు. కనీసం ఆ దేవుడి పటం పక్కనే ప్రతిష్ఠిస్తారు.

అక్కడ నాయుడిగారి మాట వేదవాక్కు.

వాళ్ళకు రాజుగారంటే గౌరవం లేకపోలేదు. కొంత మందికి రాజుగారంటే అభిమానం వగైరాలున్నాయి. అందుకే నాయుడుగారు తెలివిగా వ్యవహరిస్తారు వాళ్ళతో. తనుగా రాజుగార్ని ఎప్పుడూ దుయ్యబట్టరు. అదే ఆయన రాజకీయ చతురత.

ఎన్నికలొస్తున్నాయని తెల్సినప్పటి నుంచి నాయుడుగారికి, రాజుగారికి వీళ్ళ మీద పత్యేక శ్రద్ధ ఏర్పడింది. ఆధిపత్యం కోసం ముసుగులో గుద్దులాడుకుంటున్నారే గాని ఇంకా తెర తొలగించుకుని రంగస్థలం మీదికి రాలేదు.

రాజుగారు మాలపల్లిలో జెండా పాతుకొన్నప్పటి నుంచి నాయుడుగారికి నిద్ర పట్టడం లేదు. మాలపల్లి ఓట్లలో కనీసం సగం తన పరమైతేనే తన మార్గం సుగమం.

రాజుగారు మాలపల్లి ఛాయలకు రాకుండా ఎలా దెబ్బ కొట్టాలో నాయుడుగారికి అంతు పట్టలేదు.

భారంగా పడుతున్న అడుగులకు అబ్బులు విన్పిస్తున్న కథ బ్రేకు కొట్టింది.

అచ్చెరువొందిన నాయుడుగారు తేరుకోలేదు.

వినయంగా చేతులు జోడించి వున్నవాణ్ని చూడగానే బుర్ర రాకెట్టులా పనేసింది. శ్రమపడకుండా పదవి దొరికినంత సంబరం కల్గింది. రెండో కౌంటులో గెల్చినంత ఆనందం వేసింది. సింగల్ టికెట్టుతో జాక్‌పాటు అందుకున్నవాడిలా సంతోషించినా, ఆ భావాన్ని మాత్రం బయటకు రానీయలేదు.

"అయితే ఏటి! నీకు మనువాడ్డానికి అది తప్ప మరెవ్వతీ దొరకనేదట్రా?" నవ్వుతూ అన్నారు నాయుడుగారు.

"నా కదంటే మనసైందండీ..." సిగ్గు పడ్డాడు అబ్బులు.

"మనసయ్యింది.బాగానే వుంది మీకు అల్లకి పడిసావదాయె. కుల పెద్దలు ఎలాగొప్పుకుంటార్రా" – ప్రేమించింది తన కూతుర్ని కాదు కాబట్టి ఖంగారు లేకుండా అన్నారు నాయుడుగారు.

"దాన్ని తప్ప మరొకల్ని పెల్లి సేసుకోను బావూ! తమరు తల్సుకుంటే అయిపోద్ది బావూ" అతి మామూలుగా అడిగేడు అబ్బులు.

"ఇదేటన్నా సిన్న ఇసయంట్రా?! అయినా ఇంతమంది బొట్టెలుంటే కులం గానిదాన్తో యవ్వారం ఏట్రా?"

అబ్బులు తెలుగు నవలా నాయకుడు గాదు గనుక మౌనంగా వుండిపోయేడు.

నాయుడు గారి మెదడు మరింత చురుకైంది.

"బావూ! మీరుతల్సుకుంటే సేసేగల్రు. మావోల్లతో మీరేసెప్పి..."

"సెప్తానుగాని ... మరి..." నసిగేరు నాయుడుగారు.

బావూ మీరే దయసూడాల..మీరునం మర్సిపోను..." ప్రాధేయ పడ్డాడు.

"సీసీ..ఎర్రి ఎదవ.. మీబాగుకన్నా నాకేటి కావ్వాలా?!"

"అందుకే బావూ తమరు గోరికి సెప్పుకుంటున్నా..."

"నీ ఇసయం అంటే ఏదోవకటి సెప్పి వొప్పించేత్తాననుకో.. మరి దాని కులపెద్దలు ఎలాగరా?! మీయమ్మ మీరు ఇరుకున పెట్టేత్తున్నార్రా.."

"గానికె వలున్నారు బావూ! అంతా రాజుగారే సూసుకుంటున్నారు గదా. ఆరుమా త్తరం కాదంటారేటి!"

"నానూ రాజుగారి గురించే ఆలోసెన సేత్తున్నాను. మరిది వర్తెంటుగా తేలే ఇసయాలు గాదు. కుసింత నిదానం మీద జరగాల."

"మీరు తల్సుకుంటే సాలు బావూ... ఎలగైనా..."

"ఓర్నీయమ్మ కుసింత సేపుంటే నాకే కట్టేసేనాగున్నావు. నీ కెందుకంత ఇది. బెంగ పడకు..ఎవలితో ముందుగా అనకు. గోలై పొయ్యిందంటే మాత్రం నా నేటి సెయ్యలేను."

గీతా బోధనతర్వాత అర్జునుడు కాళ్ళ మీద పడి దణ్ణం పెట్టేడో లేదోగాని.. అబ్బులు మాత్రం తపమని మోకాళ్ళు పట్టేసుకొన్నాడు.

నాయుడుగారు అబ్బులి వందనాన్ని స్వీకరించి, ఆశీర్వదించి పంపించేరు.

నాయుడుగారు ఇంటికి గాల్లో వేల్లేరో మరోలా వెళ్లేరో ఆయనకే తెలీదు. అంత ఆనందానికి కారణం ఆయనకు తప్ప మరొకళ్ళకి అర్థం కాదు.

రాజుగార్ని ఎలా దెబ్బకొట్టాలో శ్రమ లేకుండా తెల్సిపోయింది.

తను గనుక దగ్గరుండి ఈ పెళ్ళిచేస్తే మాలపల్లినుంచి ఒక్క ఓటుకూడారాకపోగా మాదిగవాడనుంచి వున్న ఓట్లు పోవడం ఖాయం. ఏతావాతా పెళ్ళి మూలకంగా వచ్చేలాభం శూన్యం. నష్టం ఎక్కువ. అందువల్ల తొందర పడకూడదనిపించింది.

చింతల్లి మనసులో మెదిలింది.

మెదిలి వూరుకోలేదు–రెచ్చగొట్టింది. పిచ్చెక్కించింది. అయినా ఇది కులాలకి సంబంధించిన విషయం కాబట్టి ప్రత్యక్షంగా వేలుపెట్టడం అంత మంచిది కాదనిపించింది.

చింతల్లి – రాజుగారు పదేపదే గుర్తొచ్చేరు.

ఎన్నికల్లో మంచి చెడులకు స్థానం లేదు. వున్నదల్లా ఒక్కటే..ప్రతి చిన్న దాన్ని మనకనుగుణంగా మార్చుకోవడం, కాసిని ఓట్లు గిల్లుకోవడం. స్వయంగా ఘోరాలు చేయలేకపోయినా మనకు అనుకూలంగా జరుగనున్న ఘోరాల్ని అడ్డుకోకపోవటం.

చిన్న రాయినికూడా కంటి ముందు పెట్టుకుంటే ప్రపంచం కన్పించకుండా అది అడ్డుపడగల్దు. దూరంగా చూస్తే అది కేవలం చిన్నరాయి మాత్రమే!!

నూతనోత్సాహం పెల్లుబుకగా నాయుడుగారు చుట్ట వెలిగించి గుండె నిండా పొగపీల్చి నిదానంగా పొగ వదిలేరు.

* * *

సమ్మె అనేది ఓ మహత్తర ఆయుధం అని గాంధీగారు చెప్పేరు. అది శాంతి

యుతంగా జరపాలన్నది పాపం ఆయన కాంక్ష. అందుకే ఆయన ఒక చెంపన కొడ్తే మరో చెంప చూపించు అని ఓపిగ్గా ప్రచారంచేసి అమల్లోకూడా పెట్టేరు.

కొన్ని సూక్తులు చెప్పుకోడానికి మాత్రమే బావుంటాయి. అదే గనుక అమల్లోపెడ్తే రెండు చెంపలు వాయించి కాళ్ళు చేతులు విరగ్గొట్టడం అధికార పక్షం వాళ్ళకి సరదా అన్న విషయం అందరికీ తెల్సు. కాబట్టి చెంప లివ్వడం మానుకొని కనిపించిన వాటిని తగల బెట్టడం ద్వారా తమకోరికలు విన్నవించు కోవడం ఓ పద్ధతిగా మారింది.

గాంధీగారి మీద గౌరవం వుంటే ఖరీదైన ఖద్దరు గుడ్డలు కట్టుకొని తమ భక్తిప్రపత్తుల్ని ప్రకటించటం నాయకుల పని. ఆయన అడుగుజాడల్లో నడుస్తున్న వారికి సమ్మె చెయ్యడం అంటే నెత్తిన టోపీధరించడం అంత మామూలు విషయం.

సెంద్రరావ్‌నాయుడు గారికి గాంధీ గారి ఆత్మకథ తెలీదు, చదువుకోలేదు. ఆయన సిద్ధాంతాల్నే అనుసరిస్తానని సమాధి దగ్గర ప్రమాణం చెయ్యలేదు. ఆయనలేని లోటుగురించి పబ్లిక్కుగా గుండె బాదుకోలేదు. అయినా గాంధీ గారంటే వల్లమాలిన అభిమానం.

అందుకే ప్రజల సమస్యల్ని సమ్మె ద్వారాతెలియజేయడం మంచిదని నమ్మిన వ్యక్తి ఆయన.

గుడి దగ్గర ఎండ మండిపోతోంది.

బక్క ప్రాణాలని సునాయాసంగా లాక్కుపోయేలావుంది వేడిగాలి. కాని, అక్కడ చేరిన ఎవ్వరూ ఎండను లెక్క చెయ్యటంలేదు. బ్రతికుండగానే వొంటికి నిప్పంటుకున్నట్లున్న ఆ ఎండలోచెమటలు కారిపోతున్నా చేతుల్లో జెండాలు పట్టుకొని నాయకుడి కోసం ఎదురుచూస్తునారు. చిన్నా పెద్దా అందరూ సమరానికి సిద్ధమౌతు న్నట్లున్నారు. గుంపులు గుంపులుగా వున్న వాళ్ళను చూస్తుంటే అంత మందిని కదిలించుకొచ్చిన నాయకుడికి సన్మానం చెయ్యబుద్ధి పుడుతుంది.

ఆవేశంగా చర్చించుకొంటున్నారు వాళ్ళు.

రోడ్లమీద దుమ్ము అంతకన్నా ఆవేశంగా రేగుతోంది.

దూరంగా అరుపులు, కేకలు మిన్ను ముడుతున్నాయి.

ఊరేగింపు జయజయ ధ్వానాలతో పోటెత్తిన సముద్రంలా సందుల్లోంచి ఇటు వస్తోంది.

గుడిదగ్గర జనానికి వుత్సాహం పురక లేసింది.

వూరేగింపు చేరువైంది.

గొంతులేస్తున్నారు, అరుస్తున్నారు, కేక లేస్తున్నారు తిడుతున్నారు.

"సెంద్రరావ్ నాయుడికీ..."– అని పెద్దకంఠాలు పెగుల్చుకొన్నాయి.

"జై..!"– మన్నాయి విరిగిపడ్తున్న కెరటాల్లా ప్రజాకంఠాలు.

ఊరు వూరేగింపు కేకల్తో హోరెత్తి పోతోంది.

బండిమీద నుల్చున్న నాయుడిగారి నుదిటిమీద కుంకుమబొట్టు చెమటకి తడిసి నాసిక చివర ఎర్రగా కొలనులా మారింది.

పూదండలమధ్య ఆయన అధికార శవంలా వున్నారనటం తప్పు.

ముకుళిత హస్తాలతో అందరికీ వంద నాలు చేస్తున్నారు ఆయన.

"గుక్కెడు నీళ్ళు ఇవ్వలేని పెద్ద లారా... గద్దెదిగండి!"

"మాకు నీళ్ళు కావాలి!''

''దొంగరాజూ...డౌన్..డౌన్!!''

అన్న జనం అరుపులమధ్య నాయుడు గారి బండి రచ్చబండకి చేరింది. నాయుడు గారు బండిమీదనుంచి భక్తుల భుజాలమీదకు చేరేరు. కాలు కందిపోకుండా జాగ్రత్తగా రచ్చబండమీదకు చేర్చేరు మోసుకొచ్చిన కార్యకర్తలు.

ఎండ దెబ్బకు వడిలిపోయిన నాయుడుగారు జ్వరం వచ్చిన ఏనుగులా రచ్చబండ మీద నిల్చున్నారు.

'జై'కొడ్తూనే వున్నారు జనం.

నాయుడుగారి స్వంత భజనబృందం 'శాంతించండి' అన్నట్టు సౌంజ్ఞలుచేసేరు.

మెల్ల మెల్లగా సద్దు మణిగింది.

నాయుడుగారు ప్రజలనుద్దేశించి వుపన్యాసం ప్రారంభించేరు..

"పెజలంతా నీటి సుక్కనేక మలమల మాడిపోతుంటే ఓట్లేయించుకొని సీటొదలని పెద్దలకు సీమ కుట్టినట్టుగూడా నేదు. తిండానికి తిండినేక-తాగడానికి నీటి సుక్కనేక పెజలు సచ్చిపోతుంటే పట్నంలో ముండలదగ్గర మందుకొట్టి తొంగుంటున్నారు. మరి దాన్నే పెజాసేవంటారేమో''

ఘొల్లుమన్నారు జనం.

ఈలలు వేసేరు నాయుడుగారి హాస్య ప్రియత్వానికి.

"ఇలాటోళ్ళందరికీపదవికట్టబెట్టిమనం తప్పుసేసేం. మరోవారంనోగా నీల్లుగాని సరఫరా సెయ్యకపోతే నేను ఇదే యేప సెట్టుకింద మనందరికోసం తిండి తిప్పలు మాని కూకుంటాను. పెజలకి కావల్సిన అవుసరాలు తీర్సలేనోడు బతకడంకన్నా సావడంమేలు. పెబుత్వానికి సెప్పి నీల్లొచ్చే ఏర్పాటు సేద్దామని నేను నానా తిప్పలు పడ్డే దానికి అడ్డుతగిలేరీ పెద్దలు. కలక్టరాఫీసులో నే పెట్టిన అర్జీలన్నీ లంచాలిచ్చి చింపేయించేరు. ఇదేనా పదవిలోవున్నోళ్లు సెయ్యాల్సినపనిఅని మీఅందర్నీ అడుగుతున్నాను. నన్ను దెబ్బ కొట్టడం కోసరం పెజలకి అన్నేయం సేయడం ఎంతవరకు నేయంఅని అడుగుతున్నాను!"

''ఎదవది పదవులే కావాలనుకుంటే ఇలాగుండేవాణ్నా? నాకు పెజలు ముఖ్యం. ఆల్లకష్టాలే నా కష్టాలు. కన్న బిడ్డలకన్న బాగా సూసుకుంతాను". నాయుడుగారి మాట వినబడకుండా చప్పట్లు మారు మోగేయి.

జనం మరోసారి ఆవేశంగా 'జై'కొట్టేరు.

అవకాశం వున్న అందరూ ఇదే అదనుగా వుపన్యసించేరు. ప్రతివాళ్ళు రాజుగార్ని కడిగేసేరు. నీళ్ల తేలేని ఆయన్ని తక్షణం పదవినుంచి తొలగించాలని తీర్మానించేరు. పదవితో ఆయన ప్రజల్ని ఎలా దోచుకుంటున్నారో విపులీకరించేరు.

మధ్యమధ్యలో రాబోయే ఎన్నికల గురించి హెచ్చరించేరు. మళ్ళీ వాళ్ళే నాయుడుగారి ప్రజాసేవని పొగిడేరు. ఆయన నీళ్ళగురించి ఎంతగా కుమిలిపోతుందీ ఎలుగెత్తి చాటేరు.

ఆమరణ నిరహారదీక్ష విరమించుకోవల్సిందిగా భక్తులు పబ్లిక్కుగా నాయుడు గార్ని బతిమాలేరు.

కాని ఆయన తన ప్రాణం కన్నా ప్రజలే ముఖ్యం అని నొక్కివక్కాణించేరు.

నాయుడుగారి మంచి మనసుకి భక్తులు నీరాజనం పట్టేరు.

సభ ముగిసింది. అందరూ ఇళ్ళదారి పట్టేరు. నాయుడుగారు తనచుట్టూ చేరిన భక్తుల బాధల్ని వింటూ అక్కడనుంచి

కదిలేరు.

రచ్చబండ దగ్గర నిర్మానుష్యం అయ్యింది.

ప్రజల కేకలకి ఎండ ప్రతాపం తగ్గలేదు.

కరణం, మునసబులకి కళ్ళు చింత నిప్పుల్లా మారేయి. అంత మంది జనం అక్కడ చేరడం తల్చుకోగానే రక్తం సెగల్లె మరిగింది. నాయుడుగారి ఎత్తుగడలు తెల్సినా వాటిని బయట పెట్టే సాహసం చెయ్యలేదు.

ఎన్నికలగురించి తల్చుకోగానే వొళ్ళు జలదరించింది ఆ ఇద్దరికీ.

ఎక్కడవిన్నా నాయుడు గురించే! నీళ్ల గురించే!! ఎవరు తిట్టినా రాజుగార్నే!!

పెరుగుతున్న నాయుడు పాపులారిటీ తల్చుకోగానే గుండె ఎండిన చెరువైంది.

ప్రత్యర్థిని ఎలా ఎదుర్కోవాలి అన్న ప్రశ్న పెరిగి పెద్దదయి ఇద్దర్నీ కబళిస్తుండగా...

దుమ్ము రేపుకుంటూ ఆకలిగొన్న పులిలా వస్తున్న రాజుగారి జీపు కన్పించింది.

* * *

జంతు దశనుంచి మార్పు చెందబోతూ



సగంలో ఆ మార్పు ఆగిపోయినట్లు అన్పి
స్తుంది రాజుగార్ని చూడంగానే. ఆయ
నిప్పుడు నరమాంసం వాసన చూసిన
రాక్షసుడిలా వెర్రెత్తిపోయున్నారు. పిచ్చి
కోపం చిందులేస్తోంది.

సెంద్రరావ్‌నాయుడు పెట్టిన కుంపటి
కొరివిలా అన్పించింది.

రోజు రోజుకీ నాయుడుగారు చేస్తున్న
మేజిక్కులకి రాజుగారు హడలిపోతున్నది
నిజం.

"నీయమ్మ! పిల్లనాకొడుకనుకుంటే
నా గుండెమీదే బాదేసేడు.మరింక ఆలీసెం
సేత్తే మనల్ని కుక్కలుగూడ సూడవు"
రాజుగారు ఆవేశంగా అన్నారు.

"ముందర నీల్లగురించి మరో ప్రకటన
సెయ్యండి. పెజలు శాంతిస్తారు" మునసబు
సలహా ఇచ్చేడు.

"ఇప్పుడు పెకటనల్తో పనిజరగదు.
ఏదో మాయ సెయ్యాల" కుంటిసత్తి
వ్యతిరేకించేడు.

"బాంబురాజుగాడు సెప్పేడు నీల్లుపడే
సోట్లు సెప్పేవోల్లు అయిదరాబాదులో
వుంటారటగా? ఇంకా ఆడు అయిదరా
బాదు పోనేదు. మీ సెలవైతే"-మునసబు.

రాజుగారికి అంతకుమించి మరోమార్గం
తోచలేదు. నీళ్ళువచ్చినా రాకపోయినా
అందుకోసం శ్రమపడుతున్నట్లు ప్రజల్లో
ప్రచారం జరగాలి. లేకపోతే నాయుడు
మాటలు జనం నమ్మడం...

"రేపే ఎల్లటం. ఆ యెదవ యాడతిరుగు
తున్నాడో ముందు వర్రెంటుగా నాక్కురండి.
సొల్లుకబుర్లు మానేసి రేప్పొద్దుగాల నుంచి
రంగంలోకి దిగండి. నాయుడుగాడి
యవ్వారాలు కుసింతకనిపెట్టండి" హెచ్చ
రించేరు రాజుగారు.

సిన్మాల్లో బాస్ మాటలకు తలవొంచి
పాటించే చిల్లరబొంగల్లా అందరూ తల
లాడించేరు.

మందుసీసా మూత తెరచుకుంది.

మరోమాట కదల్లేదు. మౌనంగామందు
గొంతుల్లోకి జారుకొంది. ఎన్నికలభయం,
బెంగ బాగా పట్టుకోవడంతో మరింతక్రుంగి
పోయారు. కత్తులవంతెనమీద పరుగెడు
తున్నట్లనిపించింది.

ఇదే ఎన్నికలు కాకుండా వుండి వుంటే
సెంద్రరావ్‌నాయుడు చేసిన హడావిడికి
ఈ పాటికి ఏ గొయ్యిలోనో ప్రశాంతంగా
పడుండేవాడు.

గజిబిజిగా ఆలోచన్లు. గొంతుకను
కాలుస్తూ మందు..ఎదురుగా నల్లగాచీకటి.

చాలా క్షణాల తర్వాత బలాబలాల్ని
ఎలా రంగంలోకి దింపాలో చర్చ
నీయాంశం అయ్యింది అక్కడ.

సీసాలో మందు తరగనారంభించింది.
చీకటి పల్చబడ్డం ప్రారంభించింది.

* * *

ఇంటిముందున్న గేదెలు కునుకెయ్య
లేదు. గడ్డిపెట్టకుండా పాలు పితుక్కుం
టున్న మనుషుల్ని చూసి అసహ్యించు
కుంటున్నాయి.

కోళ్ళు గుడ్లని పొదుగుతున్నాయి.

నాయుడుగారు చుట్ట తగలేస్తున్నారు.

లింగం, సూరి ఆనందంతో బూతు
జోకుల్లో మునిగిపోయేరు.

"ఈ దెబ్బసాలు రాజుకి..మరినెగడు''
లింగం నవ్వుతూ అన్నాడు.

"సిన్నదానికే సంబరపడేదెలా"అన్న
సూరిభావం వెంటనే పసికట్టేరు నాయుడు
గారు.

"ఇది సిన్నదేటి. కునుకడదు.పిచ్చెత్తి
పోతుండాల ఈ పాటికి. పెజలంతా రాజు
గాడ్ని దుమ్మెత్తిపోత్తున్నరు.." లింగం.

వందిమాగధుల భజనకి రాజులు తబ్బిబ్బుకారు—

కార్యకర్తలు చేసే సన్మానంకి కరిగి పోరు మంత్రులు—

భక్తుడుపాడే కీర్తనకి వెంటనే వరం ఇవ్వడు దేవుడు—అని నాయుడుగారికి తెల్సు.

ఆయన బాధల్లా ప్రజలందరి ముందూ నిరహారదీక్షచేస్తానని ఇచ్చిన మాటసంగతి పురుగులా తొలిచేస్తోంది. చెయ్యకపోతే ప్రజలు తనకి ఓటెయ్యరు అన్న నిజం నరనరాల్నీ కదిలించింది.

"మరో దెబ్బ కొడ్తేగాని రాజుగాడు పూర్తిగా సావడు" నిదానంగా అన్నాడు సూరి.

ఎలా అన్న అనుమానం మెదలక ముందే నాయుడుగారికి అబ్బులు గుర్తు కొచ్చాడు. ఎగిరి గంతేద్దామనుకున్నారు.

లింగం, సూరి రోజువారీ కార్యక్రమం తయారు చేస్తున్నారు..

సరిగ్గా అప్పుడే... నాయుడుగారు సూరికి, లింగానికి కొత్త ఎత్తుగడ గురించి చెప్పేరు. తద్వారా వచ్చే పరపతి— ఓట్లు తల్చుకొని ముగ్గురూ మనసులో సంత సించేరు.

అధికారపార్టీ అర్డినెన్సులా ఎదురు లేకుండాపోయి ఆ పథకానికి ముగ్గురి ఆమోదముద్రా పడింది.

మట్టి అంటుకోకుండా పని ఎలా జరుపాలో చర్చిస్తుండగా—

పక్కనున్న పాకల మీదెక్కిన కోళ్ళు ఓపిగ్గా అరవడం ఆరంభించేయి.

* * *

ఆరాత్రి...

ఆకాశంలో చుక్కలు ముగ్గెయ్యలేదు. చంద్రుడు మబ్బుతునక మాటునుంచి కొత్త వెండి పళ్ళెంలా, శోభనం రాత్రి సరదాపడే పెళ్ళికొడుకులా రాలేదు. వెన్నెల పట్టు చీరలా వూరి మీద వాలి పోలేదు.

చీకటి భూమ్యాకాశాల్ని కలిపేసి లంచగొండితనంలా వ్యాపించింది. చిక్కటి చీకటి వూరికి నల్లగా రంగు వేసింది. పాకల్లో దీపాలు వెలుగు పంచ లేక అవస్థపడుతున్నాయి.

అది మహానగరం కాదు కాబట్టి వీధి దీపాలు వెలుగు చిమ్మటం లేదు.

ఏవీ దొరకని తోడేళ్ళు దూరంనుంచి అరుస్తున్నాయి. కుక్కలు రాగాలు ఆల పిస్తున్నాయి. వేపచెట్టు వొళ్ళు విరుచు కుంటున్న దెయ్యంలా వుంది. ఆరని చుట్టల కబుర్లు సన్నగా విన్పిస్తున్నాయి. పాకలు భయంతో బితుకు బితుకు మంటు న్నాయి.

చల్లగాలి వెచ్చగా పాకుతోంది.

కాలం మామూలుగా కదుల్తోంది.

గుళ్ళో దేవుడు గబ్బిలాలతో కునుకు పట్టక గతం నెమరేసుకుంటున్నాడు. చెరువు గట్టు నిర్మానుష్యంగా వుంది.

గాలికి ఎండుటాకులు కదిలి గరగర మంటున్నాయి. శూన్యంలో సుడులు తిరుగుతున్న గాలిహోరు కొందరికి శ్రావ్యంగా, మరికొందరికి భయంకరంగా విన్పిస్తోంది. బరువుగా కనురెప్పలు తెరిచిన చింతల్లికి ఆ చీకటి అందంగానే కన్పించింది.

ఆమెనే తదేకంగా చూస్తున్న అబ్బులుకి అమావాస్యనాడు చంద్రుడు వుదయించినట్టుగా వుంది.

అతగాడికి చీకటి చీకటిలాగాక వెన్నెల వరదలా వుంది.

చుట్టూరా కన్ను పొడుచుకొన్నా కను

పించని ఆ చీకట్లో చింతల్లి కళ్ళ మెరు పుల్లో ప్రపంచాన్ని చదువు కొంటు న్నాడు. గిలిగింతల చలిగాలికి చింతల్లి కౌగిలి సమాధానం చెబోంది.

వాళ్ళిద్దరూ భాష మర్చిపోయి చాలా సేపయింది. అది ఎన్ని గంటలో చెప్ప డానికి వాచీల్లేవు. వారికి దాన్నిగురించి దిగులూ లేదు.

"ఆ బాబేటన్నారో సెప్పినావుగాదు" అంది చింతల్లి అతన్ని విడిపించుకుంటూ.

మధ్యరాత్రి మత్తులో ఉండగా ఇంటద్దె గుర్తుచేసే పెళ్లాన్ని చూసినట్లుగా చూసేడు అబ్బులు. పెళ్ళాం కాదు కాబట్టి చిరాకు పడలేదు. ప్రేయసి కనుక అందంగా చికాకుపడ్డాడు. సమాధానం మాత్రం చెప్పలేదు.

"ఇనబడ్నేదేటి?!" అని అతని భుజం మీద పడి వాలిపోతూ అడిగింది చింతల్లి.

'విన్పించింది కానీ నీకు ఎలా సెప్పాలో అర్థంకాక అవస్త పడ్తున్నాను' అని అబ్బులు అనలేదు.

"నానేటడిగినా అలగ దిక్కులు సూత్తావేటి? నన్ను కట్టుకోడం ఇష్టం నేక పోతే సెప్పెయ్యొచ్చుగా..? ఎప్పుడడిగినా ఏటేటో సెప్తావ్" కోపం చీకట్లో తీక్షణంగానే కన్పించింది.

అబ్బులి గుండె గొంతులోకి వచ్చింది. మాటలు పెదాలమీద వొర్లేయి.

"ఏటి సెప్మంటావ్...? ఆ బాబు దగ్గర మనిసయం కదిపినాను'' అని ప్రాంప్టింగ్ అందుకోలేని కొత్త స్టేజి నటుడిలా అటెటో చూసేడు. బేగ్రౌండ్ మ్యూజిక్కు, ఓ ఏడుపు పాట వుంటే అతగాడి భావం ఇట్టే తెలుసుకోవచ్చు.

"ఆరేటన్నారు..." ఆత్రంగా అడి గింది.

"ఏటంటాడు...మిగతా పెద్దోల్లందర్ని అడిగి ఆలోచించి సెప్తానన్నాడు"

"నీకు బుద్ధినేదు... నేకుంటే మన పెళ్ళి ఇసయం ఆల్లందర్నీ అడిగేదేటి?!"

దిగ్గున చూసేడు చింతల్లికేసి.

చింతల్లి మారని నిర్ణయంలా కన్పిం చింది.

"కులాలొకటి కాకపోతే పెల్లి సేసుకో కూడదేటి? కాపురం సేసేది మనవా... ఆల్లా! నువ్విలాగే ఆల్ల సుట్టూ తిరుగుతూ వుంటే మనవింతే! నీకేటితెల్సు నానొక్కర్తిని ఎలాగుంటున్నానో''

కళ్ళల్లో తడిపొర జిగేల్‌మంది నల్లగా.

కొండ కరిగినట్లు అబ్బులు కదిలేడు.

చింతల్లిని మరింత దగ్గరగా తీసు కొన్నాడు.

వాళ్ళిద్దరి శరీరాల్తో పాటు ఆలోచన్లూ కలిసేయి.

చింతల్లి కురుల్లో అబ్బులి వెచ్చటి శ్వాసలు జారేయి. గూడు దొరికిన పిట్టలా ఆమె అతని గుండెమీద వొదిగిపోయింది.

సర్వస్వం అనుకొన్నవాడి ఓదార్పు ఆడదానికి ఎంత వూరట కల్గిస్తుందో అబ్బులికి తెలీదు.

తను కోరుకుంది తనకి కాకుండా పోతుందేమోనన్న బెంగ. తెగించి ముందుకు పోదామంటే కులాల పేరుతో కాకుల్లా పొడిచే పెద్దల భయం. వూరు దాటినా పట్టెడు మెతుకులు దొరకవన్న అనుభవం వుండటం చేత అసమర్థత అతన్ని బంధించింది.

"నానింక వొంటరిగా వుండలేను... తొందరగా తేల్సేసినావా సరే. నేదా నేనేటౌతానో నాకేతెల్దు..." గొంతులోనే దుఃఖం దిగమింగుకొని అబ్బులికి

వార్నింగ్ ఇచ్చింది.

ఆ మాటలు వినంగానే తపోభంగం జరిగిన రుషిలా చూసేడు అబ్బులు. అతనిలో చలనం కలిగి వేకువ తొలి కిరణంలా ఆమెకేసి చూసేడు.

మగవాడి కళ్ళల్లో భావం ఆడదే చదువుకోగల్దు-ఆయుధం పట్టించగల్దు-అణగదొక్కగల్దు.

"నువ్వేటి దిగులు పడమాక. ఇంకెవరి మాటలూ ఇనదల్చుకోలేదు. నీ కన్నా ఈ పెపంచం నాకేటి గొప్ప కాదు. పంతులుగార్నడిగి మంచిరోజు సూసి పెళ్లి సేసేసుకొందాం. నా మాట నమ్ము"- అన్నాడు అబ్బులు.

చింతల్లి ఆనందంతో గట్టిగా వాటేసుకొంది. ఆమెలో వెల్లువలా వురకలేసిన సంతోషాన్ని ఆపటం అబ్బులి తరం కాలేదు. ఆమె వెచ్చటి పెదాల గుర్తులు గుండెమీద చెరిగిపోకుండా పచ్చబొట్టులా పడ్డాయి.

ఇద్దరూ గట్టిగా నవ్వుకొన్నారు. సిగ్గు పడ్డారు. వుక్కిరి బిక్కిరయ్యారు.

క్లాసు ఎగ్గొట్టి ఎదురింటి కుర్రాడితో సినిమాకి వెళ్ళినా అనుక్షణం గుర్తుకొచ్చే తండ్రిని మర్చిపోని అమ్మాయిలా చింతల్లి అంత ఆనందంలోనూ ఇల్లు చేరాలన్న విషయం మర్చిపోలేదు.

అబ్బులుకి మాత్రం ఆ రాత్రి అలాగే ఆగిపోతే బాగుండుననిపించింది.

"మర్నే ఎల్లేదా?" అంది మత్తుగా చింతల్లి.

''ఇప్పుడే గదే నువ్వొచ్చింది.."

"నీకలాగే వుంటది. ఇయ్యాల రాజు బాబు పట్నం ఎల్లుంతారు. అమ్మగారికి తోడ్నేకపోతే ఎలాగ? బాగా ఆలీసెం అయిపోనాది."

కెమేరా మొహంమీద పెట్టకపోయినా ఎక్కువ రియాక్షన్ ఇచ్చే ఎక్స్ట్రా నటుడిలా చూసేడు అబ్బులు. 'ఇంత అందమైనరాత్రి మా ఇద్దర్నీ విడదీయడం న్యాయమా?' అని ఎవ్వర్నీ అడగలేదు గానీ ఆ భావం వచ్చేలా ఎక్స్ప్రెషన్ ఇచ్చేడు.

"మరందుకేగదా బేగి పెల్లి సేసుకుందావంతుంది.." అని అందంగా సిగ్గులో మొగ్గలేసింది చింతల్లి.

సిగ్గు చీకట్లో కలిసిపోయింది.

అబ్బుల్నుంచి దూరంగా కదిలింది.

"ఏటి నిజెంగా ఎలుపోతున్నావేటి?"

"నేకపోతే ఆసికం అనుకున్నావేటి?"

"సంపేసావు గదే!"

"ఏటయింది?" ఖంగారు పడింది.

"అది సెప్పేది గాదు"

"సంపీక ముందదేటో సెప్పరాదూ..!"

ఆస్తంతా కుక్కపేర రాసేసిన తండ్రిని చూసిన తనయుడిలా భారంగా నిల్చున్నాడు అబ్బులు.

చింతల్లికి గుండె గుభేలుమంది.

"నాతో సెప్పవా?" చిన్నగా అంది దగ్గరగావస్తూ భయంగా. ఆమె నడుము చుట్టూ చేతులేసి గట్టిగా అదుముకున్నాడు.

తీగలా అతన్ని చుట్టేసింది చింతల్లి.

క్షణాలు కరిగేయి.

చీకటి కళ్ళు చీల్చుకొని ఇద్దర్నీ చూస్తోంది.

"నానెల్తాను ఆలీసెం అయిపోనాది" అని అతగాడ్ని దూరంగా తోసేసింది.

అబ్బులు మాట్లాడలేదు.

ఇద్దరూ చిన్నగా అడుగులేసేరు.

"పంతులుగారి దగ్గరకెప్పుడెల్తావ్?"

అడిగింది చింతల్లి.

"పొద్దుగాల."

"మర్చిపోకు" అంది కట్టదిగుతూ.

"మరి నానెల్లనా" వీడ్కోలిస్తూ దీనంగా అన్నాడు అబ్బులు.

ఆగింది చింతల్లి.

దగ్గరగా వచ్చేడు అబ్బులు.

"ఎవలేనా సూత్తారు" సిగ్గుగా అంది చింతల్లి.

"నిద్దర్లు మానేసి మనల్ని సూడ్డవేనేటి జనానికి పని" అంటూ గబుక్కున దగ్గరకు లాక్కున్నాడు అబ్బులు.

కాలం ఓ క్షణం ఆగింది సిగ్నల్ దొరక్క.

ఇద్దరి దారులు వేరయ్యేయి. ఇష్టంలేక పోయినా వెళ్ళక తప్పింది కాదు. చెరువు కట్టనపడి అడుగులు సారించేడు అబ్బులు. అలా చీకట్లో చుక్కయి పోయేదాకా చూస్తూ నుల్చుంది పోయింది.

పల్చటి నవ్వు అప్రయత్నంగా పెదాల మీద కొచ్చింది.

చీరకొంగు పళ్ళమధ్య నలిగి సిగ్గు పడింది.

అబ్బులు కౌగిలి వెచ్చదనం, ముద్దుల్లో తియ్యదనం చింతల్లిని చుట్టుముట్టింది. ఆ ఆనందం వుక్కిరి బిక్కిరి చెయ్యగా ఇంటిదారి పట్టింది.

సరిగ్గా రెండడుగులు వెయ్యకముందే-

ఎదురుగా-

ఏ దెయ్యం జడలు విరబోసుకుని కన్పించలేదు. ఆకారం లేని శవాలు స్వాగతం పలకలేదు. అబ్బులు శవమై ఎదురుపడలేదు. తన వూహల్లో పెళ్ళి పందిరి కళ్ళముందు కూలిపోతూ కన్పించ లేదు.

చింతల్లి శరీరంలో రక్తప్రసారం ఆగింది.

గుండె దడదడలాడింది. శరీరం తడిసి ముద్దయింది.

భయంతో వొణికిపోయింది.

కళ్ళకి మైకం పొర కమ్ముతుండగా మరో అడుగు వెయ్యబోయింది.

ఎదురుగా మెరుస్తున్న బీడీ నిప్పు దావానలానికి ప్రారంభంలావుంది. చీకటికి చిరిగిపోయిన బొట్టులా వుంది. ఆరిన చితిలో ఆరని నిప్పు రవ్వలా వుంది.

కొండ మీద నుంచి రాళ్ళు దొర్లినట్లు అతగాడు సౌమ్యంగా నవ్వేడు.

చింతల్లి గుండెలో పరిగెడుతున్న రైళ్ళకి యాక్సిడెంట్ అయింది.

ఏదో అందామన్న ప్రయత్నం – విఫలత.

అస్పష్టంగా, అసహ్యంగా, వికృతంగా ఎదురుగా వున్న వ్యక్తి ఎవరో అర్థం కాలేదు.

"ఎవలాలు?" – ధైర్యాన్ని కూడ దెచ్చుకొన్నా భయంగానే అంది.

బ్రిడ్జీ మీద పోతున్న గూడ్సు బండి శబ్దంలా మరోమారు నవ్వేడు వాడు.

చింతల్లికి వున్న ధైర్యం ఆవిరయింది.

ప్రాణాలు ఎటునుంచి పోతున్నాయో అర్థం కానట్లు చూసింది.

మనసు కీడు శంకించింది.

చీకటి అసహ్యంగా బెదిరించింది.

"అప్పుడే ఎలిపోనాడేటి అబ్బులు గాడు..?!" వ్యంగ్యంగా అంది ఆ శాల్తీ. అంటూనే అడవిలోంచి తప్పించుకొన్న క్రూరమృగంలా అడుగు ముందుకేసిందా శాల్తీ.

ప్రాణం ఎప్పుడో పోయిందనుకొన్న చింతల్లి చెరువుగట్టు మీదకు పరిగెత్తింది

భయంగా.

కాలుజారి కింద పడింది.

లేవబోయి గోడకు ఢీకొన్నట్లు ఆగిపోయింది. కట్టమీద అగ్గిపుల్ల వెలిగింది. ఆ వెలుగులో అతగాడ్ని పోల్చుకోలేకపోయింది. ఎర చూసి వలలో చిక్కుకుపోయిన చేపపిల్లలా అదిరిపడింది.పరిగెత్తబోయింది. ఆ శాస్త్రీ చెయ్యి పట్టుకొంది.

కట్ట కిందనుంచి మరో చింతమొద్దు బరువుగా కదిలొచ్చింది.

"నన్నొగ్గు. నీకు అప్ప సెల్లెల్లాటి దాన్ని..." అంది విడిపించుకునే ప్రయత్నంలో.

'సారీ! డార్లింగ్...' అని ఇంగ్లీషులో అన్లేదు గానీ సరిగ్గా అదే అర్థం వచ్చేలా నవ్వేడు.

"నీకోసం ఆవురావురని కూకుండిపోనాం ఇంతసేపూ. ఇలాగ బెదిరిపోతే ఎలాగ?! ఆడిపాటి సెయ్యవేటి మేం?" అన్నాడు.

రచ్చబండ దగ్గర కుక్క గయ్యిమంది.

ఊరు చింతల్లి కేకకి అదిరిపడలేదు.

ఆ పిలుపుకు ఎవరి కునుకూ చెదిరిపోలేదు. పాము ఒళ్ళో పవ్వళించిన దేవుడు పరిగెత్తి రాలేదు. చీకటి కరిగిపోలేదు. గాలికి జాలి కలగలేదు. చెయ్యి విడిపించుకున్న చింతల్లి చెరువు కట్టమీద దొర్లింది. చేతులు కాళ్ళు కొట్టుకుపోయాయి.రక్తంఎర్రగా,కన్నీళ్ల నల్లగా జారేయి.

ఆమె ఏడుపు గాల్లో కలుస్తోంది.

మీదపడ్డ దున్నపోతులాంటి మనిషిని తోసేందుకు విశ్వప్రయత్నం చేస్తోంది.

అతగాడు ముద్దుగా బుగ్గ కొరికేడు. పంటిగాట్ల మధ్య రక్తం పెల్లుబికింది గిలగిలా తన్నుకొంది. చేతిగాజులు విరిగి గుచ్చుకొన్నాయి. వీపు కింద రాళ్లు శరీరాన్ని కోతపెట్టాయి.

అతని జుట్టు పట్టుకోబోయింది-దొరకలేదు.

అతని చేతుల్లో నడుము చెరుకు పిప్పిలా నలిగిపోతోంది.

అరుస్తోంది! ఏడుస్తోంది!!

అదేం పట్టనట్లు కసిగా, ఆవేశంగా ఆమె పెదాలను కొరికేస్తున్నాడు వాడు.

కట్టమీద రెండోవాడు చీకటితోపాటు కాపలా కాస్తున్నాడు.

ఆఖరి ప్రయత్నంగా కాళ్ళతో డొక్కలో పొడిచింది. అతడూహించని పరిణామం కావడంతో పక్కకి వొరిగేడు. చింతల్లి పులికేక విన్న లేడిలా గబుక్కున లేచి పరిగెత్తబోయింది. సగం జారిన చీర కాళ్ళకి అడ్డంపడి కట్టమీద నుంచి బొమ్మలా దొర్లింది.

కట్టమీద సన్నపాటి శాస్త్రీ పరుగు పెట్టేడు. దుశ్శాసనుడిలా ఆమె చీరందుకొన్నాడు. చేతిలోకి వచ్చింది చీర. చింతల్లి చీకట్లో కలిసింది.

"ఏటెలిపోనాది" రొప్పుతూ దిగేడు తుమ్మమొద్దు,

"ఇలగే పోనాది..పద''- ఇద్దరూ పరుగు పెట్టేరు.

చింతల్లి పరుగుకి చాలా అడ్డంకులొచ్చేయి. కాళ్లల్లో ముళ్ళు దిగబడ్డాయి. రక్తం కారుతోంది. గొంతుక ఎండిపోయింది.నరాలు నిస్సత్తువుగా మూల్గేయి.

దగ్గరౌతున్న అడుగుల శబ్దం మరింత భయాన్ని కల్గించింది. చుట్టూరా చీకటి. ఎటుపోవాలో ఆలోచించే సమయం లేదు. గుడి గోపురం కన్పించింది. అటుగా పరి

గెట్టబోయింది. కళ్ళు తిరిగేయి. అడుగు బలవంతంగా వేసింది. వెనక్కి తిరిగి చూసింది. ఎవ్వరూ కన్పించలేదు.

పరుగు మాని అడుగులు వేగంగా వేసింది.

కన్నీరు వరదలా పారుతోంది. శ్వాసలు ఎగిసి పడ్తున్నాయి.

"అమ్మ నంజెకానా...మా కళ్లలోనే కారం కొట్టేసి ఎలుపోదారనే" అన్న మాటతో గుండె ఆగినట్లయింది చింతల్లికి. గుడి మరో పదడుగులు... కొంచెం దూరంగా ఇళ్ళు.

ఆ ఇద్దరూ అసహ్యంగా నవ్వేరు.

అమాంతంగా ఇద్దరూ ఒ కే సా రి వాటేసుకొన్నారు. ఇద్దరిమధ్య చింతల్లి పిండయ్యింది.

బాధ భరించలేక అరిచింది. సన్నపాటి శా స్త్రీ గట్టిగా నోరు మూసేడు. రెండో వాడు జాకెట్టు చించేడు.

పెనుగులాడింది. గింజుకుంది. విది లించుకొని చెయ్యి కొరికింది. మళ్ళీ గట్టిగా అరిచింది.

అంతకన్నా వేగంగా రెండోవాడి పిడికిలి కడుపును తాకింది. కోపంలో ఒళ్ళు తెలీని ఆవేశంతో కొట్టేడు వాడు.

ఆమె ఆర్తనాదాన్ని గాలి వూళ్ళోకి లాక్కుపోలేదు.

చింతల్లి విరిగిన కొమ్మలా, మాంసం ముద్దలా కూలిపోయింది చల్లగా!

ఇద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు. ఇద్దరూ ఒకేసారి చింతల్లిని చూసేరు.

దూరంగా ఎక్కడో వినబడుతున్న మాటలకు ఆలోచనలో పడ్డారు. గాలి చెట్ల ఆకులమధ్య ఒదిగిపోయింది.

వీధుల్లో జనం లేరు.

పాకలు రాలిన ఆకుల్లా అణిగిపో యున్నాయి.

ఊరు నిద్దరోతోంది అలసటలో.

కాలం దొంగలా పారిపోతోంది.

* * *

పరాయివాడి కౌగిట్లో ప్రపంచాన్ని మర్చిపోతూండగా అసలు మొగుణ్ని చూసినట్లు గబుక్కున తెల్లారింది ఆ వుదయం.

విసుగ్గా వెలుగు వూళ్ళోకి వచ్చింది.

ఎన్నెన్ని వెధవ పనులు చూడాలో అన్నట్లు చికాగ్గా కొండల దగ్గరకొచ్చేడు సూర్యుడు.

పాకలు పక్క దుప్పట్లు విదిలించేయి.

పాల చెంబుల హడావిడి మొద లయ్యింది.

చెరువు దారి పట్టేయి బుట్టచెంబులు.

భగీరథులు కడవలు చేతబట్టి నీళ్ళకి ప్రయాణమయ్యేరు.

అయ్యరు పొయ్యిలో నిప్పేసేడు.

రాత్రి కునుకులేని చెట్లు కునుకు తీసే ప్రయత్నంలో పడ్డాయి.

తెల్లవారుఝాము పొగ మం చు కి తడిసిన గాంధీగారు సంధ్య వార్చుకొని అర్జంటుగా వెళ్తున్నట్లున్నారు.

పూజారిగారు గుడికేసి బయల్దేరేరు.

మాలపల్లి మత్తు వదిలించుకుంటోంది.

రాజుగారి మేడ దుప్పటి తొలగించ లేదు.

నాయుడుగారి ఇల్లు వుదయానికి ఇంకా స్వాగతం పలకలేదు.

సిగ్గుతో కుచించుకుపోయిన గుళ్ళో దేవుడు అలాగే రాయిలా నిల్చున్నాడు. కళ్లుమూసుకుని గడపదాటిన పూజారిగారు కళ్ళు తెరిచేసరికి నోట్లో మంత్రం గొంతులోకి జారిపోయింది.

మండపంలో నందీశ్వరుడు కాళ్ళు విరిగినట్లు దీనంగా వున్నాడు.

నందిమీద అడ్డంగా పడున్న మనిషి వంటి మీద ఆచ్ఛాదన అంతంత మాత్రంగా వుంది.

రేగిపోయిన జుట్టుతో, దుమ్ముతో పాటు ఎండుటాకులు అతుక్కున్నాయి.

నల్లటి ఆమె శరీరం మీద నల్లబడిపోయిన రక్తం మరకలు.

ముగిసిన సంధ్యాకాశంలా చెరిగిన బొట్టుతో నుదురు నల్లగా మెరుస్తోంది. కన్నీటి చారలు మాయని మచ్చల్లా వున్నాయి. వురేసుకోబోయి తాడు తెగి కింద పడ్డదానిలా, చెప్పుకింద నలిగిపోయిన పురుగులా పడుంది చింతల్లి నంది మీద.

కాళ్ళు చేతులు వేళ్ళాడుతున్నాయి.

గాలికి కురులు చిన్నగా కదుల్తున్నాయి.

పూజారి గారు కలో, నిజమో అర్థం కాక రాగి చెంబులో నీళ్ళు ఔపోసన పట్టేరు. బిత్తరపోయి చుట్టూ చూసేరు. చెదురు మదురుగా విసిరేసిన బొమ్మల్లా వున్న జనం గాఢ నిద్రలో వున్నారు.



'ఈ ఘోరం ఏమిటి స్వామీ..?'– అని దేవుడ్ని అడగలేదు ఆయన. ద్వారం సందులోంచి దేవుడ్ని చూసేరు. మూగ సాక్షిలా దేవుడు పూజారి కేసి చూసేడు.

పూజారి గారికి తక్షణ కర్తవ్యం తోచలేదు.

అయోమయంలో స్తంభాన్ని ఆసరా చేసుకొని కూలబడ్డారు. సరిగ్గా అదే సమయంలో......

సూర్యుడు కొండ మీద నుంచి ఎగిరి ఆకాశంలోకి వచ్చేడు. ఎండ చ్రుమంటూ అన్ని గడపల్లో ముగ్గుల దగ్గర ఆగి పోయింది.

ఊరు వూపిరి పీల్చుకొని కర్తవ్యంలో పడింది.

మహామహులుపోతే క్షణంలో లోకానికి చావుకబురు తెలుస్తుంది. సామాన్యుడు పోతే కాటికాపరికి తెల్సింతర్వాత బంధు కోటికి ఆవార్త తెలుస్తుంది.

గుడిలో అతి దారుణంగా పడున్న చింతల్లి ఏ పెద్ద మంత్రిగారికీ కోడలు కాదు, ఏ మహా సన్యాసి శిష్యురాలూకాదు. మరేదీ కాదు. కేవలం ఒక సామాన్యురాలు.

చావు కబురు ముందు మాలపల్లికీ, ఆ తర్వాత వూళ్ళోకి పాకింది.

కావల్సిన వాళ్ళు గుండె బాదు కొన్నారు. ఏంతోచని వాళ్ళ అందరికన్నా ముందొచ్చారు. తోచినవాళ్ళు మాల పల్లికేసి పరిగెట్టేరు. తెలివైనవాళ్ళు నాయుడుగారింటి కేసి పరిగెట్టేరు–రాజు గారి కోసం ఎదురు చూసేరు.

గుడిలో జనం నిద్రమేల్కొనే సరికే అక్కడ జనం గబగబా చేరిపోయేరు.

కొత్తవాళ్లు ఆ దృశ్యం చూస్తే మాత్రం ఈ దేశంలో పెరిగిపోతున్న భక్తి తత్ప రతను చూసి గుండె బాదుకుంటారు. దేవుడికి పెళ్ళైమోననుకొంటారు. నాస్తి కులైతే దేవుడికి ఏమన్నా అయిందేమో ననుకుంటారు– ఆ జనాన్ని చూసి.

నిద్ర మేల్కొన్న లేడి ఎదురుగా పులిని చూసినట్లు అబ్బులు వార్త వినం గానే వున్న పళంగా పరిగెత్తేడు. కన్నీళ్ల వాన తుప్పరలా గాలికి చెదిరి పోతున్నాయి.

మనసు కన్నా వేగంగా పరిగెడు తున్నాడు.

గుండె పగిలిన అతను రాలి పడ్తున్న నల్లని వుల్కలా గుడిని చేరేడు.

క్షణాల్లో వూరంతా అట్టుడిగి పోయింది.

"ఎవరికి పుట్టింది ఈ పాడు బుద్ది. ఈల్లని పొయ్యిలో బెట్టా."

"ఇలాగ సంపనీకి అదేటి సేసిందని?"

"ఈల్ల పాపాల్ని ఆడే కాసేసుకో వాల."

పలురకాలుగా శాపనార్థాలు పెడు తున్నారు.

ఒరలోంచి లాగిన కత్తిలా వచ్చిన అబ్బులు దాలు ఎదురైనట్లు ఆగిపోయేడు. కన్నీటి తెరలకి చింతల్లి వుండ చుట్టి పారేసిన నల్లగుడ్డల మూటలాకన్పించింది. గుండె గోడు కన్నీరై వొలికింది.

"సేసిన ఎదవపని సాలక గుల్లోనే పారెయ్యాలా?!" అని కొందరు వాపో యేరు మనసులోనే.

సెంద్రరావ్‌నాయుడుగారు గజేంద్రుడి కేక విన్న విష్ణుమూర్తిలా వచ్చేరు. అబ్బులు బావురుమంటే బాధ్యతగల తండ్రిలా ఓదార్చేరు.

పట్నంలో చదువుకుంటూ సెలవల కొచ్చిన కుర్రకాయ పోలీసు రిపోర్టిమ్మ న్నారు. అక్కర్లేదన్నారు నాయుడుగారు.

అభ్యంతరం చెప్పలేదు ఎవ్వరూ!

ఎండకి తీక్షణత పెరిగింది.

అయినా రాజుగారు రాలేదు, ఆ రాక పోవడంలో అంతరార్థం గురించి గుసగుస లాడేరు కొందరు. ఆ తర్వాత ఆలో చించేరు చాలామంది. రాజుగారు పట్నం వెళ్ళారన్నారు ఎవరో.

సెంద్రరావ్‌నాయుడు అంత దుఃఖం లోనూ మిగతా ఏర్పాట్లు జరిపిస్తున్నారు.

లింగం, సూరి హడావిడి చూసి వాళ్ళ నిస్వార్థసేవను వేనోళ్ళ కొనియాడేరు ప్రజలు.

చింతల్లి శవం మెల్లగా గుడిని దాటింది – ముందు సెంద్రరావ్‌నాయుడు భారంగా అడుగులేస్తుండగా.

శవయాత్ర మౌనంగా సాగుతోంది. చావుమేళం ఇళ్ళల్లో జనాన్ని బయటకు లాక్కొచ్చింది.

లింగం, సూరి మధ్య మధ్యలో పాడెను మోసేరు.

నాయుడుగారు ముందున్నారు.

ఊరంతా వూరేగింది చింతల్లి!

సందు సందుకి జనం పెరగటం నాయుడుగారికి తృప్తినిచ్చింది.

అబ్బులుకి కన్నీళ్ళింకిపోయేయి.

పడమర గాలి అబ్బులు నరాల్లో సెగలు కక్కుతున్న రక్తం ఆవిరిలా వూర్ని చుట్టబెడ్తోంది.

ఆఖరు సారిగా అబ్బులు సెంద్రరావ్ నాయుడు గుండెల మీద పడి బావురు మన్నాడు. కన్నతండ్రిలా నాయుడుగారు ఓదార్చేరు.

కట్టెల్లో కాలి చింతల్లి పొగగా మారి గగనంలోకి చేరింది.



"యెదవది ఓ అమాయకపు ఆడదాని కోసరం ఇంత నీసేనికి దిగుతాడా రాజు. ఇంతకాలం పెద్దమడిసనుకొన్నాం!" అన్నాడు లింగం జనాంతికంగా!

"పాపం ఎవలకేసీ కన్నెత్తి గూడా సూసేదిగాదు. ఇంత అమాకపుది ఎలాగ బతుకుద్దా అనుకొన్నాం అల్లయ్య సచ్చిపోయినప్పుడు. రాజుగారుఆదుకొన్నా రంటే సంతోషించినాం. లోపల ఇంత కుల్లు దాపెట్టుకొన్నాడని తెలిత్తే ఎవలో వొకలం కాసుకోపోనామా?" అన్నాడు సూరి.

"ఏటి సింతల్లి మీద పేమ సేత తీసుకు పోనాడనుకున్నావేటి? ఎలక్సన్లుగదా! అందుకొసరం అనిసెప్పి నాటకం కట్టినాడు. సేనామాట్లు ఆ పిల్లకోసరం గింజుకుపోనాడు. వయస్సొచ్చినా బుద్ధి మాత్రం మారనేదు."– అంటో శాస్త్రి.

"పెద్దోల్లు సావెత వూరికే సెప్పేరా? ఏటి సేత్తాం దానిరాత అలగరాసుంది. సేసేదంతా సేసేసి గుట్టుసప్పుడు గాకుండా పట్నం ఎలిపోనాడు. మా కాని మడిసయ్యా రాజు."

సాయంత్రానికల్లా వూరంతా రాజుగారి పేరు మార్మ్రోగిపోయింది. సెంద్రరావ్

నాయుడు మనుషులు అవకాశం జార విడుచుకోలేదు. అదేపనిగా ప్రతి మనిషిని ఆపి విషయం చెప్పేరు.

రాజుగారే సింతల్లిని చెరిచి గుళ్ళో పడేశారని పుకారు బాగా పాకిపోయింది. మాలపల్లి నిప్పులు కక్కి కాంద్రించి వుమ్మేసింది. రాజుగారు నయవంచకులని నిర్ధారణకు వచ్చింది.

"సెంద్రరావ్ నాయుడు మంచి బావు గాబట్టి అన్నీ పాపం సొంతబిడ్డకు సేసి నట్టు జరిపినాడు. నిజెంగా గాంధీగోరే!" అని కూడా తీర్మానించేరు.

ఊళ్ళో అందరికీ రాజుగారిమీదకు అనుమానం రావటానికి బలమైన కారణం అందరికీ తెలిసిఉన్న ఆయన రసికతే. మాలపల్లి మీద ఆయన చూపిస్తున్న ప్రేమ కేవలం ఎలక్షన్ స్టంటని నిర్ధారించు కున్నారు వారు.

ఎక్కడ చూసినా చింతల్లి చావు గురించే చర్చలు! ప్రతినోటా రాజుగారు బూతుల్లో నానిపోతున్నారు.

కరణం గాని,మునసబు గాని,రాజుగాడి అనుయాయులుగాని నోరు మెదపలేదు. మాట్లాడితే కొడ్తారేమోనన్న బెంగ. రహస్యంగా రాజుగారికి కబురు పంపేరు వూరి పరిస్థితి గురించి.

సెంద్రరావ్ నాయుడు మాలపల్లిలో మీటింగు పెట్టేడు.

సభ దగరకి పిల్లా పీచు దగ్గరనుంచి అందరూ చేరేరు.

"నా తోబుట్టువును కోల్పోయాను" అని స్టేజి మీద రోదించేరు నాయుడుగారు.

పబ్లిక్కుగా సంతాపం వెలిబుచ్చేరు.

జనం చప్పట్లు చరిచేరు. నాయుడు గారికి జై కొట్టేరు. ఆయన సునిశిత హృద యాన్నీ, మంచి మనసునీ వేనోళ్ళకొని యాడేరు. రాజుగార్ని కోటి గొంతుకలతో తిట్టి పోసేరు.

అబ్బులు మాత్రం ఎవరి మాటా విన్పించుకోక ఒంటరిగా చెరువు గట్టు మీద వుండిపోయేడు. పదేపదే చింతల్లి మాటలు గురుకు తెచ్చుకుని కుమిలిపోయేడు. ఆవేదనలో కాలిపోయేడు. ఊరంతా స్మశానంలా అన్పించింది.చింతల్లిలేని తన బ్రతుకు నిరర్ధకం, తనకింకా చావుకి తెగింపు ఎందుకు రాలేదో అర్థంకాలేదు.

మాలపల్లి జనం సెంద్రరావ్ నాయుడికి వీడ్కోలిచ్చింది. వెళ్ళేముందు మాల పల్లి పెద్దలందరికీ నమస్కారంచేసి మరోసారి బోరున విలపించేరు. సభ్యత కాదని అందరూ ఆయన్నే అనుసరించేరు.

నీరు దొరక్క జనం ఎంత బాధ పడ్తోందీ విని నాయుడు గారి మనసు కరిగి నీరైపోయింది.

లింగం, సూరి పక్కన నడువగా నాయుడుగారు వూళ్ళోకి వచ్చేరు.

* * *

"మరీ లెక్కన మాలపల్లి మన్దేగా" అనుమానం పోని లింగం అన్నాడు.

"రాజుగాడు మన్దెబ్బకి మరి నెగడు" గర్వంగా అన్నాడు సూరి.

"అపుడే అయిపోనాదేటి?! రేపటాల నుంచి పెచేరం బాగా సెయ్యాల. పట్నం రికార్డింగు డాన్సులుమాట్లాడు.రాజు సేసిన దారునాల గురించి రోజూ గురు సేత్తూ వుండాల.నేకపోతే ఇట్టే మర్చిపోద్ది యదవ జాతి. అది సచ్చి మనకో పునాదేసినాది. దాన్ని జాగర్తగా కాపాడుకోవాల. ఇంతకీ రాజు వూళ్లోకి వచ్చేడా..!"

"నేదు.. ఇల్లిప్పుడొత్తే పెజలు కాల్సే తారు. అగయి పోతున్నారు రాజుమీద'' లింగం రిపోర్టు సబ్‌మిట్ చేసేడు.

"అది సాల్దు. మన మీద ఎదురుదెబ్బ తీయకుండా సూసుకోవాల" – సూరి.

"దేవాలయం సొమ్ము తినేడం గురించి గూడా పెజలకి సెప్పాలగదా! పాపం పూజారి పంతులు గుడి గురించి దిగులడి పోతున్నాడు..కుంభాభిసేకం అని గోలెడుతున్నాడు. అది గూడా జనం సేత అరిపించేతే మరి రాజుగాడు, ఆడి మెంబర్లూ క్లోజే!" తన తెలివితేటలకు తనే సంబర పడ్డాడు లింగం.

"అది నిజం!" అన్నారు మిగతా ఇద్దరూ!

నాయుడుగారు కుర్చీలోంచి లేచి సాలోచనగా నాలుగడుగులువేసి లింగాన్ని దగ్గరకు రమ్మని సైగచేసేరు.

"ఎవలికీ మనవాళ్ల సేసిన ఎదవ పని.."

"అలాటియి మనసులో ఎట్టుకోకండి. అంతా రాజుగారి దయ.." నవ్వేడు లింగం.

"ఎనకాముందు సూసుకోవాల. ఆడి మీదో సూపుపారేయండి."

"అబ్బులుగాడి గురించేనా. మీకు బయందేనికి? సప్పుడుసేత్తే ఆడి సోభసం పైలోకంలో వెరేంజి సెయ్యాలనూ.."

"అపాటి జాగర్త వుంది కదా! మన ఎదవల్ని రేపోపాలి మీటింగుకి సావమను" అని ఆయన మంచంవైపు కదిలేరు.

ప్రభులు పవళింపు సేవకు వుపక్రమించగానే భక్తులు ప్రణామములు చేసి ఇళ్ళదారి పట్టేరు.

* * *

ఉదయం పదిగంటలైంది.

వూరి నడిబొడ్డు మీద మిలటరీ మేజర్లా ఠీవిగావచ్చి ఆగింది పట్నం నుంచి వచ్చిన రాజుగారి జీపు. అందులోంచి ఏ ఆర్భాటాలు లేకుండా దిగేరు రాజుగారు. జీపుచుట్టూ పిల్లలు చేరేరు. పరిచయస్థులు ఎక్కడ పలకరించాల్సి వస్తుందోనని తప్పుకొన్నారు.

రాజుగారు చలించని కొండలా నిల్చున్నారు. జీపులోంచి మరోఇద్దరు దిగి గాలికి రేగినజుట్టు సవరించుకొంటున్నారు.

మునసబుగారు హడావిడిగా వచ్చేరు. యావజ్జీవఖైదీ జైల్లోంచి తప్పించుకొని పబ్లిక్గా తిరుగుతుంటే ఎంతగా ఆశ్చర్యపోతారో సరిగ్గా అలానే ఆశ్చర్యపోయేరు రాజుగార్ని చూసినవాళ్ళు.

తనతోపాటు దిగిన ఇద్దరినీ మునసబుకి పరిచయం చేసేరు రాజుగారు.

బాంబురాజు జీపుదిగి ఒళ్ళు విరుచుకొన్నాడు.

రాజుగారు వచ్చిన ఇద్దరితో అక్కడనుంచి కదిలేరు. అడపా దడపా ఎదురైన నమస్కారాలని అందుకొన్నారు.

"నువ్వెప్పుడొచ్చినావ్ బాంబు రాజూ" – దార్నిపోయే పెద్దమనిషి పలకరించేడు.

"నేనూ, రాజుబాబూ హయిదరాబాదు ఎల్లేం. నీల్ల గురించి పరిచ్చలు సేసే ఇంజనీర్లను తీసుకొచ్చినాం. ఆ బాబులు పరిచ్చలు సేసి నీల్లెక్కడ పడేది సెప్తారు. ఆ బాబులు మనకి హయిదరాబాదులో బాగా తెల్సినోరు." –అప్పటికే బాంబురాజు చుట్టూ పదిమంది చేరేరు.

"సూడంగానే ఎలగ సెప్తారు?" – అనుమానం వెలుబుచ్చేడు ఓ పెద్దాయన.

"అలా సూసి సెప్పడానికే అల్లు పదేల్లు సదుకుంది. మావుగాని ఎర్రోల్ల వైగాని తీసుకొచ్చేవేటి? ఆ బాబులకు

తీరిక నేదన్నా అపల్న కాల్లట్టేసుకొని నాకొచ్చినాం. మరింక బెంగుండదు."

"మరి ఆ బాబు సెప్పినసోట మనం బావి తవ్వాల్నా?!"

"నేకపోతే ఆ పని గూడా ఆ బాబే సేతారేటి?!"

"విప్పుడే సెప్తారేటి..!"

"మరందుకేగదా అంతదూరం నుంచి తీసుకొచ్చింది. ఆ బాబు సట్టుకు రావటం కోసరం రాజుగారు వారంరోజులు మకాం సేసి సాధించుకొచ్చినారు.." – అంటూ పాక విలాస్వైపు కదిలేడు బాంబురాజు.

అంతే!!

చాలామందికి విషయం తెల్సింది. చాలామంది వింత చూద్దాని కన్నట్టు గబగబా వచ్చేరు. కరణంగారు కన్పించిన అందరికీ ప్రచారం చెయ్యడం మొదలు పెట్టేరు.

జనం అంతా వచ్చినవాళ్ళతో పాటే తిరుగుతున్నారు.

వచ్చిన ఇద్దరూ ఇన్స్ట్రుమెంట్సుతో భూమిని పరీక్షిస్తున్నారు. అంత ఎండ లోనూ అందరూ ఓపిగ్గా వాళ్ళతోపాటు వున్నారు.

నట్టెండ సూర్యుడు చెమట్లు కక్కుతున్నాడు.

రాజుగారు ఎండకి కమిలిపోయేరు. చుక్క మంచినీళ్ళుకూడా ముట్టుకోలేదు ఆయన.

కొందరు వెళ్ళి గొడుగులు పట్టుకొచ్చేరు.

పరీక్షలు చేస్తున్నవాళ్ళు పెదవి విరవడం చూడంగానే రాజుగారికి ఆందోళన అధికమైంది. నీళ్ళుపడే అవకాశం లేదని వాళ్ళుచెప్తే తనపార్టీ గెలవడం కష్టం.

బాంబురాజు ఇన్ఛార్జ్గా రాజుగారు వూహించినంత త్వరగానే ప్రచారం సాగింది. జనం తండోప తండాలుగా రోడ్ల మీద చేరిపోయేరు.

రాజుగారు ప్రజలగురించి ఎంతగా మధన పడుందీ అప్పుడుగాని అర్థంకాలేదు. రాజుగారి మీద జరిగిన దుష్ప్రచారానికి కొందరు అర్జంటుగా సానుభూతి చూపించేరు!

ఉదయం భోజనం ముగించి భుక్తాయాసాన్ని తీర్చుకొంటున్న నాయుడుగారికి గొంతులో గబ్బిలం దూరినట్లయింది. తను కూర్చోబోతున్న సింహాసనం అక్కడ నుంచి మాయమైనట్లయింది. చింతల్లి బతికొచ్చినట్లయింది. మతిచెడిన నాయడుగారు పిచ్చికుక్కలా కుర్చీలోంచి లేచేరు. ఒకవేళ నీళ్లుపడే చోటు తెల్సిపోయి అక్కడ బావితవ్వించి నీళ్లుపడితే ఆ ఘనత రాజుగారికి పోతుంది.. మరి తను?పదవి?!

ద్రౌపది నవ్వులువిన్న దుర్యోధనుడిలా డైలమాలో పడ్డారు నాయుడు గారు.

సరిగ్గా అలాటి డైలమాలోనే పడ్డారు రాజుగారు కూడా.

కారణం... పట్నం నుంచి వచ్చిన ఇదరూ గుడిదగర ఆగిపోయేరు. వాళ్ళ పరీక్షలవల్ల తేలిన సారాంశం విని అందరూ అవాక్కయ్యేరు.

పూజారి గారికి నరకంలోకి వెళ్ళినట్లనిపించింది. పాలనుకొని పచ్చివిషం తాగినట్లు ఫీలయ్యేరు అందరూ!

పడమర సూర్యుడు రాజుగారి వదనంలా కందిపోయేడు.

గాలి కొట్టిన చెంప దెబ్బలకి ఆకాశం కమిలి ఎర్రగా వుంది.

ఊరు బిక్కచచ్చిపోయింది.

"ఇంతకు మించి మరోమార్గం లేదు

రాజుగారూ! గుడి బద్దలు కొట్టించాల్సిందే! సరిగ్గా గుడి వున్న చోట నీటిపొర వుంది. ఖచ్చితంగా నీళ్ళు పడ్తాయి. అవి మీ వూరికి సమృద్ధిగా సరిపోతుంది. బాగా ఆలోచించండి" అన్నారు ఆ వచ్చిన ఇద్దరూ.

"మరోమారు తమరు పరీక్షలుచేయండి. మరోసోట ఏదేనా అవకాశం వుంటదేమో!" రాజుగారు ఇబ్బందిగా అన్నారు.

"ఊరంతా పరీక్షలు చేసేంగదా.... ఇక్కడ తప్ప మరోచోట నీటి ఛాయలేదు. ఆ తర్వాత మీ ఇష్టం."

"కానీ దేవలం బద్దలు గొట్టటం అంటే మాటలా?! వూరు పుట్టక ముందునుంచి వుందీ దేవాలయం. వూరందరికీ దేవుడు.. అదీగాక కచ్చితంగా నీళ్లొత్తాయని తమరు సెప్పలేక పోతున్నారు గదా!"

"అది నిజమే..! అంత ఖచ్చితంగా ఎవరూచెప్పలేరు. మా పరీక్షల వల్ల తేలింది అదీ.మేం రెసిస్టివిటీ బట్టి చెప్పగల్గేది అంత వరకే. అసలు నీటిఛాయ మరోచోట లేదు కాబట్టి ఖచ్చితంగా నీళ్ళు పడొచ్చు. ప్రస్తుత పరిస్థితుల్లో గుడి బద్దలుకొట్టడమే శరణ్యం. అయినా పాత దేవాలయం బద్దలు కొడ్తే మాత్రం ఏమండి? అసలు మనం అంటూ వుంటే కదండి దేవుడ్ని కొలిచేది. మరో చోట కట్టుకోవచ్చుగదా దేవాలయం!"

"అంత మాట అనకండి ఇప్పటికే ఆయనకు చేసిన అపచారాలకు వూరికి అరిష్టం దాపురించింది. ఇపుడు ఈ పని కూడా జరిగితే వూరు సర్వనాశనం కావడం తథ్యం.

అయ్యా! మరో మార్గం అంటూ లేదా?" అన్నారు పూజారిగారు.

"లేదు. మీకు దేవుడే ముఖ్యం కాబట్టి ఆయన్నే ప్రార్థించండి, పస్తాం" జీపెక్కబోతూ చెప్పేడు ఇంజనీర్లు.

రాజుగారు జేబులోంచి డబ్బుతీసి ఇచ్చేరు. జీపు కదిలింది. రాజుగారు మాత్రం రోడ్డు మీద సడెన్‌గా వెలిసిన విగ్రహంలా వుండిపోయేరు.

అక్కడున్న అందరూ మూగ వాళ్ళయ్యేరు.

ముఖ్యమంత్రి పదవికి ఎరవేస్తే కమిటీ మెంబరు పదవి దొరికినట్లయింది మునసబు, కరణాలకి.

'మనం తచ్చణం ఏటి సెయ్యాలి?' అని ఎవ్వరూ అడగలేదు. కానీ అందరి ఆలోచనా మాత్రం అదే!

రాజుగారికి ఎలక్షన్ల తేదీ గుర్తుకు రాగానే వున్న కాస్త వూపిరి గాల్లోకల్సింది. సెంద్రరావ్ నాయుడు వెకిలిగా నవ్వుతూ లీలగా మెదిలేడు.

దేవుడి ఆత్మతృప్తి కోసం మనుషుల్ని బలిస్తున్న పవిత్ర భారతదేశంలో ఒక దేవాలయం బద్దలు కొట్టడానికి ప్రజలు ఆమోద ముద్ర వేస్తారా? ఒకవేళ ఆ దేవుడే వచ్చి ఆ పని చేసినా క్షమిస్తారా?

రాజుగారికి లోకం రీతి తెల్సు. ప్రజల నాడి తెల్సు. వాళ్ళ మనసు తెల్సు. వాళ్ళ భక్తి బాగా తెల్సు. అందుకే ఆయన నిర్ణయం తీసుకోవటంలో ధైర్యం చెయ్య లేదు.

ఈ సమస్యను ఎలా పరిష్కరించాలి? తన పదవి ఎలా నిలబెట్టుకోవాలి ? పది కాలాలపాటు పదవి కడుపులో చల్ల కదలకుండా సుఖంగా వుండాలంటే ఏది చేసేనా నీళ్లు తెప్పించాలి. ప్రభుత్వానికి అర్జీ పెట్టి నీటి సరఫరా ఏర్పాట్లు చేద్దామంటే అవన్నీ కార్యరూపం దాల్చేసరికి వాళ్ళిచ్చే నీళ్ళతో సమాధులమీద పూల మొక్కలు పెంచొచ్చు.

రాజుగారు దేవాలయంలోకి వెళ్ళేరు. అనుసరించేరు అందరూ.

చాలాకాలం తర్వాత గుళ్ళో కాలు పెట్టిన రాజుగారు దేవాలయం స్థితి గతులు చూడంగానే కనుపించని బాధ వెల్లువలా పెల్లుబికింది. అక్కడ నివసిస్తున్న కుటుంబాల్ని చూడంగానే అది అనాథ శరణాలయమో, జిల్లాపరిషత్తు స్కూలో అర్థంకాలేదు. స్తంభం దగ్గర చతికిల పడ్డారు నీరసంగా. కరణం, మునసబులు, కొంచెం ఎడంగా పూజారిగారు, దూరంగా మరికొందరు మెల్లగా ఆసీనులయ్యేరు.

బాంబురాజు వూళ్ళోకి పరిగెట్టేడు.

"అయ్యా! దేవాలయం బద్దలుకొట్టే ఆలోచన మాత్రం చెయ్యకండి. ఇప్పటికి స్వామికి చేసింది చాలు. ఒక్కసారి దేవాలయం చూడండి. పాడుపడ్డ ఇల్లులా వుందే తప్ప భగవంతుడి మందిరంలా అసలులేదు. కొన్నేళ్ళుగా స్వామిని మర్చిపోయేం. ఇప్పటికీ మించిపోయింది లేదు. కుంభాభిషేకం చేయిస్తే నీళ్లు తప్పకుండా వస్తాయి. తక్షణం ఆ కార్యం జరిపించండి" పూజారి ఆవేదన.

"ఏటి పంతులుగారూ! మాకుమాత్రం తెల్దా? దేవుడంటే భక్తి నేదా? తోటి మనుసులు సత్తావుంటే వూరుకోలేంగా?! ఏటి సెయ్యాలో అర్ధంకాక సత్తున్నాం" మునసబుగారు చిరాకుపడ్డారు.

"నీళ్ళు నేకపోతే పర్వానేదు. దేవుడి గుడి మాత్రం కూల్సిలేం. మన పిల్లలు, పాపలు...వొద్దు బావూ..." అన్నాడో పెద్ద మనిషి.

"ఈ దేవాలయం కాకపోతే మరొకటి కట్టించుకోవచ్చు. ముందు మనుషల సంగతి చూడండి. మీరు చూపిస్తున్న భక్తికి దేవుడు మెచ్చివుంటే మరిన్ని కాటకాలెందుకొస్తాయ్? రాజుగారూ! మరో ఆలోచన వద్దు. గుడిని బద్దలుకొట్టించండి. అందరం కృషి చేద్దాం. నీళ్ళొస్తాయ్" ఆవేశంగా అన్న అతగాణ్ణి అక్కడున్న అందరూ పురుగును చూసినట్లు చూసేరు.

ఏ దారి తోచని రాజుగారికి బుర్ర మొద్దుబారింది.

దేవుడు ముఖ్యమా? పదవి ముఖ్యమా? రాజుగారి త్రాసు మొహమాట పడకుండా పదవి వైపే మొగ్గింది. ప్రజల అభిమతం మాత్రం దేవుడివైపు మొగ్గింది.

ఏ నాయకుడికీ ఎన్నికల ముందు ఇంత విషమ పరీక్ష వచ్చి వుండదు. అందుకే రాజుగారి గుండె రెపరెపలాడింది. అక్కడున్న జనం చర్చలు చెవుల్లో గింగురుమన్నాయి.

"ఏం చేద్దాం అంటారు?" కరణంగారు సూటిగా అడిగేరు.

"అంత తొందరగా తేల్చే ఇసయం కాదుగా! మిగతావోళ్ల అభిప్రాయాలు కూడా తీసుకొని ఆనక ఓ ఇదానం మీద కొద్దారి" అంటూ లేచేరు రాజుగారు.

గౌరవ సూచకంగా అందరూ లేచి నిల్చున్నారు. విషయం తేల్చకుండా వెళ్ళిపోతున్న రాజుగార్ని చూసి అంతో ఇంతో ఆశ్చర్యపోయేరు.

శవదహనం అయ్యాంతర్వాత శ్మశానం నుంచి తిరిగి వెళ్ళే వాళ్ళలా రాజుగారితో పాటు అందరూ మౌనంగా అడుగు విదిల్చేరు.

అప్పటికే రోడ్లమీద గుంపులు గుంపులుగా జనం చర్చల్లో మునిగిపోయేరు. బజారులో గుసగుసలు రాజుగారి చెవుల్లో

చూపుతున్నాయి. రాజుగారి అడుగులు భారంగా పడుతున్నాయి.



**బాం**బురాజు చెప్పింది వినగానే నోట మాట రాలేదు.

బాంబురాజు జియాలజిస్టులు చెప్పిన వన్నీ మళ్ళీ మరోమారు నాయుడుగారికి విన్పించేడుగానీ అతని మాటలను విన్పించు కునే పరిస్థితిలో లేరు నాయుడుగారు.

నిదానంగా కుర్చీలో కూలబడ్డారు.

నాయుడుగారు చలన రహితంగా వుండడం చూసి బాంబురాజుకి మతి పోయింది. ఎలా ఆయన్ను మళ్ళీ ఈ లోకంలోకి తేవాలో తెలీక క్షణం తికమక పడ్డాడు.

"నాను రేపు హయిదరాబాదు ఎల్లాలను కొంటున్నాను" అన్నాడు చాలా సేపు మౌనం తర్వాత.

'ఎల్లు...' అన్నట్టు ఓ చూపు బాంబురాజు మీద పారేసేరు.

"రాజుగారు ఎల్క్ట్రి దీపాల బండి మాట్టాడమన్నారు."

"ఎందుకేటి?!"

"అదేటి బావూ! ఆ బండి మీద రికార్డింగు డాన్సు పార్టీ పెడితే మరి జనం గుమ్మెత్తిపోరా?"

"నాను మాత్రం ఎట్టించనా? ఇలాంటియి ఆడికన్నా గొప్పగా సేసే గల్ను.మన తడాకా ఆడింకా సూడ్నేదు. సిన్న డోసుకి బెంబేలెత్తిపోనాడు. ఇక ముందు సూడు ఎలాగుంటదో!"

"మీ సురుకుతనం ఆరికి రమ్మంటే మాత్తరం వత్తదేటి... మీరు మరోనా అనుకోకుంటే..." నసిగేడు.

"ఏటది?!"

"అల్లా మద్దిన నాలుగైదు సినేమాల్లో దేన్సులు కట్టి సుకం నేదని యాపారంలో దిగింది నాకు తెల్సింది ఒకతి. సూడ్డానికి బొమ్మనాగుంతాది. అది గజ్జె కట్టిందంటే మరి జనం మర్చిపోరు. దానాట మనూర్లో ఎట్టిద్దారని... అందులో సినిమా సరు కూడా బావూ. జెనం పిచ్చెత్తిపోతారు. ఈ మద్దిన అయిదరాబాదులో మకాం ఎట్టేసింది. నా మాటంటే మరి సేనా ఇల విస్తది."

"కర్సెంతవుద్దేం?" తాపీగా అన్నారు.

"ఆ ఇసయాలు నా కొగ్గేయండి. నానెటూ హయిదరాబాదు ఎల్తున్నాగా!"

"ఆలీసెం జరక్కూడదు. ఈలోపల పెసేరం సేయిత్తాను. సూడు నెక్క గురించి కాదుగాని ఈడ న్యాలోజులుండే ఏర్పాటు సెయ్యి."

"తమరు సెప్పాలేటండి"

జేబులోంచి వందల కట్ట తీసి అందు లోంచి రెండు కాగితాలు బాంబురాజు చేతిలో పెట్టేరు నాయుడుగారు.

బాంబురాజు వినయంగా అందు కొన్నాడు. వచ్చిన పని సవ్యంగా జరిగి నందుకు తృప్తిగా ఫీలయ్యేడు.

"పెజలు గుడి కూలగొట్టనీకి వొప్పు కోటం నేదు. మీరు తొందరపడి నీల్లు కావాలని అరిత్తే రాజుగారు గెలవటం ఖాయం. జాగర్తగుంటే మీకు ధోకా వుండదు. నాను రేపెల్లి రెండ్రోజుల్లో

వచ్చేత్తాను."

బాంబురాజు జేబులో నోట్లని భద్రంగా పెట్టుకుంటూ బయటపడ్డాడు.

వెనక అంబోతు తరుముకొస్తుంటే ఒగురుస్తూ పరిగెడ్తున్న వాళ్ళలా దూసుకొచ్చేరు లింగం, సూరి.

వచ్చిన ఇద్దరూ పేకాట్లో పెళ్ళాలని తాకట్టు పెట్టుకొన్న వాళ్ళలా మౌనంగా కూర్చున్నారు. నిశ్శబ్దంగా పొగాకు కట్టల్ని విప్పి చుట్టలు చుట్టడంలో నిమగ్నమైనారు.

వాళ్ళిద్దర్ని చూస్తుంటే పార్టీ మారబోయే వాళ్ళలా వున్నారు.

గుడిని కూలదోసి అక్కడ బావి తవ్వడానికి ప్రజలు సుముఖంగా లేరు. అందుక్కారణం దేవుడి మీదున్న భక్తి. ఏ విషయంలోనైనా ఏకీభవించరేమోగాని దేవుడనే సరికి అందరూ ఒకటైపోతారు.

'దేవుడి కన్నా మనుషులకి నీళ్ళు ముఖ్యం' అని తానుగా పట్టుబడితే ఓడిపోవడం ఖాయం.

పోనీ గుడి బద్దలు కొట్టించొద్దని రంగంలోకి దిగితే?!

'మీ అందరూ ఎలాగసెప్తే అలాగే సేత్తాను. పెజలకన్నా నాకెవలూ ముఖ్యం కాదు' అని రాజు జనంలోకి పోతే? ప్రజలంతా రాజు వైపు చేరిపోవడం నిజం.

అసలు ఎన్నికల్లో పెజలు ఓటు సెయ్యకుండా వుండే ఏర్పాటు సేత్తే బాగుణ్ను! ఎవల్నైనా అర్థం సేసుకోవచ్చుగాని ఈ సిల్లర నాకొడుకుల్ని తెల్సుకోవడం సేనా కట్టం. ఏ చెణంలో ఎటు జై అంటారో అర్థం సేసుకోవటం పరమ నూసెన్సు. ముద్దర గుద్దేదాకా నమ్మకం ఏడవదు. సీ..సీ..!

ఎన్ని అనుకొన్నా నాయుడుగారికి



మాత్రం సవ్యమైన మార్గం దొరకలేదు. తను ప్రజల సమక్షంలో చేసిన వాగ్దానం ప్రకారం నిరాహార దీక్ష చెయ్యాలా? చేస్తే ఫలితం ఏమిటి?

"మీరు ఇనే వుంటారు..." సూరి మాట మెల్లిగా కదిపేడు.

"దాని గురించే ఆలోసిత్తున్నాను'' చుట్ట వెలిగిస్తూ అన్నారు.

"వూరంతా అట్టుడికి పోతాంది..."

"మనవేటి సెయ్యాల?"

''నన్నడిగితే నీల్ల వూసెత్తకుండా మన పెసేరం మనం సేసుకోవటం మంచిది. ఎటుతిరిగి జనం నీళ్ల గురించి అడిగేది రాజుగాడ్నే కాబట్టి మనం ఆలోసింసాల్సిన అవుసరం నేదు..." లింగం కల్పించుకున్నాడు.

"అద్సరే. వూరు సంగతేటి ?'' నాయుడుగారు కల్పించుకొన్నారు.

"ఏటుంది బావూ ... గోల్లనిండా పేర్లు రాయించినాం. కన్పించినోడి కల్లా రాజుగారి దుర్మార్గం గురించి పెచారం సేత్తూనే వున్నాం..."

"పాపం పంతులుగారు గుడి గురించి అన్నిసోట్ల ఒక్కడే తిరిగి పెచారం సేసుకొంటున్నాడు. ఆరిమాట మాత్తరం కాదన్లేరండి జెనం. మరేటి సెప్తాడోగాని సెవులిచ్చి ఇనేతారు..."

"ఏటి సెప్తున్నాడు?"

"దేవలం గురించే... అదిగాని కూల గొడ్తే వూర్లో జెనం రోగాలొచ్చి సత్తారని అలాటియన్నీ సెప్తున్నారు"-లింగం.

"సూరీ! ముందు పట్నం బోయి రికార్డింగ్ డేన్సులోల్లని అట్టుకొచ్చి అన్నిసోట్లా ప్రోగ్రాములెట్టించు. ఈనోపట బాంబురాజుగాడు అయిదరాబాదునుంచి సినిమాదాన్ని తీసుకొత్తాడు... దాంతో జెనం మతి సెడిపోవాల. అడిగినోల్లందరికీ సుక్క సారా పోయించండి. మల్లా నాల్రోజులు పోనాక నీల్లగురించి పెచారం సేద్దాం"

"అట్టాగే బాబూ! సేతిలో నెక్కతక్కువగా వుంది..."నసిగేడు సూరి.

వెంటనే అందించేరు నాయుడుగారు.

"సూడు! నేనోసారి రమ్మనమన్నానని ఆ పంతులుకి సెప్పు"

"ఆలాగేనండి..."

"మన ఎదవల్ని జేగర్తగా వుండమని సెప్పండి."

"అయ.."

"పన్లన్నీ సెకసెకా జరిగిపోవాల.. ఇక ఎల్లండి."

వెళ్ళేరు ఇద్దరూ!.

నాయుడుగారు ఆరిన చుట్టను వెలిగించేరు. చెదురుతున్న పొగలా చెరిగిపోయిన ఆలోచన్లు మళ్ళీ నాయుడుగార్ని చుట్టుముట్టేయి.

అధికారం చేజిక్కించుకోవాలంటే ఎన్ని ఎదురు దెబ్బలు తినాలో అప్పుడుగాని నాయుడుగారికి పూర్తిగా అర్థం కాలేదు.

* * *

ఎన్నికలు సరిగ్గా నెల రోజుల్లో పడ్డాయి.

అంతకు ముందెప్పుడూ ఎన్నికల గురించి అంత ముందుగా హడావిడి జరగలేదు. వారం రోజులుందనగా రికార్డింగు డేన్సులు, వీధికో మీటింగు పెట్టి హోరెత్తించేసి అందరికీ మందు కొట్టించేసి పాదయాత్రలు, పలకరింపు కార్యక్రమాలు నడిపి గెలిచెయ్యడం పరిపాటి.

ఈసారి చాలా ముందుగానే

ఎన్నికల హైరాణ పడిపోవడానికికారణం నాయుడు – రాజుగారు చీలిపోవడం. అన్నిటికీ మించి కరువు కాటకాలు, ఇంత భయంకరమైన నీటిఎద్దడి మున్నెన్నడూ రాకపోవడం.

ఎన్నికలు గనక రాకపోయుంటే ప్రజలకి నీళ్ళుకావాలని అడిగే దమ్ము వుండేది కాదు. వాళ్ళిపుడు కించిత్ మొహమాటం లేకుండా నాయకుడు అన్నవాడినల్లా నిలేసి నీళ్ళ గురించి కడిగేస్తున్నారు. ఎన్నిరకాలుగా చెప్పినా నాయకుల మాయ మాటలకు లొంగి పోలేదు.

ఎక్కడెక్కడినుంచో కడివెడు నీళ్లు మోసుకొచ్చుకొని ప్రాణాలు నిలబెట్టు కొంటున్నారు. ఇదే అదననుకొన్న వాళ్ళు రేటుపెట్టి అమ్ముకుంటున్నారు. ఎండ తాపానికి తట్టుకోలేని ముసలి ముతక వంతులవారీగా రాలిపోతున్నారు.

రోజురోజుకీ వూరు పరిస్థితి మరీ క్షీణించిపోతోంది.

రాజుగారు కలెక్టరాఫీసుకుపోయి ఎన్ని రకాలుగా ప్రయత్నించినా పట్టించు కొన్న నాథుడులేడు. తనుగా స్వయంగా ఏమీ చెయ్యలేరు. చేస్తానని ప్రజల్ని మభ్యపెట్టడం చాలా కష్టం.

మంచిచేసినా, చెడుచేసినా ప్రచారం ముఖ్యం. ఆయన పడ్తున్న శ్రమకి ప్రచారం జరిగినా ఫలితం లేకపోవడంతో ప్రజలకి రాజుగారి మీదున్న నమ్మకం సడలింది.

అవకాశాల్ని జారవిడుచుకోకుండా నాయుడు చేస్తున్న హడావిడి రాజుగారికి సవాలయింది.

సెంద్రరావ్ నాయుడు గోడలనిండా పేర్లు రాయించేసేడు. సందుల్లో మీటింగులు పెడ్తున్నాడు. ప్రతి సభలోనూ నీళ్ళ సమస్యను హైలెట్ చేస్తున్నాడు. దాంతోపాటు చింతల్లి చావుకి కారణాలు వగైరాదులతో వూదర గొట్టడంతో ప్రజలు అంతో ఇంతో నమ్మారు.

రాజుగారు ఈ తాటాకు చప్పుళ్ళకి అంతగా బెదిరిపోలేదుగానీ ఏ పథకంతో జనాన్ని తనవైపు తిప్పుకోవాలో, ఎక్కడ దెబ్బకొడ్తే నాయుడు పార్టీ ఎన్నికల జోలికి రాకుండా పోతుందో మాత్రం తెలీలేదు.

నీళ్లు కావాలంటే మాత్రం గుడిబద్దలు కొట్టించక తప్పదు. అంతకు మించి త్వరగా ప్రజల అవసరాలకి సరిపడ్డ నీళ్లు తేవడానికి మరోమార్గం లేదు. హైద్రాబాదు నుంచి వచ్చిన వాళ్ళేకాక విశాఖపట్టణం నుంచి పిలిపించిన వాళ్ళు కూడా అదేమాట చెప్పడంతో రాజుగారి గుండెలో రాయి పడింది. దేవాలయం తొలగించి నీళ్ళు తెప్పించడానికి ఎవ్వరూ సుముఖంగా లేరు. ప్రజలు కాదనే ఏ పనీ ప్రస్తుత పరిస్థితుల్లో మంచిది కాదు.

"ఈ సమయంలో అధికారంలో లేకుండా వుంటే ఎంత బాగుండిపోయేది" అని రాజుగారు మనసులో చాలాసార్లు అనుకొన్నారు.

దూరంగా ట్యూబ్‌లైట్ల కాంతి వెన్నెల పొదలా కన్పిస్తోంది.

మైకుల హోరుకి చెవులు బద్దలై పోతున్నాయి.

సినిమా పాటలు, జనం ఈలలు సమ్మెట పోటుల్లా వున్నాయి రాజుగారికి.

మసక వెన్నెల్లో మందు కొడ్తున్న మునసబు, కరణం వార్డుమెంబర్లుగా నుల్చున్న మరో ఇద్దరూ గ్లాసులు చేతిలో

పట్టుకొని జూదంలో సర్వం వొడ్డి ఓడి పోయిన ధర్మరాజుని చూస్తున్న పాండ వుల్లా చూస్తున్నారు రాజుగారికేసి.

ఎవ్వరికీ ఏం మాట్లాడాలో తెలీడం లేదు.

ఎన్ని పెగ్గులు కొట్టినా సెంద్రరావు నాయుడు గుర్తుకు రాకుండా మాత్రం మానటం లేదు.

ఇంతలో...

జ్ఞానబోధ జరిగిన బుద్ధుడిలా, అర్జీ పెట్టుకోగానే రేషనుకార్డు వచ్చిన వాడిలా, క్యూ లేకుండా కిరసనాయిలు దొరికిన వాడిలా రాజుగారు ఆనందంగా ఓ నవ్వు నవ్వేరు. అది మబ్బుల్ని చీల్చే వురుములా అక్కడ ప్రతిధ్వనించింది.

హాయిగా వచ్చి కుర్చీలో ఆసీనులై నారు.

ఈసారి పెగ్గు మంచినీళ్ళలా ఒకే గుటకలో గుటుక్కుమనిపించేరు.

మిగతా వారికి విషయం అర్థం కాక పోయినా వంతగా వెంటనే నవ్వేరు.

''ఇక మనకేటీ బయం నేదు" అన్నారు రాజుగారు.

"ఇసయం ఏటో సెప్పేనారుగాదు'' ఆతృత అణుచుకోలేని సుబ్బారావు అడిగేడు.

"సెప్తాను. మనం సీకు సింతా నేకుండా గెలవటం కాయం. రేపొద్దుగాల మన పేర్లు గోడలమీద రాయించండి. అంతకు మించి పెచారం వద్దు. ఆకరి మూర్డోజులు గుమ్మెత్తి పోయేలా పెచారం సేద్దాం. పెజలకి సీల్లోత్తాయి."

"బాంబురాజు వూల్లో వున్నాడా?" సడెన్‌గా అడిగేరు రాజుగారు.

"లేకేమండి. ఛార్జీల కోసం లాటరీలు కొడుతున్నాడు" - కరణం.

"నువ్వర్జెంటుగా ఎల్లి అడ్నట్టుకురా''

"ఆడు నాయుడుతో గూడా తిరిగేత్తున్నాడండీ! అడ్నిగాని నమ్ముకుంతే మన ఇసయాలు తెల్లారేసరికల్లా వూల్లో నానాయి" కాబోయే మెంబరుగారు అన్నారు.

"ఎంత సెడ్డా ఆడు మా కులపోడు ఆ మాత్తరం నాకు తెల్దా! మన గురించి సెడు పెచారం సెత్తే మరి అయిదరా బాదులోనే పూడిపించేత్తాను. నాకొగ్గేయండి. ముందు వర్జెంటుగా ఆడ్ని నాక్కూరండి"

అదే తక్షణ కర్తవ్యం అన్నట్లు ఆఖరి పెగ్గు పీకి బయటపడ్డారు శిష్యులు. రాజుగారికి ఆ చీకటి చీకటిలా కన్పించలేదు.

* * *

చీకటి చీర జారి ఆకాశం బయట పడింది.

మాదిగవాడలో పాకల ముందున్న మంచాల్లో ముసలివాళ్ళు చుట్టలు కాలుస్తున్న వేదాంతుల్లా వున్నారు. గుడ్డఉయ్యాల్లో గుంటలు రాగయుక్తంగా శోకాలు తీస్తున్నారు. పొయ్యిల్లో కట్టెలు ఆకల్లా మండుతున్నాయి.

చింకి చీరలు హడావిడి పడుతున్నాయి.

వీధికుక్కలకు స్వాతంత్ర్యం వచ్చింది. పాకెక్కిన పిల్లులు పాలముంతల వేటలో సీరియస్‌గా వున్నాయి.

చిన్ని సందులో ముందు మురికి నీళ్ళ కడలికి ఎదురుగా వున్న పాక సైదుల్ది. అతగాడు చాలా సామాన్యుడు. కోరికలు లేని మనిషి. అతగాడి గురించి ఎవ్వరూ పట్టించుకోరు.

సదరు సైదులు ఆసమయంలో పాకలో వేసిన కేకకి చుట్టుపక్కల జనం హడలి పోయేరు.

కేకతో పాటు ఈదర గాలిలా పాక లోంచి బయట కొచ్చేడు.

కళ్ళు పెద్దవయ్యేయి. గట్టిగా ఘీంక రిస్తున్నాడు.

నూనె మొహం చూడని వుంగరాల తాటి పీచు జుట్టు పెరిగిపోయి మెడ మీద తలకాయ వుందా, కేవలం జుట్టు మాత్ర మేనా అన్న అనుమానం కలిగించేలా వుంది. ఎండిన డొక్కలు ఎగసిపడ్తూ ఆవేశంలో వూగిపోతున్నాడు

అతగాడ్ని చూసిన చుట్టూ చేరిన ఆ డంగులు బుగ్గలు నొక్కుకుంటూ" మతి గాని బెమిసిందేటో!" అని గట్టిగా అను కొన్నారు.

"సైదులూ! ఓరయ్యా నీకేటయిందిరా?" దగ్గర కొస్తూ అడిగేడు ఓ వృద్ధుడు.

పులిలా గాండ్రించేడు సైదులు.

ఆ అరుపుకి ఓ మోస్తరు ముసలాళ్ళకి గుండె ఆగినంత పనైంది.

"నన్ను గుర్తించలేదురా మూర్ఖులారా! ఒరేయ్..నన్ను చూడండ్రా.!!"– వూగి పోతూ, గెంతుతూ అన్నాడు సైదులు.

అందరూ ఒకేమారు ఆశ్చర్యపోయేరు. దాంతో కొందరి మెదళ్ళు చురుగ్గా పన్జే సేయి.

"నేన్రా! నన్ను గుర్తించలేదా"– మళ్ళీ గాండ్రించేడు సైదులు.

తమ అనుమానం నిజం అని నిర్ధారణ కొచ్చేరు.

"స్వామీ! అపరాదం కాసెయ్యి.. తమరెవలు సామీ!?"–అని అడిగేరు.

"చూడండ్రా! నేన్రా..!!"

"దేవుడుకమ్మేసాడు."అని అందరూ చెంపలేసుకొని దండాలు పెట్టేరు.

"నేన్రా శివుణ్ణి!" సైదులు గిరగిరా తిరిగి పోతున్నాడు.

సాష్టాంగ పడి దండాలు పెట్టేరు. కొందరు పెద్దల కోసం పరిగెట్టేరు. షణంలో మాదిగవాడంతా పోటెత్తింది. సైదులు మీదకి దేవుడొచ్చేడని వున్న పాటున జనం పరుగులెత్తేరు.

"సామీ! అపరాదం కాసెయ్యి. ఏటి సెయ్యమని తమరి సెలవ?"

"నాగుడిని అశుభ్రంగా వుంచుతార్రా! అపవిత్రం చేస్తార్రా?"

"తెలిసి మావేటీ సెయ్యనేదు బాపూ. తప్పుకాయండి. ఇప్పుడేటి సెలవ?!"

"నాకు కొత్త దేవాలయం కట్టించండి. అభిషేకం చేయించండి!"

"సేయిత్తాం బావూ! మాతప్పులు కాసే యండి సామీ!" మూకుమ్మడిగా భయంతో పాటు భక్తిని ప్రదర్శించేరు.

సైదులు వుగ్ర నరసింహ మూర్తిలా చిందులేస్తున్నాడు.

మధ్య మధ్యలో అరుస్తున్నాడు.

"ఇన్నాళ్లు అందరూ నన్ను నిర్లక్ష్యం చేసేరు. అందుకే నీటిచుక్క కూడా లేకుండా చేసేను. ఇప్పటికేనా తెల్సిందా నేనంటే ఏవిటో?"

ఆ మాటలకి జనం గజగజా వణికి పోయేరు.

మరోసారి పగిలేలా చెంపలేసుకు న్నారు. గుంజిళ్ళు తీసేరు.

"ఒరేయ్! నేనింక ఆ గుడిలో ఉండను. నాకు కొత్త దేవాలయం కావాలి. పషం రోజుల్లో ఆ పని జరక్కపోతే మీరంతా సర్వనాశనం అయిపోతార్రా"

"అలగే సామీ! తమరి మాట తీరుత్తాం. మా పేణాలు పోయినా పర్వానేదు. మమల్ని సల్లంగ సూడు సామీ!" ప్రతిమాలేరు.

అప్పటికే పెద్దలు జరగాల్సిన తంతు మొదలు పెట్టేరు.

హారతి కర్పూరం అగరు వొత్తుల కట్ట పట్టుకొచ్చేరు.

సైదులు చేతిలో కర్పూరం వెలిగించేరు. భగ్గున మండుతోంది అది.

"వెళ్ళండి. పెద్దలందర్నీ కదలించండి. నాకు దేవాలయం కావాలి. వీడు నా భక్తుడ్రా. అందుకే వీడి మీదకొచ్చేను" అంటూ శాంతించేడు సైదులు.

కర్పూరం ఆరిపోయింది.

మరోసారి అందరూ మోకరిల్లేరు.

హుటాహుటీగా కరణం, మునసబు, పూజారిగారు, లింగం,సూరి మరో ఇద్దరు ముగ్గురు చిన్న సైజు పెద్దలు పరిగెత్తుకొచ్చేరు.

శివతాండవం తర్వాత నీరసపడ్డ శివుడిలా, తోటకూర కాడలా నిస్సత్తువగా నిల్చుండిపోయేడు సైదులు.

పూజారిగారు సైదులుకి నమస్కరించేరు. ఆయన ఆ వాడలోకి రావటం అదే మొదటిసారి. చుట్టూ వున్న వాళ్ళు నిజంగా దేవుడొచ్చినట్లు ఫీలయ్యేరు. పూజారిగారికి కొంచెం ఎడంగా నిల్చున్నారు.

కరణంగారు నీళ్లు తెమ్మని ఆజ్ఞాపించేరు.

సైదులు మెల్లిగా తూలి పడబోయేడు. జాగ్రతగా పట్టుకొన్నారు సూరి, లింగం తదితరులు. నులక మంచం వేసేరు. జాగ్రత్తగా పడుకోబెట్టేరు. మొహం మీద నీళ్లు చిలకరించేరు.

క్షణాలు మౌనంగా గడిచేయి.

అందరూ జరిగినదాన్ని వింతగా చెప్పుకొంటున్నారు.

మంచి నిద్రలోంచి గబుక్కున మెలుకువ వచ్చినట్లు కళ్ళు తెరిచేడు సైదులు. చుట్టూ తదేకంగా తన్నే చూస్తున్న వాళ్లను చూసి అయోమయంలో చిక్కుకున్నాడు.

"ఏటయింది?!" తేరుకొని నీరసంగా అడిగేడు.

"నీ మీదకి మనవూరి దేవుడొచ్చేడ్రా!" ఆనందంగా అన్నారు కరణంగారు.

నమ్మబుద్ధి కాలేదు సైదులుకి.

"ఇంత మంది పెద్దోరుండే నా మీదకెందుకొత్తారండీ?" అన్నాడు చుట్టూరా వున్న పెద్దల్ని చూసి.

"నీకు తెల్దునేరా పిచ్చెదవ. సామికి సిన్న పెద్దా తేడాలుండవ్! కితం జలమలో పున్నెం సేసుంతావ్. నీ మీద కొచ్చేసినాడు" – ఓ వృద్ధుడు విశదపర్చేడు.

మరి మాట్లాడలేదు సైదులు.

చాలామంది వుపచారాలు చేస్తున్నారు. మెల్లిగా నిద్రలోకి జారుకొన్నాడు సైదులు.

"స్వామి ఏదైనా శెలవిచ్చేరా?" ఆసక్తిగా అడిగేడు పూజారిగారు.

"మీరు సూద్నేదుగాని బావూ....మతిపోనాదండి. ఆ లెక్క నూగిపోనాడు సైదులుగాడు. భూవిగాని బద్దలైపోద్దనిపించిందండి. మా జలమ దన్యమైపోనాదండి మన సావివారి మాట ఇనేసరికి."

"స్వామి ఏం సెలవిచ్చేరో చెప్పరా అంటే ఇదంతా ఏట్రా?" కరణంగారు కనబడని చిరాకు ప్రదర్శించేరు

"మనూరి దేవాలయం సామికి నచ్చనేదటండి. మరో కొత్త దేవళం కట్టించమన్నారండి. అలాగ్గాని సెయ్యకపోతే మనమంతా నాశనం అయిపోతామని సెప్పేరండి!"

"ఎక్కడ కట్టాలో చెప్పేరా

నాయనా?"

"మావు అదడగనేదు బావూ! పిచ్చె దవలం."

"మీరెంత అదృష్టవంతుల్రాలా. ప్రత్యక్షంగా స్వామితో మాట్లాడే యోగం కలిగింది" తను చూడలేకపోయినందుకు చింతించేరు పూజారిగారు.

'గుడి ఎక్కడ కట్టించాలి? స్వామికి అలాటి అభిప్రాయం ఎందుకొచ్చింది?' అన్న అనుమానాల్తోపాటు జరిగిన అపచారాల లిస్ట్ బయటకు తీసేరు.

కరణం, పూజారిగారు మాత్రం కాసేపు తర్జన భర్జన చేసి రాజుగారింటికి పరిగెట్టేరు.

ఆ వుదంతం వేగంగా వ్యాపించి కాలక్షేపం లేదనుకొన్న వాళ్ళకు కావల్సినంత పని తగిలింది.

రాత్రికి రాత్రే మాదిగవాడ నిర్ణయానికొచ్చింది. ఎట్టి పరిస్థితుల్లోనూ దేవుడి కోరిక తీర్చాలని. ఆ రాత్రి మాదిగవాడ కునుకెయ్యలేదు.

* * *

"ఇది రాజుగాడి మాయ కాదుగదా?"

"నేదు నాయుడుగారూ! నిజవేనని పిస్తోంది. ఎంసేతంటే అది మన కంచుకోట గదా! అల్లా సైదులుగోడు వుసారైనోడుగాదు. కనీసరం ఆడు రాజు మొకం గూడా సూసుండడు" లింగం అన్నాడు.

"నాకూ సిన్న అనుమానం నేకపోనేదు"–సూరి.

"ఎందుకేనా మంచిది ఆడి మీదో సూపు ఏసుంచి రాజు ఏటి సేద్దారనుకొంటున్నాడో కుసింత ఆరాలు తియ్యండి." నాయుడుగారు హెచ్చరించేరు.

"దానెవ్వారం నాను సూసుకుంతానెండి" లింగం.

"ఆలీసెం సెయ్యకు.ఇలాటియి సిన్న పని వొగ్గేత్తే మనం ఎత్తేసే నోపటే ఆడు ఎదురుదెబ్బ కొట్టేత్తాడు. అనకసావాలి."

రేపోపాలి మనం మాలపల్లి ఎల్లటం మంచిదేమో!" సూరి.

"ఎల్దారి. నెలరోజుల టయం వుంది గదా. పాదయాత్రలు సేద్దాం. పెచేరం జాగర్తగా సెయ్యండి. నాను రేపు పట్నం బోయొత్తాను. బాంబురాజుగాడు ఏవైపోనాడో కనుక్కో..నంజికొడుకు సినేమా దాన్ని తెత్తానన్నాడు. పత్తానేదు" — నాయుడుగారు.




ఆ వుదయం సూర్యుడు ఆకాశంలోకి వచ్చినా మబ్బుతునకని తొలగించుకోలేదు. అందుకే ఎండ వూరి మీద పడలేదు.

వెల్తురు మాత్రం పరుచుకొంది.

ఆ వుదయం చల్లగా ఉన్నా వూరు మాత్రం ఎండకు మాడిపోయిన చేపలా వుంది.

ఎండిన చెట్టూ చేమా మధ్యనున్న పాకలు సినిమా సెట్టింగుల్లా కన్పిస్తున్నాయి.

గాలి స్తంభించి పోయింది.

నిస్త్రాణంగావున్న వూరు బద్ధకం వదిలించుకునే ప్రయత్నంలో పడింది.



రాజుగారింట్లో పెద్దరేడియో భక్తిరంజని పాడుతోంది.

పట్నం నుంచి వస్తున్న రాజుగారి జీపు గతుకుల్లో వుయ్యాల్లా వూగుతూ 'సేనా ఆలీసెం అయిపోనాది'అనుకుంటూ ఆయాసపడ్తోంది.

వూళ్ళోకి వచ్చేసరికి మబ్బు ముక్క చాటునుంచి లేతకిరణాలు మెల్లిగా బయిట కొచ్చేయి. చల్లగా గాలి కదిలింది. మెల్లగా గతరాత్రి పొగమంచు గాలికి కొట్టుకు పోతున్న తెల్ల టెర్లిన్ చీరలా వూర్నించి కదిలింది.

హోటల్ ముందు బల్లలేస్తున్న అయ్యరు పాలల్లో బల్లి పడ్డట్టు అచ్చెరు వొందేడు. రోడ్డెక్కిన చెంబులు, కుండలు ఆగేయి. పాల కోసం, అవుల కోసం బయల్దేరిన వాళ్ళు అట్లాగే ఆగిపోయేరు.

భక్తాయాసం తీర్చుకొంటున్నట్లు రచ్చబండ దగ్గర జీపు ఆగింది.

అందరి దృష్టి జీపుమీదే.

జీపులోంచి ముందు బాంబురాజు దిగేడు. అతనిపక్కన సినిమా నటి మాత్రం లేదు. రికార్డింగు డేన్సుల అప్సరసలు అంత కన్నా లేరు.

మరి..?

ఆ కాషాయిగుడ్డలు ఏ సబ్బుతో వుతికేరో గాని తళతళా మెరుస్తున్నాయి. కాని ఆ దుస్తుల్లో జీపులో దర్జాగా వున్న నలుగురూ అందంగా లేరు. దొంగలే మారు వేషాలు వేసుకొచ్చినట్లుగా వున్నారు. వాళ్ళ నుదుటి మీది వీభూధి రేఖలు మాత్రం వాళ్ళ భక్తులు సుమీ అని ఎలుగెత్తి చాటుతున్నాయి. వాళ్ళను చూడంగానే మర్డరుచేసి ఏడ్రెస్సుమార్చిన బాపతు అనుకుంటే అది చూసినవారితప్పు కాదు.

ముందు ఆ నలుగురూ కిందకి దిగేరు.

చుట్టూ పరికించి ఇది పూరా, వల్లకాడా అని అనుమానపడ్డట్టున్నారుగానీ ఎవర్నీ అడగలేదు.

జీపులోనే వుండిపోయిన బక్కశాల్తీని చూడంగానే సూర్యుడు అక్కడ వుదయించాడేమిటి చెప్మా అన్పిస్తుంది. ఆయన కేశాలు భుజాలనుతాకుతున్నాయి. ఆయిన శరీరం మాత్రం వెన్నెల పడ్డ బంగారంలా మెరిసిపోతోంది. నుదిటి మీద బొట్టు గడ్డకట్టని రక్తంలా వుంది. ఆయన మెడలోనున్న రుద్రాక్ష మాల వురేసుకున్నా తెగదనిపిస్తుంది.

ఆయన సముద్రంలో స్నానంచేసి బయట కొచ్చిన నిండు సూర్యుడిలా అందంగా వున్నారు. అందంగా వున్న కనుబొమ్మలు - ఎర్రటి పెదాలు చూస్తే అతగాడు తప్పు పుట్టేడేమోననిపిస్తుంది. అడద్దై వుంటే బ్రోకరు లేకుండా లక్షలు సంపాదించే వాడనిపిస్తుంది.

ఆయన కళ్ళు తెరిచి చూడలేదు.

ఆయన్ని చూడంగానే నమస్కరించాలనిపిస్తుంది. అలా అనిపించిన చాలా మంది యాంత్రికంగా నమస్కరించేరు. కాని ఎంత ప్రార్థించినా మొరాలకించని మొండి దేవుడిలా ఆయన కళ్ళు తెరువలేదు.

సూర్యుడు పూర్తిగా బయటకొచ్చేడు. భళ్ళున ఆకాశం నుంచి వూరిమీదకి ఎండ వాలికిపోయింది.

వేపచెట్టు ఆకుల మాటునుంచి జీపు మీద పడ్తున్న ఎండ చుక్కలకి స్వామివారు చలించలేదు.

దూరంగా మేళతాళాలు విన్పించేయి.

కరణం, మునసబులు మేళాల వెనక రాగా, పూజారిగారు ముందు నడుస్తుండగా జనం జీపు వద్దకు వచ్చేరు.

స్వామివారు కళ్ళు తెరచేరు. ఆయన ఎవరివైపు చూడలేదు. శిష్యులు నల్గురూ ఆయనకు దగ్గరగా వచ్చేరు.

మంగళ వాయిద్యాల గోల ఠపీమని ఆగింది.

స్వామివారు చుట్టూరా మూగిన జనంకేసి చూసేరు. నోటికి తాళాలు వేసుకొన్న అందరూ ఆతృతగా, ఆనందంగా ఆయనకేసి చూసేరు. ఓ క్షణం కరిగింతర్వాత చిర్నవ్వు చిందించేరు.

ఆ చిర్నవ్వు వెన్నెల్లా వెల్లివిరిసింది.

పూజారిగారు స్వామివారి పాదాలు కడిగేరు.

ఆ పవిత్ర జలం అందరిమీదా జల్లేరు. వాయిద్యాలు మళ్ళీ గొడవపెట్టడం ఆరంభించేయి.

జీపు పీతలా కదిలింది. వెనక శిష్యులు మౌనంగా అడుగులేస్తున్నారు.

స్వామివారి మెడలో గులాబీ దండ వడలిపోలేదు. పుట్టంగానే మెడలో దండతో పుట్టినట్టున్నారు. జనం జీపును అనుసరించేరు. నడుస్తున్న ఎవ్వరికీ ఆయన గురించి తెలీదు. అయినా అనుసరిస్తున్నారు.

జీపు పూజారిగారింటి ముందు ఆగింది.

అతి సుకుమారంగా స్వామివారు దిగేరు.

జయ జయ ధ్వానాలు మారుమోగేయి.

శాస్త్రిగారు గుళ్ళో దేవుడే తనింట్లోకి వస్తున్నంత సంబరపడ్డారు.

కుర్రకారు శాస్త్రిగారి ఇంటి ప్రహరీ గోడెక్కేరు.

కరణం, మునసబులు లోపలికి వెళ్ళేరు. వుత్తరక్షణం హడావిడిగా

బయటకొచ్చేరు.

బాంబురాజు వాయువేగాల్తో అటు వచ్చేడు.

"బావూ! అల్లా సావులోడు ఎవలు బావూ?"– నిలేసేరు చాలామంది బాంబురాజుని.

'అసలు మీరెత్తింది మానవ జన్మేనా? ఆయనే తెలీదా?' – అన్నట్టు డీలా పడిపోయేడు బాంబురాజు. ఈ ప్రశ్న ఎవరూ విన్లేదుకదా అన్నట్టు కలయజూసేడు.

"ఆరిపేరు భజనానంద బాబా! ఆరికి, దేవుడికి డిఫరెన్సు నేదు..! పెపంచం అంతా ఆయన భక్తులే! అవుసరం అయితే దేవుళ్ళే ఆయనగారికి నమస్కారం ఎడ్తారు. ఆరు గాల్లో సెయ్యూడితే ఈభూది వచ్చేత్తది. ఆరు ముట్టుకుంటే సచ్చేవోడుకూడా నెగిసి కూకుని కార్యం సెయ్యమంతాడు. నువ్వు సత్తావంటే శుభ్రంగా వుండేవాడు గూడా రోగం కమ్మేసి తిన్నగా పైకెలిపోతాడు. పిల్లలు లేనోల్లకి పిల్లలు పుట్టించేరు. తగ్గని రోగాల్ని కూడా సిటంలో మాయం సేసేరు. ఆరు ఇమానాల్లోతప్ప తిరగరు. అలాటి గొప్ప సావులోరు. ఆయన్ని సూడ్డానికి దేశాల నించి దొరలు కూడా పారొత్తారు.."

"ఆరు మనూరెందు కొచ్చినారు బావూ!"– భయంగానే అడిగేడు మరొకడు.

"ఎదవా! నిన్ను అమావస్సెనాడు కని మీయమ్మ పాపం సేసిందిరా! ఆరి పాదం మనూర్లో ఎట్టమని కల్లో దేవుడు కన్పించి సెప్పేడట. ఇక మనూరికి కరువు కాటకాలుండవు. అందరూ బేగెల్లి పూజ టయాంకి పారొచ్చేయండి. ఆలీస్సెం అయిపోనాది. ఎల్లండి" మాటంత వేగంగా పరిగెట్టేడు బాంబురాజు.

ఉదయం ఎనిమిదయ్యేసరికి భజనానంద బాబా గురించి ఆ వూళ్ళో తెలియనివారు లేరంటే మాత్రం అతిశయోక్తి కాదు.

హొయ్యిలో పిల్లల సంగతి, పాలు దొరకని పాపల సంగతికూడా మర్చిపోయేరు. వూళ్ళో అరటిపళ్ళు, కొబ్బరికాయలు మిగలకుండా అమ్ముడుపోయేయి. హడావిడి – గొడవ–గందరగోళం....

పెద్దల ఇళ్ళనుంచి పంకాలు తెచ్చిపెట్టేరు.

స్వాములవారి స్నానపానాదుల కోసం కడవల్తో నీళ్ళుతెచ్చిపెట్టేరు.

శాస్త్రిగారి ఇల్లు ఫల పుష్పాదులతో, అగరొత్తుల పొగతో నిండిపోయింది. ఆ బజారులో ఇసకేస్తే రాలటంలేదు. సినిమా షూటింగు చూస్తున్నట్టు జనం ఇళ్ళమీద, గోడలమీద చేరిపోయేరు. అందరూ భార్యా బిడ్డల్తో సహా దిగిపోయేరు. ఆడవాళ్ళను మాత్రం లోపలికి పోనిస్తున్నారు.

ఆడవాళ్ళు నెమలి పింఛాలతో విసురుతున్నారు.

ధ్యానంలో వున్న బాబాగారు కళ్లు తెరవలేదు.

ఆయన ముందు పువ్వులు, పళ్లు గుట్టలుగా చేరేయి.

శిష్యులు భజన కార్యక్రమంతో సెటిలయ్యేరు.

కీర్తనలతో వూరు భక్తిలో వూగిపోతోంది.

రాజుగారు భార్యాసమేతులై బయల్దే

రేరు.

వాళ్ళిద్దరూ అలా కల్సిరావడం అంత వరకూ ఎవ్వరూ చూడలేదు. రాజుగారికి పట్టు పంచె, పట్టు కండువా తప్ప మరో ఆచ్ఛాదన లేదు.

రాజుగారి రాకతో బాబాగారికి గుర్తింపు మరింత పెరిగింది.

అందరితోపాటు రాజు దంపతులు కూడా ఆసీనులై భజన కార్యక్రమంలో పాలు పంచుకొన్నారు.

స్వామివారు గబుక్కున కళ్లుతెరిచేరు.

వెంటనే నిశ్శబ్దం అల్లుకు పోయింది అక్కడ.

అందరూ చెవులు రిక్కరించి, కళ్ళప్పగించి స్వామివారికేసి చూస్తున్నారు.

బయట పడిగాపులు కాస్తున్న జనానికి లోపలేం జరుగుతోందోనన్న కుతూహలం అధికమైంది. నోరు తెరచి అడుగుదామంటే భయం.అందుక్కారణం అక్కడి ప్రశాంతత.

స్వామివారు ఓ అరటిపండు తీసి ఎవరికో ఇచ్చేరు. గాల్లోంచి చిటికెడు విభూతి తీసి అంతమందిలోనూ ఓ స్త్రీని పిలిచి ఇచ్చేరు. అందుకొన్న ఇద్దరికీ లాటరీ వచ్చినంత మతి పోయింది. వాళ్ళిద్దరి అదృష్టాన్ని చూసి అక్కడున్న మిగతా అందరికీ అసూయ కల్గింది.

బాబావారు పెదవి విప్పలేదు.

మళ్ళీ కళ్లు మూసుకొన్నారు.

గాలి తగలక భక్తులకి చెమట్లు పట్టేయి అయినా ఎవ్వరూ కదల్లేదు. చాలా మంది మనసుల్లో కోరికలు మెరిసేయి. వాటిని బాబావారు తీరుస్తారన్న ఆశ అధికమైంది. తమ బాధలు, కష్టాలు విన్నవించుకోవాలన్న [illegible] విపరీతమైంది.

బాబాగారు రాజుగార్ని దగ్గరకు రమ్మని సౌంజ్ఞ చేసేరు.

రాజుగారి చెవిలో ఏదో చెప్పేరు.

"ఈ పూటకి ఇదే దర్శనం...బాబావారు మళ్లా సాయంత్రం కన్పిస్తారు. ఆరు మనూరి కట్టాలన్నీ ఇని ఎలుపొచ్చేరు. ఇక మనకి ఏ బాదలు నేకుండా షుండేలా సేత్తారు ... అందరూ సాయంత్రం గుడికి ఎలుపు రండి..." అని రాజుగారు సెలవిచ్చేరు.

తర్వాత బాబావారి ప్రసాదం పంచేరు. అందుకొని అందరూ బాబావారికి సాష్టాంగ ప్రణామాలు చేసి వెళ్తున్నారు.

బయట బాంబురాజు క్యూ పద్ధతి పెట్టి అందరికీ దర్శనం ఇప్పిస్తున్నాడు.

దర్శనం దొరకని సూర్యుడు ఆకాశంలో మండిపడుతున్నాడు.

గాలి సెగలు కొడ్తోంది.

బాబావారి మహత్యాల్ని చెప్పుకుంటూ జనం ఇళ్ళదారి పట్టేరు.

• • •

చెరిగిన కుంకుమబొట్టులా వుంది ఆకాశం ఆ సాయంత్రం. పగలల్లా కాలిపోయిన ఆకాశం అక్కడక్కడ వెండి బూడిదలా వుంది. తిరనాళ్ళలో తప్పిపోయిన పాపడిలా సూర్యుడు ఏ దిక్కుకు తప్పిపోయేడో తెలీటం లేదు.

భజనానందబాబా గురించి అందరూ తలో కథా విన్నారు. చెప్పేవాడికి వినేవాడు లోకువ కాబట్టి స్వంతంగా కల్పించికొన్ని గాథలువిన్పించేరు. అంతటి మహాపురుషుణ్ని ఆ మారుమూల పల్లెకు తీసుకొచ్చిన ఖ్యాతి మాత్రం రాజుగారికి దక్కింది.

ఆయన వర్చస్సుని, మేధస్సుని, మహిమల్ని ఒకళ్లిద్దరితో పూజారి పంతులుగారు చెప్పటంతో గవర్నమెంటు

జీ.వో.లా బాబా వారి ఇంద్రజాల మహేంద్ర జాలం అందరికీ పారాయణం అయింది.

బాబావార్ని చూడ్డానికి జనం తండోప తండాలుగా దేవాలయం దగ్గరకు చేరి పోతున్నారు.

మంత్రులొస్తే కుళ్ళుకాలవలు బాగు పడ్డట్టు బాబా వారి రాకతో దేవాలయం శుభ్రం అయింది. తోరణాలు కట్టేరు. మేళం ఏర్పాటు జరిగింది. మైకులు అమ ర్చేరు. పూలు జల్లేరు. వచ్చిన వాళ్ళని అదుపులో పెట్టడానికి కర్రపెత్తనం పెద్దలుకూడా చేరేరు. వాళ్ళను ప్రత్యే కంగా ఎవరూ నియమించలేదు. అంతకు ముందు విభూతి చూడనివాళ్ళు కూడా నుదుటి నిండా విభూతి పట్టించి శిలా ప్రతి మల్లా చేరిపోయేరు.

ఎటూ చూసినా జనం!

ఏ కబురు చెప్పినా బాబావారి లీలల గురించే!!

బాబావారి ప్రసాదం దొరుకుతుందో దొరకదోనన్న బెంగ.

ఆయన పాదాలని స్పృశించగలమో లేదోనన్న దిగులు.

ఆయన్ని దగ్గరగా చూట్టం కోసం, ఆశీర్వచనం కోసం ముందుగా వచ్చి కూచు న్నారు.

మైకుల్లో సినిమా భక్తిపాటలు గాల్లో కల్సి అన్ని గడపల్ని ఆహ్వానిస్తున్నాయి. అంతో ఇంతో పరపతి ఉన్నవాళ్ళు ముందు వరసలో సీట్లు రిజర్వు చేసుకొన్నారు.

చాలా కాలం తర్వాత గుడి శుభ్రతని, నిండుగా వున్న భక్తుల్ని చూసి ఆనందంతో వుక్కిరి బిక్కిరై పోతున్నారు పూజారి గారు.

కొండగాలి చల్లబడింది.

సంధ్యా ఛాయలు చిక్కబడ్డాయి.

గుడి దగ్గర జనం బాబావారి కోసం ఆత్రుతగా నిరీక్షిస్తున్నారు. వొత్తిడికి నలిగిన పసిపాపలు, చోటుదగ్గర కొట్లాట వచ్చినవాళ్లు, ఏడుపులు, కేకల్తో ఆ చోటు తిరనాళ్ళలా సందడిగా వుంది.

శాస్త్రిగారి ఇంటిదగ్గర మేళతాళాలు వున్నట్టుండి గొంతులు పెగుల్చుకున్నాయి.

గుడి దగ్గర పాటలు ఆగేయి.

మేళం ముందు నడుస్తుండగా..భక్తులు అందంగా అలకరించిన పల్లకిని వంతుల వారీగా మోస్తుండగా బాబావారి శిష్యులు హారతులు, ఫల పుష్పాదులు అందుకుం టుండగా నెమ్మదిగా బాబావారి పల్లకి కొత్త పెళ్ళికూతురిలా సుతారంగా కదలి వస్తోంది.

"భజనానంద బాబాకీ..."

"జై..!!" అంటూ కొన్ని వందల కంఠాలు మారుమోగేయి.

పూరేకులతో పల్లకి, పూలహారాల్తో ఆయన పూర్తిగా నిండిపోయేరు.

పల్లకి చిన్నగా దేవాలయం చేరింది.

జనం లేచి నిల్చుని చేతులు జోడించి నమస్కారాలు చేస్తున్నారు. ఆయన దిగి నడవడానికి పట్టు చీరలు పరుస్తున్నారు ఆయన శిష్యులు, భక్తులు.

బాబాగారు దేవాలయం చేరగానే కళ్లు తెరిచేరు. జనంకేసి మాత్రం చూళ్ళేదు.

వెర్రెత్తిన ఆనందం జనంచేత జయ జయధ్వానాలు చేయించింది.

ఆయన నింపాదిగా దిగి పట్టుచీరల మీద పాదం మోపేరు.

రాజుగారు అడుగడుక్కీ పూలు జల్లు తున్నారు.

బాబావారి పాదాలక్రింద నలిగినపూలను చుట్టూవున్న ఆడవాళ్ళకిస్తున్నారు. ఆ

పంపకంకూడా సవ్యంగా జరగటం లేదని అక్కడకక్కడే ఫిర్యాదులు, గొడవ. ఆ తర్వాత సర్దుబాట్లు జరిగిపోయేయి.

అందంగా అలంకరించిన వేదిక మీదకి చేరారు బాబావారు.

శిష్యులు విసన కర్రలందుకొన్నారు.

నిదానంగా కళ్ళు మూసుకొన్నారు బాబావారు.

మైకుల్లో వేదం ప్రవహిస్తోంది.

కొద్దిగంటల వ్యవధిలోనే అంత త్వరగా ఏర్పాట్లు ఎలా చేసేరోగానీ అది వాళ్ళ భక్తికి చక్కటి ఉదాహరణగా ఉంది.

బాబావారు వుపదేశం ఇస్తారని రాజుగారు మైకులో చెప్పంగానే నిశ్శబ్దం అల్లుకుపోయింది.

చెట్లమీద పిట్టలు గొడవ మానేయి.

గుడిమీద పావురాళ్లు గూళ్ళలో వొదిగేయి.

అందరూ గుడ్లప్పగించి చూస్తున్నారు.

బాబావారు కళ్లు తెరిచేరు.

ఆ చూపు వెన్నెల్లా చల్లగా భక్తులకు ఆహ్లాదాన్ని కల్గించింది. బాబావారు నోరు విప్పేరు. మేఘ గంభీర స్వరం, ఆ పరిసరాల్ని పునీతం చేయసాగింది.

సమ్మోహనాస్త్రం అంటే ఏమిటో అంతవరకూ ఆ వూరి వాళ్ళకు తెలీదు. కాని ఇప్పుడు బహుశా అదంటే ఆయన ప్రవచనాలేనేమో అనుకొన్నారు. ఆయన గొంతులోని శ్రావ్యత మత్తుమందులా వ్యాపించింది. తామున్న స్థితికూడా మర్చిపోయేరు.

ఆకలిగొన్న వారికి పంచభక్ష్యాలు ఆయన మాటలు.

విరక్తి చెందినవాళ్ళకు కొత్త ఆశలు చిగురింపచేస్తాయి.

అజ్ఞానాంధకారానికి వెలుగుబాట నిస్తాయి.

గొంతు సవరించుకొన్నారు భజనానంద బాబా!

"ఈ అరిష్టాలకి మూలం ఈ దేవాలయం. అందుకే స్వామి ఆగ్రహానికి గురయ్యింది మీ ఊరు. ప్రతిష్ట సరిగా జరగని కారణమే ఈ అనావృష్టికి మూలం!"- అనగానే జనం కొయ్య బొమ్మల్లా మారిపోయేరు.

బాబావారు కొంచెం ఆగేరు.

కలవరం బయల్దేరింది.

"ఇన్నాల్లూ ఎవలూ సెప్పినారు గాదు."

"మరి ఆరు సెప్పేరంటే అది నిజవే అయ్యింతాది"- తలో రకంగా తమ అభిప్రాయాలు అడక్కపోయినా, వినకపోయినా జనాతికంగా చెప్పుకుంటున్నారు.

నిశ్శబ్దంగా వుండమని రాజుగారు సౌంజ్ఞ చేసేరు.

జనంలోంచి ఓ భక్తుడు లేచేడు.

"సామీ! ఇది మాకు తెలవక జరిగిన తప్పు. సేనా కాలంగా ఇలాగేవుంది గుడి. మావందరం సుకంగా వుండాలంటే ఏటి సెయ్యమంతారో తమరే సెలవియ్యండి" అని వినయంగా విన్నవించుకొన్నాడు.

భజనానంద బాబా చిన్న చిర్నవ్వు పంచి కళ్ళు మూసుకున్నారు.

భక్తుల్లో ఆత్రుత అధికమైంది. వేగంగా కొట్టుకొంటున్న గుండెల్ని అదుపులో పెట్టలేక పోయేరు. అందరూ మౌనంగా నోళ్లు తెరచి బాబాగారి పలుకు కోసం ఎదురు చూస్తున్నారు.

బాబావారు ధ్యానంనుంచి బయట పడ

లేదు. ఎన్ని క్షణాలుగడిచినా ఆతృత అధికమైంది గాని నిరుత్సాహం కలగలేదు భక్తకోటికి.

బాబావారు కళ్ళు తెరిచారు.

ఆ చూపులో వెయ్యి దీపాల వెలుగు విరజిమ్మింది.

ఒక్కసారి చీకటి శూన్యంలోకి చూసేరు.

"తూర్పు దిశగా ఈశాన్యమూలగా ఓ మారేడు చెట్టుంది. దాని దగ్గర చక్రం వేస్తాను. అక్కడ మరో దేవాలయం నిర్మించండి. ఆ స్థలం పవిత్రమైంది. శాశ్వతంగా మీకి కష్టాలు మటుమాయం అవుతాయి. సమృద్ధిగా వర్షం పడుతుంది. సస్యశ్యామలం అవుతుంది. మీ జీవితాలు సుఖమయం అవుతాయి. స్వామి ప్రతిష్ఠ ఎంత త్వరగా జరిగితే అంత శుభం. ఆ స్థలం దానం చెయ్యండి. దాతకు ఆయురారోగ్యములు కలుగగాక. శుభం భుయాత్" అని భజనానందబాబా కళ్ళు మూసుకొన్నారు.

తరుణోపాయం సెలవిచ్చినందుకు పుప్పొంగిపోయేరు. ఇక తమకి ఏ కష్టం కలగదన్న నమ్మకం అందరిలో చోటు చేసుకొంది.

బాబావారి దివ్యమహత్తుకి మనసులో జోహార్లు అర్పిస్తూ జనం ఒక్కసారి గట్టిగా వూపిరి పీల్చుకొన్నారు.

రాజుగారు మైకు ముందుకొచ్చేరు. జనం ఆసక్తిగా ఆయన మాటల కోసం తమ స్వరాలు తగ్గించేరు.

"దేవుళ్లాంటి బాబాగారు మనూరు రావటం కేవలం మనం సేసుకొన్న పున్యం. వారు సెలవిచ్చిన సోటు మా ఆడోళ్ళకి పసుపు కుంకం సదివింపు. దేవాలయం కోసరం, మనవూరి బాగుకోసరం ఆ బూవిని బాబావారి సలామేరకు సదివించుకొంటున్నాను."

చప్పట్లు - ఈలలు - కేకలు మార్మోగేయి. ఆ చుట్టు పక్కల కూడా అది మార్మోగింది. దేవాలయం పునాదులు కదిలేయి.

గుడిమీద పిట్టలకి గుండెలాగేయి.

చెట్లమీద పక్షులు రెక్కలాడించేయి.

పూజారిగారు ఆనందంగా మైకందుకొన్నారు.

కొద్దిక్షణాలు మాటలు రాలేదు. బొందితో కైలాసం చేరుకొన్నంత అనుభూతి పొందేరు.

"రాజుగారి మంచితనం, గొప్ప మనసు తెలియందికాదు. ఇన్నాళ్ళకి మన కష్టాలకి మూలకారణం తెల్సుకొన్నాం. బాబాగారి అమృతతుల్యమైన వాక్కులు చిరస్మరణీయం. మనందరం ఒక మాటమీద నడిస్తే మన ధ్యేయం సాధించగలం" అని బాబావారి పాదాలకు సాష్టాంగ ప్రణామం చేసేరు శాస్త్రిగారు.

బాబాగారు ఆశీర్వదించేరు.

"మీకు నీటి సమస్య కేవలం కొద్ది రోజులు మాత్రమే. దేవాలయం పునాది పడంగానే మీకు మరి నీటి ఎద్దడి వుండదు. భక్తులంతా ఇది స్వంత కార్యంలా భావించి ధనం సేకరించి ఈ భగవత్ కార్యం పూర్తిచేసి పుణ్యం పొందండి. చేసిన పాపాలు ఈ రకంగానైనా విసర్జించండి. మీ సహాయమే మీకు రక్ష" అని భజనానంద బాబాగారు వుపదేశించేరు.

అక్కడి కక్కడే విరాళాలు ప్రకటించేరు. ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా బాబావారి హస్తాలతో కొత్త దేవాలయం పునాది పడాలని, పూజ జరగాలని తీర్మానించేరు. అందరూ ఆనందంగా ఆమోద

ముద్ర వేసేరు.

మరోమారు జయజయధ్వానాలు మారు మోగేయి.

మైకులో దాతల పేర్లు గట్టిగా చెప్పేరు.

ఆ తంతు పూర్తయిం తర్వాత భక్తుల బాధల్ని, కోరికల్ని విన్నవించుకొనే కార్యక్రమం మొదలయింది.

*    *    *

చుట్టూవున్న ట్యూబ్ లైట్లమధ్య ఆమె అలసిపోయిన రంభలా వుంది వాళ్ళ ప్రాణాలకి.

వడిలిపోయిన పెదాల మీద ఎర్ర రంగు అందంగా మెరవటంలేదు. గారపట్టిన పళ్ళమీద కాంతిపడి తెల్లగా మరవటంలేదు. మొహం మీద పూసుకొన్న రంగు పాత గోడకి కొత్తగా వెల్లవేసినట్లుంది. జానెడు ఎర్ర టెర్లిన్ జాకెట్టులో దాచినా దాగని ఆమె షొంగుల్లు, బొడ్డుకిందికి జారిన లంగా మొకాళ్ళ దాకా వుండి చూపరుల్ని కదలకుండా చేస్తోంది.

రంగు పూసుకోకముందు తాగిన మందు మత్తెక్కించి కళ్ళు ఎర్రగా చేసింది. ఆమె నవ్వులు పంచుతూ కన్నుగీటుతుంటే మెలికలు తిరిగిపోతున్నారు కొందరు.

"ఏస్కో... కోకాకోలా... తీస్కో రమ్ము సారా.."- అని అరిగిన రికార్డు గిర్రున తిరగంగానే ఆమె మడతలు పడ్డ నడుము మొరటుగా కదుల్తూ చూస్తున్న జనానికి నిజంగా సారాయి తాగినంత కిక్కు కొట్టింది.

ఆమె అందానికి ముగ్ధులైన వాళ్ళూ, రసికులూ, రసికోత్తములూ మధ్య మధ్య ఆమె గుండెలకు తగిలేలా చిల్లర



విసుర్తున్నారు. 'వన్సుమోర్లు' కొడ్తున్నారు. ఆనందంతో వెర్రిగా అరుస్తున్నారు.

వేదిక చుట్టూ నాయుడుగారి ఎన్నికల గుర్తులు వేల్లాడ దీసున్నాయి. ప్రతి నృత్యం మధ్యలో నాయుడుగారి పార్టీ అభ్యర్థుల పేర్లు ప్రకటిస్తూ 'మీ ఓటు మాకే!' అని గుర్తుచేస్తున్నారు.

పట్నం రంభ పది నృత్యాలు చేసి ముగించింది.

నాయుడుగారు వేదికెక్కి వినయంగా నమస్కారంచేసి గొంతు సవరించుకొని గంభీరోపన్యాసం ప్రారంభించేరు.

"ఈ వొక్క పాలి గనుక మా పార్టీకి సేన్సిత్తే మనూరికి రోడ్లేయిత్తాం. బస్సు లేయిత్తాం. పెబుత్వం మనబొట్లకి బడి పెట్ట మని దబ్బిచ్చిఐయిదేల్లుదాటిపోయినా ఇంత వరకూ దానివూసె త్తలేదు. కుర్చీలో వున్న పెద్దోల్లు ఆ నెక్కని సద్దుకొన్నారు ఇలా టోల్లందర్నీ మల్లీమల్లీ ఎన్నుకొని వూర్ని నాశనం సెయ్యొద్దు. మావుగాని మాట మీద నిలబడకుంటే మీ అందరి కోసరం పదవులొగ్గేత్తాం.. మా మీద ఇస్వాసం వుంచి మీ ముద్దర మాకు గుద్దమని పార్థిస్తున్నాం." అని మరోమారు వినయంగా నమస్కరించి నాయుడుగారు ఆ సీను లయ్యేరు.

జనం నీరసంగా చప్పట్లు చరిచేరు.

"మేం ఏటి సేత్తావో డబ్బా కొట్టుకోం. మావుగాని గెలిత్తే సేసి సూపెత్తాం. అమాయకమైన ఆడోల్లని సెరిసేసినోల్లు సిగ్గు నేకుండా తలెత్తుకు తిరిగేత్తున్నారు" లింగం మాట్లాడుతూనే వున్నాడు.

జనంలో గలభా మొదలయ్యింది.. రాజుగారి సపోర్టర్స్ గట్టిగా అరుపులు, కేకలువేస్తూ మీటింగు ఆపాలని గొడవ చేసేరు. నాయుడు వర్గాన్ని, నాయుడ్ని స్వేచ్ఛమైన బూతుల్తో తిడుతున్నారు. అంతటితో ఆగక రాళ్ళువిసిరేరు. రెండు మూడు ట్యూబ్ లైట్లు బద్దలయ్యేయి.

రికార్డు డేన్సరు మాయమైంది!

నాయుడుగారి మనుషులు రెడీగా ఉన్న కర్రలు తీసేరు. మరోక్షణంలో శవాలు తేలడం ఖాయం. కానీ నాయుడుగారు పెరుగుతున్న క్రోధాగ్నిని చల్లార్చుకొని తన మనుషుల్ని ఆపేరు. అది సమయం కాదుమరి.

కృష్ణుడు ఆపలేకపోయిన కురుక్షేత్ర సంగ్రామాన్ని నాయుడుగారు కేవలం కను సైగతో ఆపగల్గేరు.

జనం చెల్లాచెదురైపోయేరు.

పాలిపోయిన శవాల్లా నాయుడుగారు తదితరులు అక్కడే వున్నారు. రాజు గారికి పెరిగిన పరపతిని తల్చుకొంటూ.



6

మరో ఇరవై రోజుల్లో ఎన్నికలు.

ఏ చోట చూసినా, ఏ నోట విన్నా ఎన్నికల సంరంభమే! ఖద్దరు గుడ్డలకు వూపిరాడటం లేదు. గాంధీగారి పటాలకు, కిరాయి గూండాలకు,రికార్డింగు డేన్సర్లకు, సారాయి దుకాణాలకు రాత్రిళ్ళు కావలసి నంత గిరాకీగా ఉంది.

వాగ్దానాల హోరు,కొట్లాటల సంబరం,

మానభంగాల వినోద కాలక్షేపం, పార్టీ మార్పిడుల గందరగోళం, అడపాదడపా హత్యలు, అనవాయితీగా దోపిడీలతో ప్రతి వూరూ పండగ చేసుకుంటోంది. ప్రజలందరికీ కాలక్షేపం జరుగుతోంది.

ప్రజలచేత ప్రజల కొరకు ప్రజలవల్ల ఏర్పడబోయే ప్రభుత్వానికి కొట్లాటలు స్వాగతం పలుకుతున్నాయి. ఖూనీలు క్లయిమేక్సు నిస్తున్నాయి.

ఆఖరి ఆయుధంగా కులం పేరు చెప్పి మత్తుమందు జల్లి పబ్బం గడుపు కుంటున్నారు. వాళ్ల నాటిన విషబీజం ఎంతదూరం పోతుందో వాళ్ళ కనవసరం వాళ్ళను నమ్మిన జనం, వాళ్ళ వుపన్యాసాలకు కరిగిపోయే ప్రజలున్నంత కాలం ప్రజాస్వామ్యానికి ముప్పు వాటిల్లదని పిస్తుంది.

వేలిముద్ర వెయ్యడం తప్ప అక్షరం ముక్కరాని నాయకుల రాజకీయ పరిజ్ఞానం – ఎత్తుగడలు చూస్తుంటే ఇంత మంది చాణిక్యుల్ని కన్న ఆంధ్రమాతకు జోహార్లు అర్పించాల్సిందే ననిపిస్తుంది.

ఎన్నికలయిన మరుక్షణం మళ్ళీ ఎన్నికలదాకా మొహాలు చూపించరని, ఈ వాగ్దానాలు గాలి మూటలని తెల్సి కూడా వాళ్ళనే ఎన్నుకోవడం ఎన్నికల్లో వున్న మత్తు, మాయ, గమ్మత్తు!

* * *

ఊరు చిన్నదే అయినా కుమిలిపల్లి రాజకీయాలమీద మహద్గ్రంథం రాయవచ్చు. అక్కడ రాజకీయపు రొచ్చులో ఎవరెప్పుడు ఎటువైపు 'జై' కొడ్తారో ఎవ్వరికీ అర్థం కావటం లేదు.

అన్నీ తెల్సిన నాయుడుగారు కూడా డీలా పడిపోయేరు. ప్రజల్ని ఆకర్షించడానికి, వాళ్ళ సానుభూతి పొందడానికి బోల్డు కుప్పిగంతులు వేసేరు. అయినా నాయుడుగారి పార్టీ ఓడిపోడానికి 'బ్లూ ప్రింట్' తయారయ్యింది. ఆ విషయం బయటకువస్తే వున్న సపోర్టర్సు కూడా వదిలేసి పోతారని నాయుడుగారి భయం.

ఓడిపోతామని తెల్సికూడా యుద్ధం చెయ్యడం ధైర్యవంతుల లక్షణం. అందుకే నాయుడుగారు కొత్త కొత్త మార్గాల అన్వేషణలో పడ్డారు.

అనామకంగా వున్న దేవాలయానికి కూడా ఎన్నికల్లో ఇంత ప్రాముఖ్యం వస్తుందని ముందే వూహించి వుంటే కథ మరోలా మారుండేది. ఇప్పుడు ఆకులు పట్టుకోవడం అవివేకం అన్పించింది నాయుడుగారికి.

లింగం, సూరి కూడా ఇదివరకంత స్వామి భక్తి పరాయణులుగా కన్పించక పోగా అపుడపుడు ఎదురు ప్రశ్నలు కూడా వెయ్యడం నాయుడిగారికి చివుక్కుమన్నా వూరుకోక తప్పింది కాదు.

నాయుడుగారు అలా చింతాక్రాంతులై ఆలోచనల సుడిగుండంలో అల్లాడుతున్న క్షణాల్లో ఆయన దృష్టి వీధి గుమ్మం మీద వాలింది.

ఆ చీకట్లో గుమ్మం దగ్గర అంత ఠీవిగా నుల్చున్న వాడు 'ఎవరబ్బా?' అని అక్కడున్న అందరికీ అనుమానం వచ్చింది. నిశితంగా పరిశీలించి చూసేరు.

క్షణం తర్వాత గుర్తించినవారై ...

"ఏటిగుమ్మం దగ్గర అలగ నుల్చుంది పోనాడు. పిచ్చిగాని పట్టినాదేటి ఈ నా కొడుక్కి" సౌమ్యంగా అన్నారు నాయుడుగారు.

"అడిగ్గాదు. మనకెక్కించేనాగున్నాడు" లింగం.

"ఎవలదీ!" గట్టిగా అడిగేడు సూరి.

గుమ్మం దగ్గర బిక్కచిక్కిన పురుగుకి చలనం వచ్చింది. అంగలో అంగేసుకొంటూ కదిలొచ్చేడు.

ఇచ్చిన అప్పు వసూలు చేసుకోడానికి వచ్చిన వాడిలా ఉన్నాడు అబ్బులు. పెద్దల ముందు వినయ విధేయతలు చూపని అబ్బుల్ని చూసి నాయుడుగారు జంక లేదు. అంత ధైర్యానికి కారణం ఏమైవుంటుందో వూహించడంలో నిమగ్నమైపోయేరు.

"ఏటలగ సూత్తున్నావ్? వూష్ణం గాని కమ్మేనాదేటి?!" పరుషంగా అన్నాడు లింగం.

పెదవి కదపలేదు అబ్బులు.

"నోరుగాని పడిపోనాదేట్రా?!" ముద్దుగా అడిగేడు సూరి.

బాంబు పేలినట్టు పేలాడు అబ్బులు.

"ఇన్నాల్లూ పడిపోనాది. అందుకే మీరందరూ బతికిపోనారు" అన్నాడు అందర్నీ చకితుల్ని చేస్తూ.

''నోరేటి మా జోరుమీదుంది. నంజి కొడక సిన్నా పెద్దా మర్సిపోతున్నవ్" లింగం చేతిలో చుట్ట వేళ్ళమధ్య నలిగి పోయింది.

''ఏటయిందిరా?'' నాయుడు గారు అగ్గిపుల్ల దహనం చేస్తూ అన్నారు.

''నా సింతల్లిని సంపినాదెవలండి?!', కసి, కోపం మిళితమై వచ్చింది ఆ మాట

ముగ్గురూ షాక్ అయినమాట నిజం. ఆ సంగతి అబ్బులికి తెల్సినందుక్కాదు, వూరంతా తెల్సిందేమోనని. వెంటనే తమా యించుకొన్నారు.

''ఎవలో మా కెలగ తెలుత్తాది. రాజు గాడే సేసుంతాడు. అయినా ఇప్పుడే టయిందిరా?'' లింగం తాపీగా అన్నాడు.

''ఇన్నాల్లూ మీరు సెప్పిన మాటలే నమ్మినాను. ఏ పాపం తెలీని ఆ బాబుని నోటికొచ్చిన మాటల్లా అనేసాను."

"ఏటి ఆడుగాదా సేసింది?" బోల్డంత ఆశ్చర్య పోయేడు సూరి.

"బావూ! నాను ఎర్రి యెదవనేనండి. వొప్పుకుంతాను. కాని ఇప్పుడుగాదండీ. నాయుడు బావూ. నాకు పెల్లి సేత్తానని సెప్పి దాన్ని సంపిత్తారా బావూ.ఇలాటియి దా పెద్దారన్నా దాగవు బావూ. అసలు మావేటపకారం సేసేవండి. మిమ్మల్ని నమ్మడమేగదా బావూ, మావు సేసిన తప్పు. ఇన్ని తప్పులు కాసేసినా మీరు దయిర్యంగా తిరిగేత్తున్నారంటే మరి మీరు బతగ్గూడదు బావూ. సవ్వాల, సావాల." ఆవేశంగా అంటూ రెండ డుగులు వేసేడు అబ్బులు.

''అమ్మ నంజికొడకా! నీకు సేనా పెపంచకం తెల్సిపోనాదిరా. మరీ ఎక్కువ తెలిత్తే మంత్రివైపోతావు. మా ముందల సుల్సుని మమ్మల్నే మాటనేంత గొప్పోడివైపోయేవంటే నీకూ, సింతల్లికి మనువు సెయ్యాల్సిందే" మాట పూర్తి కాకముందే లింగం చెయ్యి విసురుగా అబ్బులు మొహాన్ని తకింది.

మరో ఆలోచనకు తావివ్వకుండా సూరి మరోదెబ్బ వేసేడు.

కళ్ళు బైర్లుకమ్మి మట్టిని ముద్దాడేడు అబ్బులు.

నాయుడుగారు వారించేరు.

లింగం, సూరి ఆవేశం తగ్గించు కొన్నారు.

అబ్బులు కళ్ల నూనె తాగేసిన జ్యోతుల్లా వున్నాయి. అతని చూపులు గుండెలోకి దూసుకొస్తున్న బాకుల్లా

వున్నాయి. నేలను బలంగా తాకిన బంతిలా లేచేడు.

కాని... వెంటనే...

అబ్బులు బనీను నాయడిగారి పిడికిల్లో బిగుసుకుపోయింది. పులి పంజాకి దొరికిన లేడి పిల్లలా గింజుకొన్నాడు అబ్బులు.

''సూడొరే! ఇంకో దెబ్బగాని కొడ్తే చత్తావ్. పిచ్చి పిచ్చి కూతలు మాని బుద్ధిగా వుండు. ఈ పాలిగాని నోరు తెర్సేవా నాకొడకా, అన్నేయంగా సతావ్. ఎల్లు. మళ్లీ ఎవరి దగ్గిరేనా నోరు జార్సినట్టు తెల్సిందో...'' బనీనొదిలి పీకను సరదాగా పిసికేరు నాయుడు గారు.

మెడ విరిగిన కోడిలా గిలగిలలాడేడు అబ్బులు.

విసురుగా తోసేరు నాయుడుగారు.

నేలమీద పడ్డ అబ్బులు చేప పిల్లలా కొట్టుకున్నాడు.

ఒకే దెబ్బతో ముగ్గుర్నీ చంపాలన్న కోరిక వున్నా అది సమయం కాదనిపించింది. అర్థం లేని ఆవేశం పనికిరాదనిపించింది.

''ఎల్లు. బుద్ధిగా ఇంటికాడ తొంగో'' నవ్వుతూ అన్నాడు సూరి.

అబ్బులు నీరసంగా లేచేడు. డొక్కలు ఎగిసి పడ్తున్నాయి. పగిలిన పెదాల నుంచి రక్తం వూరుతోంది. చూపులు కాల్తున్నాయి.

"నీయమ్మ. సూపుల్తో సంపేసేనాగున్నావ్. బేగెల్లు నేకుంటే గుడ్లు పీకేసి మా కోళ్ళకి పడేస్తాను. మీకునాటోల్లందరూ మమ్మల్ని భయపెడ్తేమావుకద్దరేసుకోటం ఎందుకు?!" అన్నాడు లింగం.

అబ్బులు మాట్లాడలేదు. నాలుగడుగులు వేసి మళ్ళీ ఆగేడు. వాళ్ళని వదిలెయ్యాలనిలేదు. అయినా నీరసంగా గడప దాటేడు.

"ఆడ్ని అలగ వొగ్గేస్తే నూసెన్సయి పోద్ది. అసలే మన పొజిసన్ డౌన్లో వుంది" సంశయంగా అన్నాడు లింగం.

"అసలీడికెవరు సెప్పేరు ?'' సూరి అనుమానం.

"ఎవలు సెప్పినా మనం ఏటి సెయ్యాలి?"—లింగం.

"మన సేతుల్లో మాదిగవాడ నేకుండా పోతే సేనా కట్టం"—సూరి.

"పిల్లకాకులు కూడా అరవటం మొదలెడితే మనం క్లోజే''—లింగం.

"పేమికుల్ని ఇడదీయటం అన్నేయం. ఇద్దర్నీ కలిపేదం నేయం.''

—నాయుడిగారి హాస్య చతురత కితకితలు పెట్టింది.

—ముగ్గురిమాట ఒకటైంది.

మాటలో నిర్ణయం నిశ్చయమైంది.

* * *

"ఏటి నిజవేనా ?'' అని అందరూ మూకుమ్మడిగా ఆశ్చర్యం ప్రకటించేరు. వుదయమే చెడువార్త విన్నందుకుఅదోలా అయిపోయేరు. అయిపోయినవాళ్ళు వూరుకోక నిద్రమత్తు వదిలించుకొని చెప్పుల్లో కాళ్ళు దూర్చేరు.

మాదిగవాడలో పెద్దలు, పిన్నలు ఆవేశంతో వూగిపోయేరు. ఏం చెయ్యాలో తెలీక తికమక పడ్డారు.

కన్నీళ్ళు కార్చేరు. గుండెలు బాదుకున్నారు. గొంతులు పెగుల్చుకున్నారు.

మాదిగవాడకు ఆరాధ్య దైవం నాయుడుగారు. పబ్లిగ్గా నిలబడి బరువుగా, భారంగా తలవాల్చేరు.

"ఎవలకీ ఏ అపకారం సేసెరగడు.

మరి ఇలగెందుకు సంపీసినారు?" అందో అజ్ఞాత కంఠం గాద్గదింగా.

"వూరు అడవి నాగయి పోనాది".

అందరూ శవం చుట్టూ దడి కట్టేరు.

ఎండ శవం మీద పరుచుకొంది.

అతగాడ్ని చూడంగానే రాత్రి బాగా మందు కొట్టేసి రోడ్డువార్న కునుకే స్తున్నట్లుగా వున్నాడు. మాసిపోయిన బట్టల్తో, పెరిగిపోయిన జుట్టుతో మున్సిపాలిటీ వాళ్ళు కూడా మోయడానికి అసహ్యించుకునేలా వున్నాడు.

నాయుడిగారి కళ్ళుఎర్రరంగుపులుము కున్నాయి. దుఃఖం పొంగిపోతుండగా నోటమాటరాక అవస్థ పడుతున్నారు. జనం శవం తీరుకన్నా నాయుడిగారి బాధను చూస్తూ నిట్టనిలువునా కరిగి పోయేరు.

"సింతల్లినిచ్చి పెల్లి సెయ్యమన్నాడు. కులంగానిదైనా ఆడి పేమకోసరం అలగే సేయిత్తారా తొందర పడమాకమని సెప్పేను, దాని కర్మ అలగ రాసుంది. ఆడి సేతుల్లో సచ్చిపోనాది. పాపం ఆరోజు నుంచి ఈడికి తిండ్రీ నిదానేదు. ఓరయ్యా! ఇదేటి గోరంరా, కుసింత ఎంగిలి పడ్డా అని సెప్పేను. నేదుబావూ! నా సింతల్లిని సంపినోల్లని సంపకుండా గంజి ముట్టుకో నన్నాడు. రాజుగాడు సరైనోడు గాదు ఇరోదం వద్దని సెప్పేను. ఇన్లేదు. ఆడిమీద తిరగబడుంతాడు. ఇదిగో ఇలగెపోనాడు. ఇలగే 'గాజులేసుకొని కూకుంతే వూరంతా మట్టిలో కల్సిపోద్ది..."

మధ్య మధ్యలో దుఃఖం మింగుకుంటూ బాధను వెళ్ళగక్కేరు నాయుడుగారు.

చుట్టూచేరిన వాళ్ళు అవునన్నట్లు తలాడించలేదు!

లింగం, సూరి మాత్రం రెస్పాన్సు ఆశించినంతగా లేకపోవడంతో ఇబ్బంది పడ్డారు.

రాజుగారే ఈ హత్యకుకూడా కారణం అన్న భావం వచ్చేలా పలుమార్లు కన్నీళ్లు తుడుచుకున్నా లాభంలేకపోయింది.అయినా నాయుడుగారు నిరుత్సాహ పడలేదు.

మునసబుగారు హుటాహుటీగా వూడి పడ్డారు.

ఆయన రాకను అంతగా గుర్తించ లేదు ఎవ్వరూ.

పట్నంకి కబురు పెట్టేరు పోలీసుల కోసం.

ఎండ బాగా ముదిరిపోయింది.

అబ్బులి గుణగణాల్ని వల్లించుకుంటూ నీడపట్టున చేరేరు.

నాయుడుగారు క్షణంలో వస్తానని ఏర్పాట్ల విషయం చూడమని పెద్దలకు సలహాఇచ్చి అక్కడ నుంచి కదిలేరు.

ఎండలో అబ్బులు హాయిగా కాల్తున్నాడు.

దుమ్ముగాలి చుట్టబెడ్తోంది.

ఆదార్న పోతున్న వాళ్ళు శవం దగ్గరగా వచ్చి చూసి చనిపోయినవాడి వివరాలు తెలుసుకుంటున్నారు. బతికుండగా ఎవరూ అతగాడ్ని పలకరించి వుండరు. ఇప్పుడు మాత్రం శ్రద్ధగా పరామర్శిస్తున్నారు శవాన్ని.

"ఈడు సత్తే మనకేదో సుకం అను కున్నాం గాని, అలాటిదేం నేదు" లింగం నడుస్తూ అన్నాడు.

"బతికుంటే సేనా నాసు" నాయుడు గారు నుదిటిమీద చెమట తుడుచుకుంటూ అన్నారు.

"పోలీసులొత్తే సిక్కేం గాదుగా" అనుమానం వెలిబుచ్చేడు లింగం.

"ఆల్ల సంగతి మనకి తెల్దేటి! సందేశ

శవాన్ని వూరేగిస్తే సరి. రాజుగాడికి పేణం ఆగిపోద్ది. ఏర్పాట్లు గసంగా సూడండి" నాయుడుగారు సూరికి ఆజ్ఞలు జారీచేసేరు.

''చచ్చినోల్ల వూరేగింపుల్లోనే మనకి సరిపోతాంది"-లింగం.

"అవుసరం అయితే కర్మలు గూడా పెట్టాల్సుంతాది. ఏటిసేతాం ఎలకన్నను. శవాలకైనా ఆపాటి సేవచెయ్యకపోతే ఎలగ. పెజలకి సేవసెయ్యడానికి గెల్సిం తర్వాత తీరికుండదు గదా !!"

"రోజులు దగ్గరెపోనాయి. ఇంత వరకు గుండెమీద సెయ్యేసుకుని కును కెయ్య నేదు గదా !" సూరి చిన్నగా అన్నాడు.

''ఇక మనకి వోపిక సల్లబడ్డే ఆక రాయుధం తీద్దారి'' - నాయుడుగారికి ఆత్మవిశ్వాసం ఎక్కువ.

''అదేటి ?!''

''ఏటుంది కులం పేరుసెప్పి రెచ్చ గొట్టేసాలు. రాజకీయంలో ఇదే పెద్దాన సూత్రం. దీనికి తట్టుకోవటం రాజుగారి వల్లకాదు.''

''నిజవేనండి. పరగడుపున పూరాగా సీసాడు సారాతాగినా మత్తుండదుగాని కులం అంటే సంజికొడుకులు వొంటిమీద గుడ్డ నేకుండా కొట్టుకు సావరూ?!'' లింగం ఆనందంగా అన్నాడు.

''గాంధీగారు మనకు సేసిన వుపకారం అదే. యెనకబడినోల్లు నా సొంతబిడ్డలను. అడ్ని గట్టిగా పట్టుకొని ఫొటోదిగు. ఆనక ఆడికో కుర్చ ఇచ్చేయ్. పెద్దకులాలోల్లకి దెబ్బతగిల్తే విప్లవం అను. సిన్నోడికి తగిల్తే అరాచకం అను. గెలవటం కాయం'' - ఆయనకున్న తెలివితేటలకు నిజంగా ప్రధాని కావల్సింది.

ముగ్గురూ వూరి నడిబొడ్డు దగ్గర కొచ్చేసరికి మేళతాళాల మోత చెవిని సోకింది.

* * *

"రాజుగారు మాతెలివైనోడు. దార్ని పోయే గెడ్డపోడ్ని నాక్కొచ్చి ఆడ్ని దేవుడ్ని సేసేనాడు. నిజంగా వుండాల్సి నోడు.." అన్నాడు లింగం.

"భజన సేసే ఎర్రియదవలుంటే పెతి గెడ్డపోడూ దేవుడే ! ఎలకన్నల గురించని పెజల్ని గొర్రెల్ని సేసేత్తున్నాడు" అన్నాడు లింగం పక్కనున్నవాడు.

రచ్చబండ దగ్గర బాబావారి మహ త్యాల్ని, రాజుగారి ప్రజాసేవని పొగుడు కుంటున్న జనానికి ఈ మాటల్తో చుర్రు మని వాత పెట్టినట్లయింది. ఎదురుగా వున్న ఇద్దర్నీ నిలువునా నరికేద్దామని పించింది.

"ఏట్రా కూసేరు ? ఆరు దేవుడు గాదా ?! మరోపాలంటే కల్లుపోతాయి. ఆ నాయుడు గాడికీ,మీకూ మరో పన్లేదేటి? మంచి సేసేటోల్లను గూడా సెయ్య నియ్యరు."

"అంత పొడుసుకొచ్చేనాదేటి ?! ఆరే గనుక దేవుడైతే నీళ్లు పుట్టించమన కూడదా ?"-లింగం.

"నువ్వొడగంగానే సేసెయ్యడానికి ఆరు నీ పాలేరు గాదు."

"పోనీ మీ రాజుగార్ని అడగమను"- ఎత్తిపొడుపుగా అన్నాడు.

"అయినా ఆరి సంగతి మీకేటి తెల్సురా?"-వెనగ్గా వున్నవాడు ముందు కొస్తూ అన్నాడు.

"నీకు తెల్సిందేటో సెప్పరాదు" కవ్వించే ధోరణిలో అన్నాడు లింగం.



సరిగ్గా అపుడే మేళతాళాలు చేరు వయ్యేయి.

జయజయధ్వానాలు మార్మోగాయి.

ఆవేశం తగ్గించుకొని అందరూ అటు వైపు తిరిగారు.

పల్లకి చేరువవుతోంది. దారివ్వడం కోసం రచ్చబండ మీద కెక్కేరు.

అన్ని గొంతుకల్నీ చీలుస్తూ విన్పించిందో ఆర్తనాదం.

"బాపూ! నా బిడ్డను కాపాడండి. సచ్చిపోయేనాగున్నాడు బాపూ!"– కన్నీరు మున్నీరుగా రోదిస్తోంది ఆమె. చేతుల్లో బిడ్డ ఆరిపోయే దీపంలా వున్నాడు.

అందరూ బాబావారికేసి చూసేరు.

బాబావారు కళ్ళు తెరవలేదు. ఆమె ఏడుస్తూనే వుంది. పల్లకిలో బాబావారు మెల్లగా కళ్లు తెరచి చూసేరు. ఎదురుగా వున్న స్త్రీని, ఆమె చేతిలో బిడ్డను చూడగానే మళ్ళీ కళ్ళు మూసుకున్నారు.

బాబావారు ఏం చేస్తారోనన్న వుత్సుకత పెరిగింది అక్కడున్న అందరికీ.

అందరితో పాటు లింగం.

మరోసారి కళ్లు తెరిచేరు. ఆమెను దగ్గరకు రమ్మన్నట్లు సౌంజ్ఞ చేసేరు.

"బేగెల్లు.." – అన్నాయి చిన్నగా చాలా కంఠాలు.

పల్లకికి దగ్గరగా వెళ్లింది ఆమె.

"రేత్రాల నుంచి వుష్ణం కమ్మేనాది. సున్నగా తొంగుండి పోనాడు బాపూ. సుక్కనీళ్ళు తాగనేదు. కన్ను తెరచి సూడ్డేదు. ఆడికి పేణం పెట్టండి బాపూ" ఏడుస్తూనేవుంది.

బాబావారు శూన్యంలోకి చూసేరు. పెదాల మీద ఏదో మంత్రం వొర్లింది.

అందరూ ఆయన చూసిన వేపే చూసేరు.

చుట్టూ వున్న అందర్నీ కలయ చూసేరు. గాల్లో చెయ్యివూపేరు.

అందరిగుండెల్లో ఆందోళన. రక్తంకి వేగం హెచ్చింది.

బాబావారి చేతుల్లో విభూతి వచ్చింది.. ఆమెను దగ్గరగా పిల్చేరు. పిల్లవాడ్ని బాబావారి పాదాల ముందుంచింది. ఆయన స్వహస్తాలతో విభూతి బొట్టుగా పెట్టేరు.

భక్తులు అచ్చెరువొందేరు. దండాలు పెట్టేరు. సాష్టాంగ ప్రణామాలు చేసేరు.

భక్తులను పట్టించుకోలేదు బాబావారు/ ఆపరేషన్ పూర్తిచేసిన డాక్టరుగార్లా అమాయకంగా కళ్ళు మూసుకున్నారు.

అందరి దృష్టి పిల్లవాడిమీద వుంది.

కన్నతల్లి గుండెను చేత్తో పట్టుకొని కొడుక్కేసి చూస్తోంది.

లింగం అందర్నీ చూసి నవ్వుకున్నాడు. బాబాగారి బండారం బయట పడబోతున్నం దుకు సంతోషించేడు.

ఎంత సేపటికి చలనంలేని కుర్రాణ్ని చూసి కొంత మంది బాబాగారి మీద అభి ప్రాయం మార్చుకోబోయేరు.

ఇంతలో కుర్రవాడిలో చలనం ప్రారంభమైంది. చూస్తున్న అందరి ముఖా ల్లోనూ కొత్త కాంతులు చేరుకొంటున్నాయి

మెల్లగా కళ్ళు తెరిచాడు కుర్రాడు.. గుసగుసలు ప్రారంభం అయ్యేయి. పిల్లవాడి తల్లికి పోయిన ప్రాణం తిరిగొచ్చి నట్లయింది.

తనకేసిచూస్తున్న కొన్ని జతల కళ్ళు చూసి భయపడి గుక్క పెట్టేడు కుర్రాడు.

అప్రయత్నంగా అందరూ బాబావారి నామస్మరణ చేసేరు. మరోసారి బాబావారు కళ్ళు తెరిచేరు. గాల్లో చెయ్యూపేరు.. ఈసారి విభూతి రాలేదు. ఆయన చేతి లోంచి మూడు చుక్కల నీళ్ళు కుర్రాడి నోట్లో పోసేరు.

ఆకలికి పాలుతాగి ఆడుకొంటున్నట్టు కేరింతలు కొట్టేడు ఏడుపుమాని. కళ్ళు మూసుకొన్నారు బాబావారు.

పిల్లాణ్ని తల్లికందించేరు.

భక్తులందరూ ఒళ్ళు మరిచి భజన చేసేరు. బాబావారు కాషాయి గుడ్డ కట్టు కొన్న దేవుళ్ళా కన్పించేరు.

వూరేగింపు కదిలింది.

లింగం స్థాణువులా వుండిపోయేడు.

బాబావారి మహత్తుచూసి మతి పోయింది లింగానికి. అంతదాకా వున్న అభిప్రాయం ఖచ్చితంగా మార్చుకోవల్సి వచ్చింది. అతగాడికి తెలియకుండా బాబావారి మీద భక్తి పెరిగింది.

"చూసినావా! ఇప్పుడు సెప్పు బాబాగారు దేవుడవునాగాదా?"—నిలేసేరు లింగాన్ని.

లింగం మాట్లాడలేదు. తలవొంచు కున్నాడు.

"ఇంకోపాలెప్పుడు ఆ రూ సె త కు. సంపేతారు. అల్లా నాయుడుగాడితో సేరి సెడిపోనావు. ఎల్లు బాబావారి పాదాల మీదపడు. సేసిన పాపాలు పోతాయి'' నవ్వుతూ అన్నారు.

లింగం మౌనంగా అక్కడి నుంచి కదిలేడు.

ప్రస్తుత పరిస్థితుల్లో 'స్వంత ఇంటికి పోయినట్లుగా' పార్టీ మార్చేసి రాజుగారి దగ్గరకు చేరిపోతే మెంబరు పదవికి ఢోకా లేదు. రెండు చిన్న కాంట్రాక్టులు దొరికినా

చాలు రోజులు గడిచిపోతాయన్పించింది. కానీ పబ్లిగ్గా పార్టీ మారిస్తే నాయుడుగారు పొడిపించేస్తారని తెల్సు. మరేది మార్గం ?

దారి పొడవునా కొత్తదేవాలయం గురించి, బాబా వారి గురించే చెప్పుకుంటు న్నారు.

లింగం అడుగులు నాయుడిగారి ఇంటి కేసి మళ్ళేయి.

సరిగ్గా సందు మలుపు దగ్గర కొచ్చే సరికి......

ఖద్దరు చొక్కా వేసుకొన్న ఏనుగులా, సందుమొదట్లో వెలిసిన విగ్రహంలా, కదిలొస్తున్న పర్వతంలా వస్తున్న సెంద్రావు నాయుడుగారు ఎదురయ్యేరు లింగానికి.

లింగం నాయుడుగార్ని చూసి వొణికి పోయేడు.

"నిన్ను పొద్దుగాల తగలడమంటే ఇంత సేపేడ సచ్చేవ్?"-ముద్దుగా పలక రించేరు నాయుడుగారు.

"ఏట్నేదు బావూ ! ఊల్లో ఇంతలు ఇని పారొచ్చేసరికి ఆలీసెం అయిపోనాది" తోక జాడించని కుక్కలా అన్నాడు.

"ఏటట...?!" - చిరాగ్గా అన్నారు.

"ఏటి సెప్మంటారు. మనం గెలవటం సేనా కట్టంగా ఆపడ్తోంది. ఊరంతా రాజుగారి పేరు, బాబాగారి పేరు జపించేతున్నారు. మనం ఏటేనా అంటే సంపేసేనాగున్నారు."

నడుస్తున్న నాయుడిగారికి అడుగు తడబడింది.

రాజుగారి రాజకీయం తెల్సినా బయట పెట్టడం ప్రస్తుత పరిస్థితుల్లో అంతక్షేమం కాదనిపించింది. తక్షణ కర్తవ్యం మాత్రం బోధపడలేదు.

అడుగు ఆగింది. ఎదురు సందులోంచి వస్తున్న వూరేగింపు కాలు కదల్నీయలేదు.

అందరి ముందూ రాజుగారు. అడవికి వెళ్తున్న రాముణ్ని చూస్తున్నట్లు అందరూ అరుగులమీద నిల్చున్నారు.

రాజుగారు పట్టుకొన్న జోలె చకచకా నిండిపోతోంది. చిన్నా పెద్దా తారతమ్యం లేదు. అందరూ ఇంతో అంతో చందా లేస్తున్నారు. మధ్య మధ్యలో బాబాగారి నామస్మరణ చేస్తున్నారు.

రాజుగారు ప్రతి గడప దగ్గరా ఆగి జోలె జాపుతున్నారు.

నుదుటిన ఎర్రటి బొట్టు, తెల్లటి జరీ అంచు పట్టు పంచె, మెడలో బంగారు గొలుసు, ముడతలు పడ్డ ముసలి శరీరంతో రాజుగారు కరుగుతున్న బంగారుబొమ్మలా వున్నారు. తెల్లటి జుట్టులో ఇరుక్కొన్న పూలు-ఎండకి మంచి ముత్యాల్లా మెరుస్తున్న స్వేదబిందువులతో రాజుగారు నీరసంలో నలిగిపోయున్నారు.

ఊరి బాగుకోసం రాజుగారి నిర్విరామ కృషిని ప్రజలు వేనోళ్ళ కొనియాడు తున్నారు.

నాయుడుగారు ఆలోచన్లు తెంచుకొని ఇహంలోకి వచ్చేసరికి వూరేగింపు కొద్ది అడుగుల దూరంలోకి వచ్చేసింది. ఆ క్షణంలో అక్కడ నుంచి వెళ్ళటం సబబుగా తోచలేదు. అలాచేస్తే దానికి రాజకీయపరంగా రంగు పూస్తారు.

"కులాసానా నాయుడుగారూ! బాబా వారి ఆశీర్వచనంతో కొత్త దేవళం కద్దారని ఆలోచించేం. పాత దేవాలయం తొలగించి నీల్ల గురించి పెద్ద బావి కట్టిద్దారని. మీకు లాటి పెద్దల అండదండలు మాకుండాలి. బాబావారి దయవల్ల నీల్లొస్తే మరి మనూరికి పట్టుకొన్న కరువు మాసిపోద్ది" - అంటూ జోలె ముందుంచేరు రాజుగారు.

నిప్పుల మంట మధ్య నుల్చున్నట్లయింది నాయుడుగారికి.

రాజుగారి మాటలు వాతపెట్టి వెన్న రాస్తున్నట్లయింది.

చుట్టూవున్న జనం చూపులు బాణాల్లా గుండెను తాకేయి.

కత్తుల బోనులో నుల్చోబెట్టి ఆకలిగొన్న పులిని మీదకు వదిలినట్లుగావుంది. శరీరంమీద సరదాగా బ్లేడుతో కోస్తూ కారం జల్లుతున్నట్లయింది.

ఇబ్బందిగా నవ్వేరు నాయుడుగారు. మొహకవళికలు గబగబా మారిపోయేయి. శరీరం కంపించిపోయింది. గుండె పగిలిపోయింది. నరాలు చీల్చుకొని రక్తం ఎగజిమ్మింది.

అప్రయత్నంగా జేబులో పర్సు చేతిలోకి వచ్చింది. అందులో నోట్లు ఆయన ప్రమేయం లేకుండా జోలెలోకి జారేయి.

"మీరు సేత్తున్న సహాయం మర్చిపోలేంది. మీరు కూడా దగ్గరుండి ఈ పున్నెకార్యం జరిపించాల..." అని మరో మారు అన్నారు.

"జై ...భజనానంద బాబాకీ.." అని రాజుగారు అనంగానే వంత పాడేరు అక్కడున్న అందరూ.

అందరూ వింతగా చూసేరు నాయుడు గార్ని.

రాజుగారు కొట్టిన దెబ్బకి బొబ్బ కట్టింది.

అలనాడు సుయోధనుడు అవమాన భారంతో భూమికి రంధ్రం లేదేం అని వాపోతే-నాయుడు గారికి వాళ్లు వెళ్ళేదారి శ్మశానం అయిపోయి వాళ్లంతా శవాలుగా మారిపోతే బాగుండుననిపించింది.

సలసల కాగే నూనెబాండీలో మరిగిపోయినా అంత బాధ అన్పించేది కాదు నాయుడు గారికి. రాజకీయాల్లో ఇలాటి దురవస్థలు ఎదుర్కోవలసి వస్తుందని ఎన్నడూ వూహించలేదాయన.

చందాల వూరేగింపు దాటిపోయింది. వాళ్ల అడుగులు రేపిన దుమ్ము నాయుడు గారి కళ్లకి తెరలా అడ్డుపడింది. వాళ్ళ కేరింతలు చెవిలో మార్మోగేయి.

చేతిలో ఆరిపోయిన చుట్ట నేలను తాకింది.

శవం కాలకముందే కట్టెలు సర్దుకునే వాడిలా చూస్తున్నాడు లింగం.



తన ముందున్న హుండీ డబ్బా, మూటలు కట్టిన చిల్లర, కట్టలు కట్టిన కరెన్సీలు చూడంగానే భజనానంద బాబా సంబరపడ్డాడు. ప్రజల్లో దేవుడిమీదున్న అచంచలమైన నమ్మకాన్ని తల్చుకొని ముచ్చట పడ్డారు. నాస్తికత్వం పెరిగిపోయి దేశం సర్వనాశనం కాకుండా కాపాడ్డమే ధ్యేయంగా పెట్టుకొన్న బాబాగారు ప్రయాసపడి అంత దూరంనుంచి వచ్చినందుకు ఫలితం కళ్ళముందు కన్పిస్తుంటే మహదానంద పడ్డారు.

ఆ ఆనందాన్ని రాజుగారు తదితరులు కూడా సమానంగా పంచుకొన్నారు.

మరుసటిరోజు పుదియమే మంచి రోజని కొత్త దేవాలయానికి శంకుస్థాపనకు ముహూర్తం నిర్ణయించేరు బాబా

గారు.

అందరూ ముహూర్తం వేళకు పుణ్య స్థలం వద్దకు రావాలని విజ్ఞప్తి చేసేరు. రాజుగారు దండోరా వేయించేరు.

మర్నాడు ఉదయం మామూలుగా కొరడా దెబ్బల్లా చుర్రుమంటూ వాడి వేడి కిరణాలు వూళ్ళోకి రాలేదు. చాలా రోజుల తర్వాత అంతా చల్లగా వుండటం వింతగా తోచింది.

ఆకాశం అంతా మబ్బుల మరకల్తో వుంది.

"ఇదంతా బాబావారి మహత్తు! గుడికి శంకుస్థాపన అనడం ఏవిటి మబ్బులు కమ్మడం ఏవిటి? ఇక వర్షాలు రావడం ఖాయం. బాబావారి రాకతో మన కష్టాలు తీరిపోతున్నాయి. వార్ని ఈ వూరికి తీసుకొచ్చిన రాజుగారికి ఎన్ని జన్మలు సేవ చేసినా ఋణం తీరదు" అని అను కోనివాళ్లు కద్దు.

'ఇదంతా దేవుడి మహత్యం' అన్నారు.

'బాబావారి పాదం ఆ గడ్డమీద పడటం నిజంగా పూర్వజన్మ సుకృతం' అన్నారు.

'ప్రజలకోసం రాజుగారు పడ్తున్న శ్రమ చెప్పలేంది' అన్నారు.

అన్ని కులాలజనం బాబావారికి, రాజు గారికి నీరాజనం పడుతూ తండోపతండా లుగా నేరేడు చెట్టుదగ్గరకి చేరిపోయేరు.

వాళ్ళ ఆనందం అంతా ఇంతా కాదు. వాళ్ళ కళ్ళల్లో ఆశల మెరుపులు.

ఉదయపు చల్లదనాన్ని చీలుస్తూ మంగళ వాయిద్యాలు.

రథోత్సవంలా ప్రజల మధ్యనుంచీ కుదుపు కూడా లేకుండా బాబా వారి పల్లకి... వుదయపు ఎండతో స్నానం చేసిన కాషాయి రంగు కమలంలా పల్లకీలో బాబావారు...

ఊరు పెద్దలు పట్టు వస్త్రాలు ధరించేరు. ఎవరి నుదుట చూసినా విభూతి రేఖలే!

రాజుగారి దంపతులు ఎదురెళ్ళి స్వాగతం పలికేరు.

పూజా స్థలికి చేరేరు బాబావారు – శిష్యులతో సహా!

మెకుల్లో మంత్రోచ్ఛారణ శ్రావ్యంగా గాల్లో కలుస్తోంది..

బాబావారు పీఠం మీద బంగారు విగ్రహంలా వున్నారు. ఆయన చుట్టూ శిష్యులు మంటప స్థంభాల్లా వున్నారు.

జరుగుతున్న తంతుని శ్రద్ధగా ఆల కిస్తున్నారు.

ఏడు రాళ్ళను కడిగి శుభ్రం చేసి బొట్టుపెట్టి సిద్ధంచేసేరు.

స్వయంగా బాబావారు నవగ్రహ పూజా కార్యక్రమాన్ని నిర్వర్తించేరు.

నవధాన్యాలూ వుంచేరు – పంచ లోహాలూ వుంచేరు.

ఏడురాళ్ళు వాటిపై వుంచి కొత్త దేవాలయానికి పునాది వేసేరు.

పట్నం ఫొటోగ్రాఫరు బొమ్మలు నొక్కేడు....

గంటకు పైగా జరిగిన తంతుకి అందరూ ఆనందంగా బాబాగారికి కృతజ్ఞ తలు తెల్పుకొన్నారు. 'అంతటి మహాను భావుడు' స్వహస్తాలతో శంకుస్థాపన చెయ్యడం ఊరు చేసుకొన్న పుణ్యం అన్నారు.

'కొత్త దేవాలయంలో పాత దేవుడెం దుకు? బాబాగార్నే ప్రతిష్ఠిస్తే బాగుం టుంది కదా?', అన్న ఐడియా కొందరు కుర్రకారుకు వచ్చినా ఎవరి ముందు వుంచాలో తెలీక ఇబ్బంది పడ్డారు.

ఆ క్షణం నుంచే నూత్న దేవాలయ

నిర్మాణ కార్యక్రమం ఆరంభమైంది. అదే సమయంలో ఆకాశం నాలుగు వర్షపు చుక్కలు రాల్చింది.

కొండలు పేలేలా, గొంతుకలు చిరిగేలా బాబావారి పేరు మార్మోగింది.

గుళ్ళో దేవుడు బెంబేలు పడ్డాడు. తన భవిష్యత్తు తెలీక భయపడ్డాడు.

ఎటూ కొత్తదేవాలయం నిర్మిస్తున్నాం కనుక పాతదేవాలయం స్థానంలో పెద్ద నీటిబావి నిర్మిద్దామన్న రాజుగారి నిర్ణయానికి అందరూ ఆమోద ముద్ర వేసేరు.

ఇటు నిర్మాణం అటు నిర్మూలనం ఒకే రోజున జరిగేయి.

బాబావారి స్వహస్తాలతో శివలింగం తొలగించేరు.

ఈ రెండు తంతులు కేవలం వారం లోగా జరిగిపోవాలని బాబావారు ఆదేశించారు.

రేయనక పగలనక కష్టపడ్డానికి నిర్ణయించుకొన్నారు.

ఎన్నికలు కేవలం రెండు వారాల్లోనే అన్న విషయం రాజుగారు చెప్పకపోయినా గోడలమీద రాతలు గుర్తు చేస్తున్నాయి.

రాజుగారి పార్టీ మళ్ళీ అధికారం చేజిక్కించుకోవడం ఖాయం. అందులో ఈషణ్మాత్రం కూడా అనుమానం లేదు.

రాజుగారి పార్టీ మెంబర్లు, కార్యకర్తలు కూడా వంటినిండా విభూతి, రుద్రాక్ష మాలలు, పట్టు వస్త్రాలతో తిరుగుతున్నారు.

ఎన్నికల గురించి పొరపాటున కూడా ప్రస్తావించడం లేదు. బాబావారి మహత్యాలు, నూత్న దేవాలయం నిర్మాణం, సుసంపన్నం కాబోయే వూరు గురించి తప్ప మరో మాటలేదు.

వూరు బాగుకోసం కావటంతో కూలీ అడక్కుండా కష్టపడి పన్జేస్తున్నవాళ్ళకు తిండి తిప్పలు ఎరేంజి చేస్తున్నారు. కేవలం ఒకమాట మీద యావత్తూ జనం కలసి పన్జేయడం ఆ ఊరి చరిత్రలో అది ప్రథమం కావచ్చు.

ఈ సంబరాన్ని చూసి ఆనందిచని వాళ్ళు ఆ వూళ్ళో నాయుడుగారూ, ఆయన అంతరంగికులూ మాత్రమే.

* * *

"ఇల్లిదొక్కటే మార్గం. ఆనక మీ ఇష్టం" లింగం తన నిశ్చయం వెలిబుచ్చేడు.

సూరి, నాయుడు ఆలోచన్లో పడక తప్పలేదు. ఎన్ని రకాలుగా ఆలోచించి చూసినా మరో మార్గం కనబడలేదు. ప్రస్తుత పరిస్థితుల్లో లింగం చెప్పిన సలహా ఒక్కటే అనుసరించ తగిందిగా తోచింది.

చుట్టల్తోపాటు బుర్రలు కూడా బాగా కాలిం తర్వాత-

"పెజల్తో పోయేవాడే నాయకుడు. లింగం నువ్వు సెప్పిందే మంచిదయ్యా! అలగే సేద్దాం" అన్నారు నాయుడుగారు.

లింగానికి మహదానందం అయింది. ఇంత కాలానికి నాయుడుగారు తను చెప్పిన మాటకు విలువ నిచ్చినందుకు.

"మనల్ని సూసి రాజుగాడికి మతి సెడిపోద్ది. పెజల్ని మన ఏపు నాక్కోనీకి ఇదే సక్కటి దారి" - సూరి ఆమోద ముద్ర వేసేడు.

ఆ తర్వాత ఎలా దెబ్బతీయాలో చర్చించేరు.

"పొద్దుగాలే వచ్చేయండి. అలిసెం అయ్యిందని కతలు మాత్తరం సెప్పొద్దు. కుసంత కట్టమైనా బేగొచ్చేయండి."

నాయుడుగారి దగ్గర సెలవు తీసుకుని

ఇంటి దారి పట్టేరు లింగం, సూరి.

* * *

పూజారిగారిల్లు సూర్యుడికన్నా ముందే మేల్కొంది.

తడి గుడ్డలు హడావిడిలో వున్నాయి. భక్తులు చేరే సమయం ఆసన్నమైనకొద్దీ ఆతృత, ఆందోళన. పూజా కార్యక్రమాలకి, భజనకు ఏర్పాట్ల హడావిడిలో గందరగోళం అయిపోతున్నారు.

వెలుగు వూళ్ళోకి వచ్చేసరికి పూజారి గారింటికి భక్తుల రాక ప్రారంభమైంది. వచ్చిన వాళ్ళు బాబావారికి నమస్కరించి మౌనంగా కూర్చుంటున్నారు. తెచ్చిన ఫలపుష్పాదులు శిష్యులకు అందిస్తున్నారు.

రాజుగారు గబగబా వచ్చేసేరు.

క్షణాలు గడుస్తున్నకొద్దీ భక్తులరాక పెరిగింది.

ఎండ పూర్తిగా వూర్ని పరుచుకుంది.

బాబావారు భగవన్నామస్మరణలో మునిగిపోయున్నారు. భజన కార్యక్రమానికి సర్వం సిద్ధంచేసేరు. ప్రసాదం కోసం అరటి పళ్ళు ముక్కలుగా చేసి పళ్ళెంలో వుంచేరు. అగరవత్తుల పొగ ఇంట్లో అల్లుకు పోయింది.

మరో క్షణంలో భజన ప్రారంభం అవబోతుండగా—

పట్టు వస్త్రాలతో, నుదిటిన పెద్ద కుంకుమ బొట్టుతో వస్తున్న నాయుడు గారికి లోపలికి దారిచ్చేరు. కళ్ళు మూసుకొని మౌనంగా వున్న చాలామంది కళ్ళు తెరిచి విస్తుపోయేరు!

నాయుడుగారి రాక అందరి ఏకాగ్రతని చెడగొట్టింది.

నిశ్శబ్దంగా నాయుడుగారి గురించి చెప్పుకున్నారు.

భక్తుల మాటలను పట్టించుకోని దేవుడిలా నాయుడుగారు బాబావారికి కొంచెం దగ్గరగా ఆసీనులయ్యేరు. అభ్యంతరం చెప్పలేదు ఎవ్వరూ!

తననే కరవబోయిన పామును చూసిన శివుడిలా నాయుణ్ని చూసి జనం కోసం పలకరింపుగా నవ్వేరు బాబాగారు.

భజన కార్యక్రమం మొదలైంది.

శ్రావ్యంగా వినిపిస్తున్న కంఠాల ధ్వని వూళ్ళో ప్రతిధ్వనిస్తోంది.

క్షణక్షణానికి ఆవేశం పెరిగిపోతోంది. తన్మయత్వంలో కొందరు లేచి నృత్యం కూడా చేస్తున్నారు.

నాయుడుగారు అందరితో పాటు పెదిమలు ఆడించేరు.

నాయుడికి అంత భక్తి ఎందుకు కలిగిందో, దాని వెనుక గల రాజకీయ ఎత్తుగడ ఏమిటో అర్థంకాక రాజుగారు అల్లల్లాడిపోయేరు. భజన కార్యక్రమం ఎప్పుడు పూర్తవుతుందోనన్న ఆతృత అధికమైంది. ప్రతిరోజూ నాయుడు గనుక ఇలా ప్రార్థనలకీ, భజనలకీ వస్తే జనం అందరికీ సానుభూతి కల్గుతుంది. దాన్ని ఆసరాగా తీసుకొని తనకి ఎదురు దెబ్బ కొట్టడం ఖాయం.

తనలోతాను మధనపడుతున్న రాజుగారికి భజన కార్యక్రమం ముగిసిందని తెలియలేదు. కళ్ళు తెరవకుండా వున్న రాజుగార్ని చూసి భక్తులు ముచ్చట పడ్డారు.

కొద్ది క్షణాల తర్వాత లోకంలోకి బలవంతంగా రాక తప్పింది కాదు. ఉదయం పూట కార్యక్రమం పూర్తి కావటంతో ప్రసాదం అందుకొని భక్తులు బయట పడుతున్నారు.

నాయుడుగారు వీధిలో చుట్టూ మూగిన

జనంతో ముచ్చట్లతో వున్నారు. కొత్త దేవాలయం గురించి తన అభిప్రాయాలను వెల్లడించేరు. బాబా వారి శిలా విగ్రహాన్ని కూడా గుడిముందే ప్రతిష్టిస్తే బాగుంటుందని, దాని ఖర్చంతా తను భరిస్తానని ప్రజల్తో అన్నారు. అందుకు జనం సంబరపడ్డారు.

బాబావారి సన్నిధిలో వున్న రాజు గారి దృష్టి మాత్రం రోడ్డు మీదే వుంది.

అందరూ వెళ్ళిం తర్వాత రాజుగారు బాబాగారితో ప్రపంచం గురించి ముచ్చటించేరు.

* * *

పులి గాండ్రింపు విన్నట్లుఅదిరిపడ్డారు ముగ్గురూ.

కలలో దెయ్యం కన్పిస్తే గబుక్కున మెలుకువ వచ్చినట్లు పిచ్చిగా చూస్తున్నారు రాజుగారు.

రాజుగారి ప్రవర్తన ఆశ్చర్యం కల్గించినా అది సహజం అన్పించి మందు చుక్కలు గొంతులోనికి జార్చేరు.

"పీడకల గాని ఎలుపొచ్చిందేటి ?" మునసబుగారు అడిగేరు.

రాజుగారు వులుకు పలుకు లేకుండా చీకటికేసి చూస్తున్నారు. ఆయన్ని పట్టి పీడిస్తున్న సమస్యను అర్థం చేసుకున్నారు కరణంగారు. బాంబురాజు ఏం పట్టనట్టు గ్లాసులో మందు ఖాళీ చెయ్యడంలో నిమగ్నమైనాడు.

"పిందెగా వున్నపుడే సిదిమెయ్యాలి. నేకుంటే సేనా సిక్కులొత్తాయి" రాజుగారు గట్టిగానే అన్నారు.

"అంత కంగారై పోవాల్సిన పనేటి?" మునసబు.

"నీకు ఆడిసంగతి పూరిగా తెలవదు. తొలిసారి వచ్చినాడో నేడో బాబావారి శిలా విగ్రహం అని సెప్పి రేపెట్టినాడు. కాదంతే మనకి సెడ్డపేరు. ఇలగే న్నాలోజులుంటే మనకి సోటునేకుండా సేత్తాడు"

"అది నిజమే అనుకోండి. అతగాడ్ని రాకుండా అడ్డు పెట్టలేం. అదే జరిగితే మన శ్రమంతావృథాయేకదా!"— కరణం గారు.

"ఈడితో మానావు సిక్కొచ్చి పడిపోనాది" మునసబు అసహాయంగా అన్నాడు.

'ఏటి సేత్తే నాయుడుగాడు ఆడకి రాకుండా వుంటాడు?' అన్నది సమాధానం దొరకని ప్రశ్న.

మందు హరించుకుపోతోంది. మెదడుకి పదును పెట్టడంలో నిమగ్నమై వుండగా..

"పోనీ బాబాగార్నే పూర్నించి పంపించేత్తే?" రాజుగారి బుర్రలో మెరిసిన మెరుపును బయటకు లాగేరు.

తాగిన మందు గబుక్కున బయట కొచ్చింది ముగ్గురికీ!

నోట మాట రాక ఆశ్చర్యాన్ని చూపుల్తో చెప్పేరు.

"అందువల్ల మనకొచ్చే లాభం?" కరణంగారి అనుమానం.

"ఆయనెల్లిపోతే ఆడు కిల్సి పన్లేయాల్సింది మనతోటి. అందు సేత రాడు. మరిక జనంలోకి పోనేడు" రాజుగారి పథకం చెప్పేరు.

"బాగానే వుంది. మరి పెజలకేటి సెప్పాలి?"

"అది పెద్ద కట్టపేటి! అయిదరాబాదులో పెద్ద మంత్రిగారింట్లో పెద్ద పూజ సేయించనీకి కబురొచ్చినాది. అది సూసుకొని పారొత్తారని పెచారం

స్దారి" బాంబురాజు నోరు మెదిపేడు.

"అమ్మ నీయమ్మ! నీకూ బుర్ర పన్జే స్తోంది. సెబాస్" అని మెచ్చుకోలుగా బాంబురాజుకి మరో చుక్క ఎక్కువ పోసేరు రాజుగారు.

"మనం తెలివితక్కువోల్లం అను కుంతున్నాడు గావోసు నాయుడుగాడు. ఇక మనజోలికి రాడు" ఆనందంగా అన్నాడు మునసబు.

"ఎలా చేసినా, ఏం చేసినా జనం మాత్రం పసిగట్టకూడదు. జాగ్రత్తగా జరిగేలా చూడు బాంబురాజూ!" కరణం గారు హెచ్చరించేరు.

"అదికాదు బావూ! వారం రోజుల్లో పడిపోనాదిగదా గుల్లో దేవుడ్ని కూకో బెట్టడం... మరి ఈ వారం రోజులూ జనాన్ని కాసుకోవాల."

"అదేం బాదనేదు. రోజూ బాబావారి భజన, పూజలు ఆరిపేర్న జరిపించే త్తుంటాం. ఆరి మాయలు పెచారంసేత్తూ వూదరగొట్టేత్తాం"

రాజుగారి మేడ మీద చీకటిగాల్లో మంచూ, నవ్వులూ కల్సిపోతున్నాయి.

* * *

రాత్రనక పగలనక అలసట మర్చి పోయి తిండీ తిప్పలు లేకుండా అందరూ కల్సి పన్జేసిన కృషికి ఫలితం దక్కింది.

మంటపం, గర్భాలయం పూర్తి చేసేరు.

గుడికి రావటానికి దారి కూడా శుభ్రం చేసేరు.

దేవాలయంచుట్టూ అందాకా కంచెతో దడికట్టేరు. చూడంగానే అది గుడని, అందులో దేవుడు కొలువై వుంటాడని మొహమాటం లేకుండా చెప్పొచ్చు.

బాబావారు శిష్యులతోసహా వచ్చి చూసేరు. రాజుగారి కృషి అందరి సమ క్షంలో మెచ్చుకున్నారు.

మరోవారం రోజుల్లో ఎన్నికలు. అంతకు ఒక రోజు ముందుగా నూత్న దేవాలయంలో విగ్రహ ప్రతిష్ఠ.

కానీ అందరూ బాధపడ్డది మాత్రం ఒక్కందుకే !

బాబావారు అత్యవసరంగా పెద్ద మంత్రిగారు తలపెట్టిన యజ్ఞం జరిపించ డానికి బయల్దేరి వెళ్తున్నారన్న వార్త కారుచిచ్చులా వ్యాపించింది. విగ్రహ ప్రతిష్ఠకు ముందే ఆయన వెళ్ళడం భక్త కోటిని కలవర పర్చింది. ఆ వార్తకు తల్లడిల్లిపోయేరు.

పెద్దా చిన్నా అనకుండా అందరూ బాబావార్ని వూళ్ళో వుండమని, విగ్రహ ప్రతిష్ఠ స్వహస్తాలతో జరపవల్సిందిగా ప్రార్థించేరు.

ప్రజల భక్తికి మురిసిపోయేరు బాబా వారు, ఆయన శిష్యులు.

"దేవుని దృష్టిలో అందరూ సమానం. మంచి మనసున్న ప్రతి జీవి దేవుడుతో సమానం''— అని బాబావారు అందరికీ నచ్చచెప్పేరు.

మరీ అంతగా మొహమాట పెట్టడం మంచిది కాదని, ప్రత్యక్షంగా వారు లేక పోయినా వారి ఆశీర్వచనం మనకెపుడూ వుంటుంది అన్న ధీమా, సంతృప్తి కల్గిం చింది భక్తకోటికి.

జీపును పూలతో అలంకరించేరు.

ఊరంతా రచ్చబండ దగ్గరకు చేరింది.

పిల్లా పాపా ఎవ్వరూ ఉలుకు పలుకు లేకుండా చూస్తున్నారు.

నిశ్శబ్దంలో మేళతాళాల హోరు ఘనీభ విస్తోంది.

అప్పగింతలైన పెళ్ళికూతుర్లా కదిలి



వస్తోంది పల్లకి.

బాబావారు అందర్నీ ఆశీర్వదిస్తున్నారు.

పల్లకి ముందు నడుస్తున్నారు పూజరిగారు.

పల్లకి జీపుదగ్గర ఆగింది.

"భజనానంద బాబాకీ."

"జై.. జై.."

నిశ్శబ్దాన్ని చెదరకొట్టినాయి గాద్గదిక కంఠాలు.

భక్తుల భుజాల మీదనుంచి అలంకరించిన జీపులోకి చేరేరు బాబావారు.

అందర్నీ ఆఖరుసారిగా ఆశీర్వదించేరు.

"మీరు చూపించిన ప్రేమకు కృతజ్ఞుడ్ని. మీరు సుఖశాంతులతో భగవన్నామ స్మరణలో హాయిగా కలకాలం బతకండి. దేవుడికి మీరు దూరమైననాడు మిమ్మల్ని మీరు దూరం చేసుకొన్నట్లే! ఎన్ని కష్టాలొచ్చినా దేవుడిమీద భారం వెయ్యండి. మీ బాగోగులు ఆయనే చూసుకుంటాడు" అని బాబావారు గాల్లో చెయ్యి తిప్పి విభూతి సృష్టించి గాల్లో ఎగరేసేరు.

"ఇక మసూరికి ఏటి బయ్యనేదు"–

అని తృప్తిచెందేరు జనం.

జీపు కదిలింది.

జయజయధ్వానాలు మా ర్మోగుతున్నాయి.

వూరు పొలిమేరలదాకా అందరూ జీపు వెనక నడిచేరు.

కదిలొచ్చిన వూరికి వీడ్కోలు ఇచ్చింది జీపు,

కనుమరుగయ్యేదాకా అందరూ దిగులుగా, బెంగగా చూస్తున్నారు.

* * *

''ఈ పాటికి బాబాగారు అయిద్రాబాదు సేరుకొని వుంటారు''— రాజుగారు అన్నారు.

''సిత్తం. నానూ రేపెల్దారనుకుంతున్నాను''— నసిగేడు బాంబురాజు.

''నాల్రోజుల్లో దేవుడ్ని గుడిమార్చాలి. ఈలోపట నీకు తొందరేటి?''

''ఎల్లి సాల్రోజులైపోనాది. పన్లు..''

"నాకు తెల్దేటి నీ పొన్లు. బాబాగారికి నెక్క ఇచ్చేనావా..?"

"మీ ముందరే ఇచ్చేను గదండి."

"నీ మేలు ఏ జనమకీ మర్సిపోలేను. జనంకి దేవుడంటే ఎంతపిచ్చి. నీ బుర్ర డిల్లీలో వుండాల్సింది."

"ఏదో తమరిగోరి దయ."

"ఎలక్సన్లవ్వంగానే రోడ్డు కాంటాక్టు పారేతాను. ఈ అయిదరాబాదు యాత్రలు మానేసి సుబ్రంగా నాలుగు రాళ్ళు బేంకీలో ఏసుకో. నాయుడుగారు మూర్చెనుంచి లెగిసినారా?"

"ఇక నెగటం నేదు. పాపం సేనా కర్సు పెట్టినాడు.."

"నేకపోతే మన్తోటి రాజకీయాలేటి. అవుసరం అయితే కొండమీద దేవుడ్ని గూడా నాక్కొచ్చి పెచేరంలో ఎట్టమా?''

"అందులో డౌటేటి బావూ!''

''ఈ నాల్రోజులు గుడికాడే వుండి. ఇంకెల్లు.''

"సిత్తం. మరి సెలవా బావూ''— అంటూ హుషారుగా వెళ్ళేడు బాంబురాజు.

మిగతా బృందంతోపాటు మందులోకి దూకేరు రాజుగారు. ఆయనకిప్పుడు ఏ బాధాలేదు, సమస్యాలేదు.

వజ్రాన్ని వజ్రంతో కోయాలి అని చిన్నప్పటినుంచీ రాజుగారికి తెల్సు. పోలీసు దెబ్బల్లా కనబడకుండా ఆయన కొట్టిన దెబ్బలనుంచి మరెవ్వరూ తప్పించుకోలేరని గట్టిగా చెప్పొచ్చు.

ఎప్పుడూ దేవుడికి కొబ్బరికాయ కొట్టే భక్తుల నెత్తిన దేవుడే ఓ కొబ్బరికాయ కొ ట్టే!

* * *

ప్రజా ప్రభుత్వాన్ని ఎన్నుకోడానికి గడువు కేవలం ఐదురోజులు మాత్రమే.

జీపులు అలసి పోయేయి —

సారాపీపాలు తరిగి పోయేయి—

వూపుగోడలు నిండిపోయేయి—

నాయకులకు నిద్రలేదు — ఓటర్లకు బుర్ర పన్లేయటం లేదు.

కొత్త దేవాలయంలో విగ్రహ ప్రతిష్ఠకు మధ్యలో ఒక్కరోజు మాత్రమే గడువు!

కుమిలి పల్లిలో జరుగుతున్న తంతుకి పత్రికలు ప్రాముఖ్యతనిచ్చేయి. జిల్లా మొత్తంలో అంత హడావిడిగా వున్న వూరు మరొకటి లేదు.

రాజుగారికి ఎన్నికలంటే ఏమాత్రం బెంగాలేదు.

ఆయన వర్గం గెలవటం ఖాయం. సెంద్రరావ్ నాయుడు ఓడిపోవటం నిజం అని స్పష్టంగా అందరికీ తెల్సు. అలాగని

నాయుడుగారు ప్రయత్నాలు విరమించనూ లేదు.

మనిషి ఆశాజీవి. రాజకీయాల్లో మార్పులు చిత్రంగా వుంటాయి. రాత్రికి రాత్రి జనంలో మార్పు రావటం ఎన్నికల్లో ఆనవాయితీ. రాజకీయాల్లో ముఖ్యంగా కావల్సింది సహనం – అని నాయుడుగారికి బాగా తెల్సు. అందుకే నమ్మకం చంపుకోలేదు. ఆయన వర్గం మాత్రం ఆశను దారుణంగా చంపేసుకొన్నారు. ఏ దిక్కూ తోచక త్రిశంకు స్వర్గంలో నలిగి పోతున్నారు.

దిక్కూ మొక్కూలేని దేవుడు ఇంత దెబ్బకొడ్తాడని ముందే తెలిస్తే అతగాణ్ని ఎన్నడో తమ పార్టీలోకి లాక్కునేవారే!

ప్రజల నాడి బాగా తెల్సికూడా తను ఎలా విఫలం చెందేడో నాయుడుగారికి ఏ మాత్రం బోధపడలేదు.

తన వాళ్లల్లో వుత్సాహం చచ్చిపోయింది.

ఏది చేసినా బెడిసి కొడ్తోంది. నిద్రాహారాలు మర్చిపోయేరు నాయుడుగారు ఎంత మందు కొట్టినా వుపశాంతి కల్గటం లేదు. నిజానికి వూర్ని తగలపెట్టేద్దామన్నంత కోపంగా వుంది. అంతపనిచేస్తే ఓటర్లు మిగలరన్న బెంగవల్ల అంత దారుణానికి వొడికట్టలేదు.

కంటి మీద కునుకులేని నాయుడుగారు అలసటగా, అసహనంగా వున్న సమయంలో కనురెప్పలు మూసుకోబోయేయి. సరిగ్గా అపుడే దేవుడు దర్జాగా కళ్ళముందు మెదిలేడు. దడుక్కున లేచి కూర్చున్నారు నాయుడుగారు.

చీకటి చీల్తున్నట్లుగా నవ్వేరు నాయుడుగారు!

ఆయన మొహం మీద వెయ్యిమంది చంద్రుళ్లు వుదయించేరు..

కళ్ళ ముందు దేవుడు చీకట్లో కల్సిపోయేడు.

అందరూ దేవుడు పేరు చెప్పి పలుకుబడి పెంచుకుంటున్నారు. కానీ నిజంగా దేవాలయం కోసం కష్టపడుతున్నదెవరు? కాలే కడుపు చేత్తో పట్టుకుని కూలీ నాలీ అడక్కుండా శ్రమదానం చేస్తున్న దెవరు? దేవాలయం పూర్తయింతర్వాత ఈ కష్టపడేవాళ్ళని కనీసం గుడిలో పలకి రానివ్వరు గదా!

మరో మారు కొండలు దొర్లుతున్నట్లు నవ్వేరు.

కుర్చీల్లో కునుకేస్తున్న శిష్యులకి నాయుడుగారి వింత ప్రవర్తన చూసి మతిభ్రమించిందేమోనన్న అనుమానం వచ్చింది. బిక్కమొహం వేసి వెర్రిగా ఆయనకేసి చూసేరు.

"సూరీ! మనం గెలవటం కాయం.." నవ్వుతూనే అన్నారు నాయుడుగారు.

అందరూ ఒకళ్ళ మొహాలు ఒకళ్లు చూసుకొన్నారు.

'గాలి కమ్మేసినాది' అన్న నిర్ధారణకు వెంటనే వచ్చేరు.

"ఈసార్తో రాజుగాడు బంజరు పాలు కాక తప్పదు" వుత్సాహంగా అన్నారు నాయుడుగారు.

–అని, చలనం లేని శిష్యుల్ని ఓసారి వింతగా చూసేరు.

"ఏటి నాగ్గాని మతోయిందని బెమిసేరేటి?!" అన్నారు నాయుడుగారు. ఇబ్బందిగా నవ్వేరు శిష్యులు.

"రాజకీయాల్లో నీరసం పనికిరాదు. ఎన్ని ఎదవ పన్లేనా సెయ్యాలి. ఏటి సెయ్యకుండా కుర్చీ ఎక్కేద్దామంటే కుదర్దు. కుసింత కట్టపడ్తే మళ్ళీ ఐదేల్లు

దాకా బాదుండదు. ఏడుకొండలెక్కి ముడుపుకడ్తే దేవుడ్ని ఎవరేనా సూడొచ్చు కానీ పదవి అలాటిదిగాదు. శరీరంతో డైరెక్టుగా సొరగం సేరటం లాంటిది. మర లాటి సేన్సు కావాలంటే కుసింత కష్ట పడాలి" – అని హుషారుగా లేచేరు నాయుడుగారు.

విషయం అర్థంకాకపోయినా అందరూ ఓపిక తెచ్చుకొని నవ్వేరు.

రేకు డబ్బాలో రాళ్ళ గిలకరింపులా తెరలు తెరలుగా నవ్వులు చెదిరిపోతు న్నాయి.

* * *

"రెడ్డిగారు తమర్ని కల్సుకోనీకి ఎలు పొస్తానని సెప్పమన్నారండి" -బాంబు రాజు వినయంగా చెప్పేడు.

'ఎందుకేటి?' – అని రాజుగారు అన్లేదు.

"పొజిసను ఎలగుందని అడిగినారండి. సెప్పేసు –" మళ్ళీ బాంబురాజే!

"ఆయన పొజిసను ఎలగుందట" – రాజుగారు ఎదురు ప్రశ్న.

"డోకా నేదటండి. అనుకున్న పెకారం అందరూగాని వచ్చేత్తే మరి అపోజిసను కూడా వుండదటండి. బాబు గురించి హయిదరాబాదు నుంచి మంత్రులు కూడా పారొచ్చేనారటండి. అల్లమందు కరుసంతా మన ఎలక్సన్ మొత్తం కర్సునేదండి. ఎంత సెడ్డా పెద్దోల్లందరూ అల్ల కులపాల్లే కదండి. మరి సీకేటి సింతేటి?"

"ఆయన మాకాని మడిసి. సొంత సవుసు వదలకుండా పిజీగా కుర్సీలో కుసుంటాడు. ఎన్ని పార్టీలు మారినాడు. చు..చు.. పదవి నేకుండా మాత్తరం నిద్రపోడు. ఆరిది ఈ దేసం బుర్రగాదు. దొరల దేసంలో వుండాల్సినోడు."

"ఆ దేసాల్లో కూడా ఇలగే పార్టీలు మార్సేత్తారేటండి?"

"సిగ్గు వొగ్గేత్తే ఏ దేసమైనా ఇదానం ఒకటే! పెద్దలెలగపోతే మన్దీ అదేదారి. అయినా రాజకీయాల్లో పడ్డతరవాత పార్టీ మారడం అనేది మాసిన సొక్కా ఇప్పేసి కొత్త సొక్కా ఏసుకోటం నాటిది. పెజలూ పట్టించుకోరు. ఇక మన సంగతి వొగ్గెయ్యి."

"దేవుడు అవుతారాలె త్తినట్టే!"

"ఈ వూసులకేటిగాని ఏర్పాట్ల సంగతేటి సేసేవు? వూరేగింపుకి పెజలు బాగా రావాల. దేవుడ్ని కూకోబెట్టడానికి పంతులందరూ వచ్చేసినట్టేనా?!"

"మీరు బెంగెట్టుకోకండి. అన్నిటికీ నేనున్నాగా బావూ."

"సెంద్రరావ్‌గాడు, ఆడి మడుసులు పోటీ నుంచిగాని తప్పుకొన్నరేటి. బొత్తిగా పాపం ఆపట్టంనేదు" – అది దరహాసం!

"పెజలకి మొకం సూపించనేక పోతున్నారు."

"పంతుల్లకి పంచెలసాఫులు మర్సిపోకండి. అందర్నీ పేరు పేరునా పిలవండి. నేకుంటే కోపాలొత్తాయి. సరదా గుంటది నాయుడుగాడ్ని పెత్యేకంగా పిలవండి."

"సిత్తం. మరి నాకు సెలవాండి?"

"ఎల్లు. సొల్లుసెప్తూ పన్లు ఎనక్కి నెట్టకు. అర్థమైందా?!"

"అలాగేనండి."

"ఈ సిల్లరుంచు. ఏటేనా అవుసరం పడద్దేమో!"

డబ్బు అందుకొన్నాడు బాంబురాజు.

రాజుగారు మీసం మొలిక సరిగ్గా వుందోలేదో చూసుకుంటూ వుండగా బాంబురాజు బయటపడ్డాడు.

బాంబురాజు అడుగులు వేగంగా కరణంగారి ఇంటివైపు మళ్ళాయి.




మాలపల్లిలో చీకటి మరింత నల్లగా వుంది.

గుడిసెల్లో గుడ్డి దీపాలు వుబ్బస రోగిలా ఆయాస పడుతున్నాయి.

నులక మంచాల్లో చుట్టలు ఆకాశాన్ని చూస్తున్నాయి.

కడుపునిండా తాగొచ్చిన మొగుడు పెళ్ళాన్ని చితగొడ్తున్నట్లున్నాడు...ఏడుపులు, కేకలు. అలవాటయిన సంత కాబట్టి పెద్దగా ఎవరూ పట్టించుకోవటం లేదు. బ్రహ్మంగారి తత్వాలు గొంతుక జీరల్లో అసహ్యంగా నలిగిపోతున్నాయి.

ఆ సమయంలో భయానక చిత్రాల్లో హంతకుల్లా అటువచ్చిన వారందరూ ఓ పాక దగ్గర ఆగిపోయేరు.

ఆ పర్ణశాలలోని మునీశ్వరుడు యజమానిని చూసిన కుక్కలాగా గాబరాపడి లేచి నుల్చున్నాడు.

ఆ పరమాత్ముడే ప్రత్యక్షంగా వచ్చి నిల్చున్నా అంతగా ఆశ్చర్యపోనివాడిలా హడలిపోతూ–

"తమరుగోరే సాచ్చాత్తు ఎలుపొచ్చీనారు. కబురెడితే పారొచ్చే వోల్లం గాదా!" అన్నాడు.

"మావుగాని మీ ఇంటికి రాకూడదేట్రా! ఎర్రియెదవ. ముందు కుసిన్ని నీల్లంపు. నాలిక పీక్కుపోతోంది" అన్నాడు.

ఆయనకు కులమత భేదాలు లేవని చెప్పడానికి అదే నిదర్శనం.

"ఓలమ్మీ! బావుగారికి మంచి నీల్లట్టుకు రాయే. సేతులు, గలాసు సుబ్రంగా సేసుకో. ఏటి బావూ అలగే నుల్చుండి పోనారు. మాకులాటి సిన్నోల్లతాన కూకోనీకి కుర్సీలుండవ్‌గాదా" కుచేలుడిలా అసహాయతకు కృంగిపోయేడు.

"పర్నేదు నేరా ! మనకి మడుసులు పెదానం గాని కుర్సీలు గాదుగా ? కూసోండి"– అని మిగతా వాళ్ళను ఆజ్ఞాపించేరు నాయుడుగారు. తను కొద్దిగా ఇబ్బంది పడి మంచంమీద కూర్చున్నారు.

నాయుడుగారి రాకను గమనించిన చాలా మంది అక్కడకు చేరేరు.

"ఓరి తలుపులూ! మన ఇష్టమూర్తిగాడ్ని, ఏసుపాదం గాడ్ని నాను రమ్మనమన్నానని సెప్పి కేకేసుకురా!"– అని అక్కడున్న ఓశాత్రికి పురమాయించేరు" నాయుడుగారు.

మంచానికి దూరంగా కూర్చున్నారు కొందరు. పరామర్శలు, పరిచయాలు, కుశల ప్రశ్నలు పూర్తయ్యేలోగా రావల్సిన వాళ్ళతో సహా చిన్న సభకు చేరినట్లు చేరిపోయేరు.

సూరికి, లింగానికి నాయుడుగారు ఎందుకు అక్కడకు తీసుకొచ్చేరో మాత్రం బొత్తిగా అర్థం కాలేదు. మాలపల్లి రాజుగారి సంస్థానం. అలాటి శత్రుస్థావరంలోకి నాయుడుగారు చొరవగా రావడంలో గల గూడార్థం బొత్తిగా గ్రహించలేకపోయేరు.

"ఓరేయ్ సత్తిగా! కొత్త దేవలం సూసి



నావ్రటా!? మాగొప్పగా వుంది. బాబావారి దయవల్ల వూరు బాగుపడ్తేసాలు. దేవుడు సల్లగా సూసి మనోల్లందరికీ గుక్కెడు నీళ్ళు దొరికితే అంతకిన్నా ఏటికావాల? ఎన్ని యదవపన్లు సేసినా రాజుగారు ఈ ఇసయంలో మాత్రం సేనాకట్టబడి పోనారు"– అన్నారు నాయుడుగారు చుట్ట వెలిగిస్తూ.

చుట్టూ వున్న అందరితో పాటు లింగం, సూరికి కూడాఎలక్ట్రిక్ చైర్లో కూర్చున్నంత షాక్ తగిలింది.

"అవును బావూ!" – అని అనకపోతే బాగోదని కాబోసు ఒకళ్ళిద్దరు మొహమాట పడ్డారు.

"మన్లోమనకి ఎన్ని గొడవలున్నా వూరు కోసం, పెజల కోసం అన్నీ మర్సిపోయి పన్జేయాల. అది నా ఇదానం. అసలు నాను రాజుగారితో ఇడిపోనీకి కారణం సేనామంది కి తెలవదు. ఇప్పుడు సెప్పినా మీరందరూ మరోనాగా అనుకుంతారు. గుడికి సందాలు వసూల్జేసేటప్పుడు మీరూసూసినారు గదరా! నాను మాత్తరం ఇయ్యలేదా!" జనాంతికంగా ప్రశ్నవేసేరు.

"మరి ఇచ్చీనారు గాదా!" – అని

కాసిని కంఠాలు అన్నాయి.

"అసలకి మనం ఏదేనా సేసినా అందరి బాగుకోసవే గదరా! సింతల్లి నాకేటి తోబుట్టువా? కాదే. పాపం దిక్కులేని సావుసత్తే దగ్గరుండి అన్ని పన్లూ సెయ్యనేదా?! అల్లా అబ్బులుగాడ్ని దారుసంగా సంపేత్తే పోలీసోల్లు శవాన్ని ముక్కలు సెయ్యకుండా ఎందుకడ్డుపడినాం? అదూ మనకు లాటోడే కాబట్టి. కులాల పట్టింపు ఏనాడేనా నా ఇసయంలో సూసేర్రా? మనందరం ఆ దేవుడి బిడ్డలం. కులాలు అయ్యి మద్దెలో వచ్చినాయ్ కదా?

"దేవలం ఇసయంలో నేనూ, లింగం మావందరం రాజుగారి దగ్గరకెల్లి 'ఏటేనా సాయం అవుసరం వుంటే సిన్న మాట సెప్పండి, సిటంలో సేత్తాం. మీయెనక వుంటాం' అన్నాం. మరి ఆయనగోరి ఆలోసెనేటో తెలవదు. ససేమిరా ఈల్లే దన్నాడు. మిమ్మల్నందర్నీ నానొకటడుగుతాను సెప్పండి. నిజెంగా పదవే కావాలనుకుంటే ఇన్నాల్టిబట్టి నుల్సోకపోదునా? మీ అందరికీ ఇదివరకు సేవ సెయ్యనేదా? ఎందుకునిల్సున్నాను. కొన్నింటికిపదవిలో వుంటే గాని గవర్నమెంటోడు ఇనిసావడు అందుకని"- అర్ధాంతరంగా ఆపేసి చుట్టూరా చూసేరు. తన వుపన్యాసం అందరూ వింటున్నారో లేటో నన్న అనుమానంతో చూసేరు.

కొందరు తల గోక్కుంటూ, గోళ్ళు గిల్లుకుంటూ, చాటుగా చుట్టలు తాగుతూ ఆయన వేదనని సానుభూతితో ఆలకిస్తున్నారు.

"మా ఇసయాల మాటకేం గాని పాపాలుసేసినోడ్ని పైనున్నోడు వూరికే వొగ్గేత్తాడేటి. మావందరం ఎలక్సన్ల నుంచి తప్పుకొందారని తేల్సుకున్నాం. ఎందుచేతంటే మాకు మీరు ముఖ్యం. అందరి మంచి గావాల. అంతేగాని పదవుల కోసరం పాపాలు సేత్తున్నోల్లతో పోటీ పడదల్సుకోలేదు.మీ అందరికి తెలియపర్సి పోటీనుంచి తప్పుకుందారని పారొచ్చినాను" - నాయుడుగారు రెస్పాన్సు కోసం ఆగేరు.

"అదేటి బావూ! మీరు తప్పుకోవటం ఏటి?! మావందరం మీ పచ్చంగాదా?" అంతపని వద్దని పెద్దలు నాయుడుగార్ని రిక్వెస్టు చేసేరు.

అలక పాన్పు చేరిన కొత్త పెళ్ళికొడుకులా కాసేపు బిగించుకున్నారు. అక్కడున్న జనం తమ స్వంత వాడు పోయినంత బాధపడ్డారు నాయుడుగారి నిర్ణయం విని. ఆఖరికి అందరి కోరిక మీద పోటీలో వుంటానని హామీ ఇచ్చారు.

"మరో సిన్న ఇసయం. బాగాఆలోసించాల్సింది"-అని మళ్ళీ ఆగేరు. అందరూ చెవులు రిక్కరించేరు.

నాయుడుగారు మరో దమ్ము చుట్ట పీకేరు. ఆయన నోటివెంటనుంచి వచ్చే మాట కోసం పడిగాపులు కాస్తున్నారు. కుక్కలు అరవడం మానేసి తోకాడిస్తూ చూస్తున్నాయి.

చీకటికి చలనం లేదు.

"మన కొత్త దేవాలంకి పూజారిగా మన ఇష్టమూర్తిగాడ్ని పెడ్దారని ఆలోసెనొచ్చింది" - తాపీగా అన్నారు నాయుడుగారు.

శాపగ్రస్తుల్లా అందరూ అర్జెంటుగా శిలల్లా బిగుసుకుపోయేరు.

సీదనిస్తున్న చెట్టు చూస్తుండగా మీద కూలున్నట్లనిపించింది.

"ఏటా! అందరూ అలగైపోనారు. ఇందులో ఆచ్చెర్యం ఏటుంది.

మీలో కుసింత సదుంకువ్నోడు ఆడేగదా! మరందుకని ఆడ్నే పూజారిగా పెడ్తారని...''

"అదేటండే...! మావు పూజార్ల వేటండి బావూ ? అది బేమ్మర్లు సెయ్యాల. ఆల్లు మొదట్నించి మంత్రాలు సదుంకొన్నారు. మావసలింత వరకూ గుల్లోకి పోనేదు. మావు పూజార్లేటండే ! అమ్మో.. ఇంకేటీనా వుందా బావూ!" ఓ పెద్దాయన తన భయాన్ని అందరి తరపున బయటపెట్టేడు.

"మీరు పూజార్లయితే ఏటయిపోద్దిరా? దేవుడిగాని మైలంటుకుంటదేటి ? అల గెతే దేసంలో వున్న దేవుల్లందరూ మైలడి పోనారు. మీరింకా పెపంచకం గురించి తెలవక ఇలగుండి పోనారు. గాంధీగోరు ఏటి సెప్పేరు ? మీ వోల్లందర్ని యెంటేసుకుని దేవలంలోకి ఎల్లనేదా? మరింతకాలం ఎవర్నేనా రానిచ్చినారా? వుత్తర దేసంలో పెద్దపెద్ద దేవాల యాల్లో పూజార్లు బేపనోల్లు గాదు. మీ వోల్లే! ఎందుసేత ? దేవుడికీ, పెభు త్వానికి కులబేదాలు నేవు. అందరూ సమా నంగా వుండాలనే అలగ సేసేరు. మరా దేవాలయాల్లో పూజలు సెయ్యటం నేదా, పెసాదాలు తీసుకోటం నేదా? మీ కులపో ల్లందరికీ పెభుత్వం సదువు చెప్పిత్తోంది, ఇల్లు కట్టిత్తోంది, గుడ్డలు కుట్టిత్తోంది, మాగానీ పొలాలు పంచేత్తోంది. ఇయన్నీ దేని కోసరం? మీ అందరూ బాగు పడాలని. అందర్లో కలసిపోయి.. పోయి... అదన్న మాట."

"నేనేం ఎర్రియదవన్నై సెప్పటం నేదు. రోజూ పేపర్లో సూడండి ఎంత మంది మీ వోల్లు పూజార్లయి పోతున్నారో! మరో న్నాల్రోజులు పోతే మన సివాచలం కొండ మీద, పెద్ద తిరుపతిలోనూ గూడా మిమ్మల్నే పెట్టాలని ఆలోసిస్తున్నారు. అయినా నాకు తెలవక అడుగుతానోరే! ఎక్కడేనా, ఏ దేవుడేనా బేపనోల్లే పూజార్లుగా వుండాలి అని రాసేనారేరా? మీకు ఇలాంటి ఇసయాలు ఎవలూ తెలియ పర్సటంనేదు. దేసం ముందుకి పోతుంటే మీరు ఎనక్కి పోవటంలో అర్ధంనేదు. మీకా పాటి దమ్ముగాని నేకపోతే అల్లా గాంధీ గోరి బొమ్మను ముక్కలు కిందసేసి కాలవలో పాడెయ్యండి."

నాయుడుగారికి విపరీతమైన ఆవేశం అందుకొంది. ఆయన వాక్ప్రవాహాన్ని తట్టుకోడానికి అందరూ జంకేరు. సూరికి, లింగంకి నాయుడుగారి బుర్రకు ఇంత పదును ఎలా కల్గిందో అర్థం కాలేదు. అందుకే అతిగా ఆశ్చర్యపోయేరు.

ఆసక్తిగా వింటున్న వాళ్ళను చూడ గానే లింగం, సూరికి మళ్ళీ కొత్త ఆశలు చిగురించటం ప్రారంభించేయి. మెల్ల మెల్లగా చేరుతున్న జనాన్ని చూస్తే ఆనందం వేసింది.

"నిజవేగాని బావూ అల్లా మంత్రాలు ఎలగొస్తాయండీ! మొదటికాడనుంచీ ఆల్లే సూత్తున్నారాయే. మావలాటి పన్నైతే మరింక జల్మ వుండదండి బావూ..వొద్దు బావూ.." తలుపులన్నాడు.

"ఏటి పంతులుగారు పుట్టంగానే మంత్రాలొచ్చే సేయేటి? దేనికేనా కుసింత కట్టబడాల పైకి రావాల.. అంతేగాని ఇలగే ఏసిన సోట్నే కూకుంటే మరి కద ల్నీరు. అల్లా పోతారం మాలపల్లి నాగులు కొడుకు సూసినావా ! కలెట్టరైపోనాడు. మరాడు మీకులాగ అనుకుసుంటే ఇల్లీ పాటికి గేదల్ని తోలుకుంటూ వుండే టోడే! మరాడి బోగం ఇయ్యాలసూడు.

"మీకు దేవుడెత్తిన అవతారాలన్నీ తెల్సుగాదా. అన్నీ అవతారాలు ఓకే కులంలో ఎత్తినాడా? నేదే! ఎందుసేత? అందరూ సమానవని సెప్పడానికి. నే సెప్పేది అదే!"

"ఇంత కష్టం జేసి కూలీకూడా నేకుండా గుడి కట్టేనారు గాదా? పలితం ఏటి? మిమ్మల్ని నోపటిగ్గూడా రానీరు. మీరు కట్టిన ఇల్లయినా మిమ్మల్ని రానీ రెందుసేత? మీ ఇల్లల్లో దేవుడు బొమ్మ ల్నేవా?

అల్లా గుడిలో రాతి బొమ్ముం తాది. రెండింటికి తేడా ఏటి? మీరంటే దేవుడికి ఇష్టం నేకపోతే మాయమైపోయే వాడేగాదా? అంతెందుకు మొన్నటి బాబా వారు మిమ్మల్ని ముట్టుకోనేదా? ఆయనగోరికి లేని మైల ఈల్ల కొచ్చే సిందేటి.

మిమ్మల్ని పూజారిగా సేసినందు వల్ల నాకేటీ రాదు. అయినా మీకోసరం ఎందుకింత ఇదైపోతున్నానో కుసింత అర్ధం సేసుకోండి" అని కళ్ళ చీల్చుకొని అన్నిదిక్కులూ చూసేరు నాయుడుగారు.

గుసగుసలు ప్రారంభమయ్యేయి. తర్కవితర్కాల మధ్య అందరూ నలిగి పోతున్నారు. లింగం, సూరి నాయుడు గార్ని మనసులోనే భజన చేస్తూ వుండి పోయేరు.

"ఇష్ణుమూర్తీ ఇలగ రారా..!!సూడు కొత్తదేవాలయంకి నువ్వు పూజారివిరా!'' యువరాజుకి సింహాసనం అప్పగిస్తున్న రాజుగారిలా అన్నారు నాయుడుగారు.

''నాకేటి తెల్సండే!!''

''ఏటి తెలవాల్రా! నువ్వు మూడో క్లాసు సదివినావు గాదా !! సాలు.. రేప్పొద్దుగాల సుబ్బరంగా నీల్లోసుకో! పెద్ద కుంకుం బొట్టెట్టుకో. అంతే.మరేటుంటాది. ఇగ మంత్రాలంటావా.. మరేం బెంగ పడకు.

పట్నంనుంచి పెద్ద పంతులుగార్ని పిలిపించి నేర్పిత్తాను. కుసింత కట్టపడ్తే సరి.

ఇదంతా మీరు పైకిరావాలని, అంద రితో సమానంగా వుండాలని. గాంధీ గారి కలలు మనం తీర్సాల.. ఏటంతావ్ ?!"

"ఏటోబావూ...నాకు భయంగా వుందండే! పెద్దోల్లగ్గాని తెలిస్తే సంపేత్తా రండే!!" మెలికలు తిరిగిపోతూ అన్నాడు ఇష్ణుమూర్తి.

"పెద్దోలెవలోయ్..! అందరు సమా నమే. ఒకేపునుంచీ మీవోల్లందరూ పెద్ద పెద్ద మంత్రులైపోతున్నారు. పెబుత్వం వారు ఇల్లుకట్టిత్తున్నారు. భూములిస్తు న్నారు...అయ్యన్నీ దేనికిత్తున్నార్రా? పిచ్చెదవ. మావందరం నేర్చట్టా...ఇంత సదువుకున్నావ్. నువ్వే ఇలగై పోతేఎలగరా! అదేదో వూరిపేరు మర్సి పోనాను. వుత్తరదేశంలో పెద్దగుడి రోజూ సూడ్నీకి లచ్చలు లచ్చలు మంది ఎలుపొస్తారు. మరక్కడి పూజార్లంతా మీవోల్లే...అందుకే నేసెప్పేది."

పదేపదే ఆయన చెప్తున్న మాటల్లో యధార్థాన్ని కాదనలేకపోయేరు. అంత మాత్రంచేత పూర్తి ధైర్యం కూడా రాలేదు.

"బావు సెప్పిందాట్లో తప్పేటి?!మనం కాకూడదని రూలేటుంది" -అన్న వాళ్ళు.

"గుడి మనం కట్టేందా?! గుళ్లో దేవుడి దగ్గర మనం వుంటే ఏటైపోద్ది?!"

"అందరం సమానమైనపుడు మనోడు పూజారైతే మా త్తరం తప్పేటి."

ప్రశ్నలు పెరుగుతున్నాయి.

జవాబులు తేలిపోతున్నాయి.

అందరి మెదళ్ళూ పదునెక్క నారం భించేయి. మెల్లగా పెద్దా, చిన్న వ్యత్యాసం గురించిన చర్చ ఆవేశం అందుకొంది. ఎవరికి తోచింది వాళ్లు. ఏదో ఒకటి అనక పోతే బాగుండదని కొందరు.

నాయుడు, లింగం, సూరి తలొక పెద్దతో తీవ్రంగా చర్చల్లో పడ్డారు.

క్షణాలు గంటల రూపంలో సాగి పోతున్నాయి.

వూరు ప్రశాంతంగా కునుకేస్తోంది. మాలపల్లికి మాత్రం నిద్రలేదు.

రాజకీయాల్లో ఆఖరి ఆయుధం కులం అని నాయుడు గారికి బాగా తెల్సు.

''ఇప్పుడుతప్ప మరో సేన్సు మీకు రాదు. ఇన్నాల్లుగా మిమ్మల్ని అణగ దొక్కినారు. ఇలగెంతకాలం? మీ యెనక నానుంతాను. పొద్దుగాల ఎలుపొస్తాను. మీ మాటేదో తెలియపర్సండి..." అని నాయుడుగారు పెద్దా, పిన్నా అందరి దగ్గరా సెలవు తీసుకొన్నారు. ఎన్నడూ లేనంత ఆప్యాయత సంపాదించ గల్గేరు వాళ్ల దగ్గరి నుంచి. మాలపల్లి దాటేదాకా ప్రజల అందరూ తోడొచ్చేరు.

* * *

"ఇప్పుడేటవుద్ది?''-లింగం ఆసక్తిగా అడిగేడు దార్లో.

''మామూలే! ఈల్లందరూ పోయి రాజుగార్ని అడుగుతారు. ఆడు కాదు పొమ్మంటాడు. దాంతో ఎర్రెత్తిపోతారు. ఇంకేటుంతాది సమయానికి మనం బానం ఏత్తాం. అంతే రాజుగాడు మరి సోదిలోకి కూడా వుండడు'' నాయుడుగారు వివరిం చేసు.

"ఒకేల రాజుగాడు ఎలక్సన్లగురించని సరేనంటే!!"–

"అలగంటే పెద్దకులాలోళ్ళు సంపెయ్యరా! అల్ల సపోర్టు నేకపోతే ఏటి సెయ్యగల్డు. మాదిగవాడనోకి కాలెట్ట నేడు. మాలపల్లి ఓట్లతో గెలిసెయ్య నేడు. అందుసేత సచ్చి గీపెట్టినా వొప్పుకోడు. ఒకేల నువ్వన్నట్టు అలగే జరిగిందనుకో. మనం కూడా పెద్దకులాల వేపు జై అంటాం.''

"మాదిగవాడ సంగతేటి సేద్దాం?" – సూరి.

"ఏటుంతుంది. పెద్దకులాలోల్ల మీదకి తిరగబడ్తున్నాం. మాలమాదిగలు ఏకం కావాలని సెబ్దారి. అదీగాక నాను ఏది సెప్తే అది సెయ్యడం మొదట్నించి అల వాటు గాదా!! ఇంకా అబ్బులుగాడు సచ్చి నాల్రోజులు కానేదు. ఆల్లందర్ని నాను కాసుకుంతాను. మీరు సెయ్యాల్సిం దొకటే! మాలపల్లిలో నిప్పు ఆరిపో కూడదు. మరెలగ సేత్తారో, ఎలగ కాసుకుంతారో నాకు తెలవదు. ఇదే ఆకరి సేన్సు. ఇదిగాని తుస్సుమంటే మనకి అడవులే గతి'' – నాయుడుగారు హెచ్చ రికలు చేసేరు.

చీకటిలోంచి పంచాయితీ గుడ్డి దీపం వెలుగులోకి వచ్చేరు.

ఆ వెలుగులో నిద్రలో జోగుతున్న వూర్ని చూడగానే పల్చటి దీపంకాంతిలో అందమైన ఆడదాన్ని నగ్నంగా చూసి నంత సంబర పడ్డారు నాయుడుగారు. తను మరో కొద్దిరోజుల్లో ఆ వూరికి రాజు నన్న విషయం మరింత గిలిగింతలు

పెట్టింది.

తను సంధించిన బాణం సూటిగా గురితప్పకుండా తగుల్తుందన్న నమ్మకం ఇప్పుడు నాయుడిగారితో పాటు సూరికి కూడా కల్గింది.

ప్రజలు మూర్ఖులు. వాళ్ళ మూర్ఖత్వాన్ని సద్వినియోగం చేయటం నాయకుడి విధి. అదే పదవికి పరమపదం – అన్న నిజం లింగంకి అప్పుడుగాని పూర్తిగా అర్థం కాలేదు.

ఊరు నడిబొడ్డుమీద వూర కుక్క ఆ అర్ధరాత్రివేళ దారుణంగా ఏడుస్తోంది. చీకటి జడలు విరబోసుకున్న రాక్షసిలా వుంది.

* * *

''ఏటి నిజమేనా?'' – అబద్ధం అయితే బాగుండునని మనసులో అనుకుంటూ అన్నారు రాజుగారు.

'నామాటమీద నమ్మకం నేదేటి' – అని బాంబురాజు అన్నేదు.

"ఏటి జర్గింది బాంబు రాజూ!" – మునసబుగారు రాజుగారి అవస్త గ్రహించి అడిగేరు.

"నాయుడుగాడు మాలపల్లిలో నిప్పెట్టేడు."

"కొత్త దేవలంకి మాలపల్లి ఇష్ట మూర్తిగాణ్ని పూజారి సేద్దారని నాయుడు గారు మాలపల్లిలో కు్టపన్నినారు."

''అలగ ఎలగ కుదురుద్దండి!" – మునసబుగారు.

''ఎందుక్కుదరదూ! వుత్తరదేశంలో పూజార్లంతా మాలోల్లు గాదా!! ఆ గుల్లో గాని దేవుల్లు నేరా ?! అందరూ కల్సి పేన్నెయంగాలేంది పూజారిగావుంటే మాత్త రంతప్పేటి అని అల్లందరికీ ఎక్కించి నాడు" బాంబు రాజు వివరించేడు.

"మరి ఆల్లేటన్నారు" మునసబుగారు.

"అల్లనేదేటి ! నాయుడుగాడు ఇంత నీసానికి దిగుతాడనుకోనేదు. పదవి కోసరం కులం, గోత్రం మర్సిపోయేటంత పసువులం గాదు. ఇదేగాని జరిగితే మాల పల్లిలో మడిసి మిగుల్తాడా ? నీయమ్మ పాకల్ని బూడిద సెయ్యనూ! నా కొడు కులు ఏటి సూసుకుని ఇంతకు తెగిస్తారు" రాజుగారికి వెర్రికోపం వచ్చింది.

"ఇప్పుడేటయ్యిందని. నాయుడుగాడు సెప్పినంత మాత్రాన ఏటి అల్లందరూ ఇనేత్తారేటి. మంచి సెడులు అల్లకి మా త్తరం తెలవ్వా !" మునసబుగారు రాజుగార్ని చల్లబరిచేరు.

"మనం ఇంగారు పడాల్సిన పనిలేదు. ఇదంతా పదవి కోసం అని ప్రజలకి బాగా తెల్సు. అదీగాక తొందరపడ్తే మళ్ళీ వూళ్ళో కల్సిమెల్సి తిరగాలన్న విషయం మర్చిపోరు. అయినా ఇదంతా నాయుడు తాపత్రయమేగా. రేపు జరగాల్సిన కార్య క్రమంకి మరేం విఘ్నంరాదు.మీరు నిశ్చింతగా వుండండి" కరణంగారు ఓదార్చేరు.

రాజుగారికి వుద్రేకం తగ్గి సహచరుల మాటలు వుపశమనం కల్గించేయి.

"ఇలాటి కుప్పిగెంతులకే మనం బెదిరిపోతే మరింకేటుంతాది! మనం గాని గాజులు తొడుక్కున్నావా? అడు మన మీద పెజల్లో ఎన్ని సెప్పనేదు? ఇనేసి ఇప్పుడు అడ్ని సీ అన్లేదూ? మన సేవ పెజలకు తెలవదా?"

రాజుగారి గుండె యధావిధిగా కొట్టు కోవడం ప్రారంభించింది.

"బాంబురాజు! మిగతా ఏర్పాట్ల సంగ త్నూడు. రేపొద్దుగాల అన్ని ఏర్పాట్లూ సవ్వెంగా జరగాల. మనం ఎవరిసేతా

ఒక్క మాట కూడా పడకూడదు" – మునసబుగారి హెచ్చరిక.

"అంతా సిద్ధవే! రోజు గడవడమే తరువాయి" సిన్సియర్‌గా చెప్పేడు.

గుడంతా వేసిన పందిరిని పరిశీలించేరు. ఏర్పాట్ల గురించి చర్చించేరు. చేసిన ఏర్పాట్ల గురించి నిజంగా తృప్తి కల్గింది.

రెండు రోజుల్లో జరగబోయే ఎన్నికలంటే భయం బొత్తిగాలేదు. బాబాగాపు వూరు విడిచినప్పటి నుంచి ప్రజలకి రాజుగారే దేవుడయ్యేరు. ఇదివరకటికన్నా ఆయన కీర్తి మరింత పెరిగింది.

తెల్లవారితే జరగబోయే విగ్రహ ప్రతిష్ఠ కార్యక్రమం గురించి ఆనందించని వాళ్ళు ఎవ్వరూ లేరు. అందరూ తమ స్వంత ఇంట్లో పెళ్ళిలా హడావిడి పడుతున్నారు.

కుమిలిపల్లిలో ఎండ మట్టిక్కూడా నిప్పంటించేలా వుంది.

ఎండ తాపానికి విలవిలలాడి పోతున్నారు.

నాయుడుగారికి మాత్రం ఎండ వెన్నెల్లావుంది.

* * *

మాలపల్లిలో కిరసనాయిలు దీపాలు బిక్కుబిక్కుమంటున్నాయి. చీకటిలో కన్నుగానక దారిచూపించే వారి కోసం ఎదురు చూస్తున్నట్లుంది గాంధీగారి విగ్రహం.

ఆయన శిథిల విగ్రహం దగ్గర పెట్రోమాక్సు లైటు గాలికిమండుతూ మాలపల్లిని తగలబెడ్తేలా వుంది.

ఆ కాంతిలో అందరి ముందున్న పోచిగాడు బ్యాండేజీలతో సున్నం పూసిన శవంలా వున్నాడు.

వీలునామా మీద సంతకం చేస్తూ నటించే సినిమా జమిందారులా బుసలు కొడ్తూ, నీరసంగా జనంకేసి చూస్తున్నాడు. నోట్లోంచి ఏనుగులు పోయినా పట్టించుకునేలాలేరు విసుపోయున్న జనం. సూరి, లింగం ప్రజలకేసి చూస్తున్నారు. అక్కడ నిశ్శబ్దం చావులా చల్లగా అల్లుకుపోయింది.

సూరికి, లింగానికి కన్నీరు తప్ప నోటివెంట మాట రావటంలేదు.

"అన్నెం పున్నెం ఎరగనోడు. ఇల్లీకట్లేటి బావూ! అసలేటయిందండే?!"

"సెప్పేడిదేముంది.. కల్లముందు ఆ పట్టంనేదా" – లింగం కోపంగా అన్నాడు. అక్కడకేదో అక్కడున్న అందరూ పోచిగాడికి జరిగినదానికి కారణం అయినట్లు నిప్పులు కక్కేడు.

"ఏటుంది..! కొత్తగుడి సూడ్నీకి ఎల్లినాడట. రెప్పొద్దుగాల దేవుడ్ని కుకోబెడ్తున్నారుగాదా! ఆ సోటంతా పూజసేసినారంట. నోపటికి పెద్దకులపోల్లు తప్ప ఎవలనీ రానీరట. ఈ పిచ్చోదవ తెలవక నోపనికి పోబోనాడట. రాజుగారి మడునులు నోపటికి రానీయనేదుట. 'ఇదేటి గోరం బావూ! మావేటి సే సేవండే గుడి మావు కట్నేదా? నోపటికొతే తప్పేటండే?' అని అడిగేనాడట– 'దేవుడుండే సోటికి సిల్లరకులపోల్లు రాకూడదు. పెద్దకులపోల్లు తప్ప' అని మెడట్టుకొని గెంటినారు. మరీడికి కడుపు మండదా! మాటా మాటా పెరిగింది. సితగొట్టేరు. అడ్డెల్సి నాయుడుగారు పారొచ్చినారు. ఆయనగోర్ని గూడా కొట్ట బోయినారు. సిన్న సిన్న దెబ్బలు తగిల్నాయి. పాపం గాంధీగార్నో టోరు. మీ కోసం అడ్డవై నోల్ల సేతా మాటలు పడాల్సొచ్చినాది.

అంతే! అరికి మాలావు కోపం వచ్చినాది. రేప్పొద్దుగాల గుల్లోకి మా వోల్లని ఎలా రానీరో సూత్తానని శపదం సేసి పారొచ్చీనారు"– ఆగేడు సూరి.

ఉడికిపోయేరు విన్నవాళ్ళు!

ఆ క్షణంలో వాళ్ళకి ఆయుధాలిస్తే కనిపించిన వాళ్ళనల్లా నరికేసేలా వున్నారు. క్రోధాగ్ని జ్వాలలు రగిలేయి.

రాజుగారి మీద, పెద్దకులాల మీద చెప్పలేనంత అసహ్యం రేగింది.

నాయుడిగారి మీద విపరీతమైన గౌరవం కల్గింది.

"అంసేత పెద్దకులాలోల్ల దవ్వర్జన్యం మీద మనం తిరగబడాల. ఆల్లాడుతున్న నాటకాలు ఇయ్యాల్తో ఆటరై పోవాల. మనంగాని ఇలగే వూరుకుంటే కొన్నాల్లకి అందర్నీ సంపేత్తారు. తాగనీకి సుక్క నీల్లు ఇయ్యనేకపోగా ఇలాటి గోరాలు సేత్తారా ? అబ్బులుగాడ్ని దారునంగా సంపేనారు. ఎందుకని ఎవలేనా అడిగినారా ? ఇలగే ఇంకా వూరుకుంతారా ?" సమాధానం కోసం చూసేరు.

"మీకులాటి పెద్దలుంటే బయం ఏటండే? రేప్పొద్దుగాల ఎలగ రానీరో సూత్తాం" అన్నాయి అన్ని గొంతుకలు.

"నాయుడు బావు కోరికా అదే. ఆ బాబు సెప్పమన్నదీ అదే! రేప్పొద్దుగాల పెద్ద వూరేగింపుగా గుడి దగ్గరకు ఎల్దారి. మరోక ఇసయం. మాలపల్లి ఇష్ణుమూర్తిగాడ్ని కొత్త దేవాలం పూజారిగా ఎడ్తున్నాం... దాంతో ఇన్నేల్లుగా వున్న కులబేదాలు తొలగిపోవాల. వూరి బాగుకి సుబసూచికం" ఆవేశం చల్లారింది సూరికి.

రణగొణ ధ్వని మొదలయింది.

పెద్దలు చేస్తున్న ఘాతకాలు. దానికి మద్దతునిస్తున్న దేవుడ్ని కూడా ఆవేశంలో బూతులు తిట్టేరు. ఇంత దారుణం జరిపిన రాజుగారి మనుషుల మీద కక్ష తీర్చుకోవడం తమ తక్షణ కర్తవ్యంగా భావించేరు.

మాదిగవాడకు తిరుగులేని నాయకుడైన నాయుడుగారికి జరిగిన అవమానం తల్చుకుని దారుణంగా దుఃఖించేరు.

జనం చెదిరిపోలేదు. గుంపులు గుంపులుగా చర్చల్లో పడ్డారు. లింగం, సూరికి బోల్డు పని తగిలింది. ఇద్దరూ చెరో గుంపు దగ్గర కథలు చెప్తున్నారు.

పాడె మీద శవాన్ని పడుకోబెట్టి ఎవరు మొయ్యాలో చర్చించుకోవడంలో నిమగ్నమైనట్లున్న వాళ్ళను చూస్తున్న పోచిగాడు విసుగుపుట్టి కునుకు తీసేడు.

"మరింక మా వెల్తాం.నాయుడుబాబుని సూసి రావాల. ఎలగున్నారో ఏటో ? ఈడ్ని మా తరం జాగర్త." అని సెలవు తీసుకున్నారు లింగం, సూరి.

చుట్టలు కాలుతున్నాయి–
చీకటి పరిగెడుతోంది–
మాదిగవాడ మండుతోంది–




మబ్బులతో కలిపి నేసిన నల్ల చీరలా వుంది ఆకాశం.

ఆ మూల, ఆ వేపున నల్లరంగు కేన్వాసు మీద చిన్న తెల్లటి చుక్కలా

పల్చటి వెలుతురు మరక పడింది. ఆ చోట రాత్రి ప్రియుని ముద్దులకి ఎరుపెక్కిన బుగ్గలా ఎర్రగా వుంది.

సంధ్యావందనం ముగించుకొని సూర్యుడు ఆకాశమార్గం పట్టేడు.

నిన్నటి మొగ్గ నేడు విచ్చుకుంటున్నట్లు, చల్లటి గాలిలో పాట చెదిరినట్లు వెల్తురు మెల్లగా పులుముకుంటోంది.

కొండా కోనా తెలివొచ్చినట్లు బద్ధకంగా కదిలేయి.

పాచి పనికి వేళయిందని ఆదరాబాదరా పరిగెత్తే ముసలి ముదితలా వస్తోంది చల్లగాలి వూళ్ళోకి.

చెట్ల మీద పిట్టలు మలయమారుతం ఆలపిస్తున్నాయి.

వూరు పలవరింతలు మాని కలలకి క్లయిమాక్సు నిచ్చేయి. చలికి నిద్ర పట్టని దేవుడు వెలుగు వెచ్చదనం కోసం పడిగాపులు కాస్తున్నాడు.

నిద్రలేని కుక్కలు మరో గత్యంతరం లేక మార్నింగ్ వాక్‌కి బయల్దేరేయి.

ఆషాడం ముగియగానే మొగుడి దగ్గరకు పరిగెత్తే కొత్త పెళ్ళికూతురిలా వూరు వెలుగును చూసి ఆనందించింది.



ఆలస్యంగా జరిగిన జ్ఞానోదయంలా వూరి మీదకి వెల్తురు పాకింది.

పాకల్లోని ఆకలి శరీరాలు ఆతృతగా లేచేయి.

హోటలయ్యరు పొయ్యిలో నిప్పు రాజేసేడు.

పూజారిగారు, పట్నం నుంచి వచ్చిన ప్రతిష్ఠాపనాచార్యులు అప్పటికే నిత్య కార్యక్రమాలు ముగించి శివనామ స్మరణలో తన్మయం చెందుతున్నారు.

దేవుడి నూతన గృహ ప్రవేశానికి అందరూ ఆహ్వానితులే !

వూరంతా హడావిడి పడ్తోంది. తెల్లవారక ముందే గబగబా తయారయి పాత దేవాలయం దగ్గరకు ప్రయాణమవుతున్నారు. పెళ్ళిపందిరిలా వూరంతా నూతనోత్సాహం అందుకుంది.

రాజుగారికి మెలుకువ రావటం ప్రసక్తి లేదు. అందుక్కారణం రాత్రి కంటిమీద కునుకు లేకపోవటం. సెంద్రరావ్ నాయుడి పథకం వార్తాహరులద్వారా మధ్యరాత్రి తెలియటంతో రాజుగారికి ఆవేశం పెరిగిందిగాని సరైన ఆలోచన రాలేదు. ఇంతపెద్ద ఇరకాటంలో పడానని ఎన్నడూ వూహించలేదు. తన రాజకీయ భవిష్యత్తుకీ,మేధస్సుకీ ఇది విషమ పరీక్ష! కాని ఏంచేద్దామన్నా సమయం లేదు. అదే బాధ !

రాజుగారు భారం దేవుడి మీద, బలం కార్యకర్తల మీద విడిచిపెట్టేరు. వుదయం స్నానం ముగించి పట్టువస్త్రాలు ధరించేరు. గుడి దగ్గర ఏర్పాట్లు అన్నీ సవ్యంగా జరిగేలా ఎరేంజిమెంట్సు చేసేరు. శిష్యులకు ఆదేశాలు జారీచేసేరు.

మరోసారి దేవుడి పటంముందు ప్రణమిల్లి మొకరిల్లేరు.

వెంటనే దేవుడు ప్రత్యక్షం కాలేదుగాని బాంబురాజు ప్రత్యక్షమయ్యేడు. అంతటి చల్లటి ఉదయంలో కూడా అతగాడి నుదిటిమీద చేరిన చెమట బిందువుల్ని చూడగానే రాజుగారికి గాభరా కలిగింది. బాంబురాజుకి నోటమాట రావటం లేదు. ఛాతీ ఎగిరి పడ్తోంది.

"ఏటయింది ?" రాజుగారు ఆతృతగా అడిగేరు.

"రెడ్డిగారు పారొచ్చీనారు. జీపు సగం దారిలో సెడిపోనాదట. మిమ్మల్ని వర్తెంటుగా పారొచ్చీమన్నారు" ఆయాసం తగ్గలేదు బాంబురాజుకి.

"ఆర్నే రమ్మనకపోనావా ? నీయమ్మ వూరేగింపు యవ్వారం తెల్సుగాదా ! అసలే గొడవలో మతోతుంటే ఎలగ రావటం''– కోపంగా అన్నారు రాజుగారు.

"ఆరికి అన్నీ ఇసయాలుతెల్సేపారొచ్చీనారు. దీనిసయం గురించే మాట్లాన్నీకి ఎలుపొచ్చేరట. ఎవలకీ సెప్పకుండా వచ్చీమన్నారు''– అసలు విషయం చెప్పేడు బాంబురాజు.

రాజుగారు ఆలోచన్లో పడ్డారు.

''బావూ! ముందు మీరు బేగిబయల్దేరండి. ఆనక సూసుకుందారి. జరగాల్సిన ఎవ్వారాలు మునసబు, కరణంగారు సూసుకుంతారు. రెడ్డిగారు అల్లా మూడోడొంక మావిడితోటలో కూకునున్నారు"– తొందర పెట్టేడు బాంబురాజు.

"మరి నాలెత్తాను. కరణాన్ని, మునసబుని సూసుకోమను. నిముసంలో ఎలుపొస్తానని సెప్పు. నా కోసరం సూడకని పంతుళ్ళకి సెప్పు. బేగెల్లు."

బాంబురాజు వచ్చినంత వేగంగా బయటకు వెళ్ళేడు.

రాజుగారు బట్టలు మార్చుకుని పెరటి వైపునుంచి బయట పడ్డారు.

రెడ్డిగారు కోడిగుడ్డుమీద ఈకలు మొలిపించగల సమర్థులు. అయినా తన కన్నా ముందే వూరి విషయాలు ఆయన దాకా వెళ్ళడం నిజంగా ఆశ్చర్యం కల్గించింది. తనున్న క్లిష్ట పరిస్థితిలో ఆయనే మార్గం చూపించగలరు. అందుకే అడుగులు వేగం పుంజుకున్నాయి.

* * *

లేత వాడి వేడి కిరణాలు వూరిమీదకు రాకుండా మబ్బులు అడ్డం పడ్డాయి.

పొగమంచుతో కూడి చల్లటిగాలి వూళ్ళో ప్రవహిస్తోంది.

ఆ చల్లటి వాతావరణం అందరికీ ఆహ్లాదాన్ని కలిగించింది.

చాలా రోజుల తర్వాత అంతహాయిగా వున్న వుదయం చూసి దేవుడి మహత్యాన్ని, బాబావార్ని మరోసారి మనసులో స్తుతించేరు.

మెల్ల మెల్లగా జనం పాత దేవాలయం దగ్గరకు చేరుకొంటున్నారు.

మాలపల్లి మందుకొట్టినట్లు తుళ్ళిపడ్తోంది.

కోలాహలం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. అందరిలో ఆనందంతోపాటు ఆవేశం కూడా వుంది. తరతరాలుగా వస్తున్న బానిసత్వం నుంచి విముక్తి కలుగుతున్నంత సంబరం. చరిత్రపుటల్లో చెరగకుండా చిరకాలం నిలచేలా నేటి విప్లవం లిఖితమౌతుందని లింగం అందర్నీ కదిలిస్తున్నాడు.

అందరిలో కదన కుతూహలం కన్పిస్తోంది.

చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా మాలపల్లి గాంధీగారి బొమ్మదగ్గర చేరుతున్నారు. ఇంతలో విష్ణుమూర్తి వచ్చి చేరేడు.

నల్లశిలకి వెంట్రుకలు మొలిచినట్లు గాలికి జుట్టు ఎగురుతోంది.

నల్లటి నుదిటిమీద చెరిగిపోయిన సూర్యుడిలా ఎర్రటి బొట్టు.

నెత్తిన కిరీటం పెడ్తే అతగాడు శిలగా మారిన దేవుడిలా వుంటాడు.

రోజూ చూసే విష్ణుమూర్తే అయినా అతగాడ్ని అందరూ వింతగా చూస్తున్నారు. మొదటిసారి రంగుపూసుకున్న నటుడిలా అందర్నీ చిర్నవ్వుల్తో పలకరిస్తున్నాడు. అందరూ తన్ని పలకరిస్తుంటే గర్వంగా తోచింది.

అందర్నీ వురుకులు పరుగులు పెట్టిస్తున్నాడు లింగం.

"లింగం బావూ! నాయుడు బావు గోరు ఇంకా రానేదేటి?"– అడిగేడో పెద్దాయన.

"మనం వూరేగింపుగా యెల్తే బావు గుడి కాడ కలుతారు. బేగి అందరూ తయారుకండెహే!"

చుట్ట కాలుస్తున్న ఆడ మగ అందరూ ఆ గ్రీన్ సిగ్నల్‌కోసమే ఎదురుచూస్తున్నారు.

"భజనానంద బాబాకీ" అని అరిచేడు లింగం.

"జై.జై.."–అన్నాయి గొంతుకలు.

"ఇష్ణుమూర్తికీ.."

"జై..జై.." – అన్నాయి అన్ని కంఠాలు ఆనందంగా.

లింగం ముందు నడుస్తుండగా..

వురుముల రొదలా, అరణ్యంలో అంటుకున్న అగ్నిలా జయ జయధ్వానాల మధ్య ఊరేగింపు బయలుదేరింది.

జైల్లో అణిచిపెడ్తే బద్దలు కొట్టుకుని ప్రపంచం మీదకు పెల్లుబికినట్లు, బండ రాళ్ళకు చైతన్యం కలిగినట్లు, వెర్రిగాలిలా దూకుడుగా, ధైర్యంగా విరిగిపడ్తున్న అలల్లా మాదిగవాడ కదిలింది.

వాళ్ళ ముందున్న భద్దరు నాయకుడు సూరి.

మాదిగవాడలో రేగినదుమ్ము భూమికి, ఆకాశానికి వారధికట్టింది.

వాళ్ళ పదఘట్టనకి భూమి ప్రకంపించింది.

కులం రేపెట్టిన కారుచిచ్చుకి, మనిషిలో చెలరేగిన దావాగ్నికి ఎదురొడ్డడం ఎవరి తరం?

చెరువుకట్టకి అవలివైపున రెండు వూరేగింపులూ కలిసేయి.

మబ్బులచాటు సూర్యుడు బయట పడ్డానికి భయపడ్డాడు.

ఎండిన చెరువులో గాలి గిరికీలు కొడ్తోంది. సరిగ్గా అప్పుడే...

పాత దేవాలయం దగ్గర పట్టుబట్టలు ఫెళఫెళ మంటున్నాయి..

పెద్ద బొట్టులు, పెద్ద పొట్టలు భగవన్నామస్మరణలో వున్నాయి. పూలు, కొబ్బరికాయలతో పళ్ళేలు చేరుకుంటున్నాయి.

గోచీపంచెలు, గావంచాలు శుభ సమయం కోసం ఎదురు చూస్తున్నాయి.

మేళంవాళ్ళు దూరంగా బీడి దమ్ము పీకుతున్నారు.

రాజుగారి గుణగణాలు, బాబావారి దివ్యమహత్తు, భగవంతుడికి పట్టబోతున్న మహర్దశ అక్కడ చర్చనీయాంశాలు.

పల్లకి అందంగా అలంకరించేరు.

నడుముకి గావంచాలు బిగించిన నలుగురు స్తంభాల్లాంటి విభూతి పట్టీల వారిని పల్లకి మోయడానికి నిర్ణయించేరు.

చేరిన అందరూ వుత్సాహకతతో ఎదురు చూస్తున్నారు దేవుడ్ని పల్లకీ మీదకు చేర్పించడానికి.

కూలిపడ్డ శిథిలాల మీద, ఇళ్ళ గోడల మీద పిల్లలు చేరేరు.

పూజారి గారు మంత్ర తంత్రాల మధ్య హైరాణ పడిపోతున్నారు.

కొందరు కొత్త దేవాలయం దగ్గర దేవుడి రాకకోసం పడిగాపులుకాస్తున్నారు.

కరణం, మునసబు రాజుగారి కోసం ఎదురు చూస్తున్నారు!

నిముషాలు గడుస్తున్నా ఆయన రాకపోవటం చిరాకు కల్గించింది.

"ఇల్లీ బాంబురాజుగాడేడ సచ్చేడు. సమయానికుండి సావడుకదా!" మునసబు గారు నిప్పుల మీద నుల్చున్నారు.

"ఇంతకీ రాజుగారేరీ! ఆయన రాకపోతే దేవుడ్ని ఎలాకదిలించడం!" పైకి కనబడకుండా చిరాకు పడ్డారు కరణం గారు.

"నాను రాకపోయినా పనాపకండని కబురెట్టినారు. ఇంత పనాగ్గేసి ఎల్లినారంటే ఇంతకన్నా పెద్దపనేదో తగులుండాలి" – కుంటిసత్తి.

"ఇంతకన్నా ఎవ్వార వేటుంది? దేవుడు గురించి ఎవలూ అడగరు. రాజుగార్నేకపోతే ఈల్లందరికీ సమాధానం ఏటి సెప్పాలి?" మునసబు గారు కోపం బయట పెట్టేరు.

"అయ్యా! ముహుర్తానికి వేళ మించిపోతోంది. మరి రాజుగారింకా రాలేదు" భయం భయంగానే అన్నారు పూజారి గారు.

"మావూ అదే సూత్తున్నాం. కుసింత సేపు సూసి. కానిచ్చేద్దాం" మునసబు

గారు కరణం గారి అభిప్రాయం కోసం చూస్తూ అన్నారు.

"అలాగే కానీయండి" కరణంగారు ఆమోద ముద్ర వేసేరు.

"చిత్తం" అని పూజారిగారు అక్కడ నుంచి కదిలేరు.

రంగు రంగుల గుడ్డల్లో పూల వర్షం పడ్డట్టు వున్నారు జనం.

పూజా కార్యక్రమం మొదలయింది. పునఃప్రతిష్ఠకు తతంగం ప్రారంభమైంది. పదికంఠాలు శ్రావ్యంగా మంత్రోచ్చారణ సాగిస్తున్నాయి.

రణగొణ ధ్వనిగా వున్న అక్కడ మెల్లగా నిశ్శబ్దం అల్లుకుపోయింది.

కరణం, మునసబులకు ఆతృత అధికమైంది. క్షణాలు మంత్రాలంత వేగంగా దొర్లిపోతున్నాయి. అయినా రాజుగారి జాడలేదు. మాలపల్లి నుంచి గాని, మాదిగ వాడ నుంచి గాని ఒక్కరూ రాకపోవటం చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. బహుశా కొత్త దేవాలయం దగ్గర చేరుంటారని సర్ది చెప్పుకున్నారు. ఎన్ని రకాలుగా చెప్పుకొన్నా ఏదో అనుమానం పట్టి పీడించ సాగింది కరణం, మునసబులకి. దానికితోడు రాజుగారి జాడ లేకపోవటం.

విసర్జన కార్యక్రమం ముగిసింది.

"హరోం హర..హర.." అన్నాయి కొన్ని కంఠాలు.

శివ నామస్మరణ గొంతుల్లో నలుగుతుండగా దేవుణ్ని పల్లకి ఎక్కించేరు.

"శంభో! శంకర..!!" అన్న ముక్తకంఠాల పిలుపుకి పల్లకి భుజాలనుచేరింది.

మునసబుగారు గ్రీన్ సిగ్నల్ ఇచ్చేరు.

దేవుడి పల్లకి కదిలింది.

మేళం గొంతు పెగుల్చుకుంది.

పిల్లలు కేరింతలు కొడుతుండగా, పెద్దలు వెనక నడుస్తుండగా, స్త్రీలు ఇంటి కబుర్లు ఆపి సుతిమెత్తగా అడుగులో అడుగేస్తుండగా పల్లకి కదిలింది.

గాల్లో పూరేకులు ఎగురుతున్నాయి.

జనం రేపిన దుమ్ము పాకలమీద, పెంకులమీద పరుచుకుంటోంది.

శాస్త్రోక్తంగా విన్పిస్తున్న సన్నాయి మేళం ఇంకా చాలా సమయం వుందను కొన్న బద్ధకస్తుల్ని కదిలించి పరుగులు పెట్టించింది.

వీధంతా జనం.. అడుగులంతా జనం.

వూళ్ళోకి పారిపోయొచ్చిన ఏటి నీరులా అన్ని సందుల జనం సరిగ్గా రచ్చబండ దగ్గిర కొచ్చేసరికి కలిసేరు.

ప్రజా వెల్లువ మధ్య దేవుడు భద్రంగా వస్తున్నాడు.

నూత్న దేవాలయం దగ్గర పడబోతోంది..

సూరి, లింగం పంచెలు ఎగదోసి అడుగులకు వేగం పెంచేరు.

శత్రుస్థావరం చేరువౌతుంటే మరింత అప్రమత్తతో మెదిలే సైనికుల్లా మాల మాదిగలు కలసి చెరువుకి అడ్డం పడి వడివడిగా వస్తున్నారు.

సూర్యుడు మబ్బు ముక్క చాటు నుంచి బయట పడ్డాడు నగ్నంగా!

ఆ ఎండలో చెరువు మధ్యగా వస్తున్న జనసందోహం నేలజారి దొర్లుతున్న నల్లవజ్రాల్లా కన్పించింది మునసబు గారికి.

ఆ వస్తున్న వాళ్ళముందు నాయుడు గారు కనబడకపోవటం చూసి కరణం గారి మనసు మరింత తేలికయింది.

రాజుగారు లేని లోటు స్పష్టంగా కన్పించింది. గుడి గురించి, దేవుడి

గురించి అంత శ్రమపడ్డ రాజుగారు ఆ సమయంలో లేకపోవడం పురోహితుడు లేని పెళ్ళిలా అన్పించింది చాలా మందికి. మదిలో మెదిలిన అనుమానాల్ని బహిర్గతం చేసేరు. ఎటొచ్చీ సమాధానం చెప్పేవాళ్ళు లేరు.

మరో వంద గజాల్లో దేవాలయం.

ఇచ్చిన 'లోను'తో ఇల్లు పూర్తి చెయ్యలేని గుమాస్తా ఇల్లులా వుందది.

కొత్తగా చూసేవాళ్ళకు అది గుడనిపించదు.

గుడి ముందు దడికట్టేరు.

అడిగిన వరం ఇవ్వకపోతే దేవుడ్ని కూడా నరికెయ్యడానికి సిద్ధంగా వున్నట్లున్నారు ముందున్న లింగం, సూరి.

మేళం వాళ్ళు కంచెదాటి గుడిలోకి ప్రవేశించారు.

అంతలో ఊరేగింపు ఆగింది. ఎందుకో ఎవ్వరికీ అర్థం కాలేదు.

కరణం, మునసబులకి తెలీని అనుమానం ఏదో మెదడులో చోటు చేసుకుంది. గతరాత్రి తెల్సిన నాయుడుగారి పథకం గుర్తొచ్చింది. అదేగనక నిజం అయితే సమస్యను సానుకూల పర్చడానికి రాజుగారు లేరు. ఆయన ప్రత్యక్షంగా వుంటేతమకుఆశ్రమ వుండదు. ఇప్పుడు వెనక్కి తగ్గితే మరి ముందుకు వచ్చే ప్రసక్తిలేదు. ఊళ్ళో తలెత్తుకొని తిరగటం కల్ల!

వెనక ఉన్న జనంకేసి చూసేరు. కరణం, మునసబులకి బోలెంత ధైర్యం వచ్చింది.

మేళాల మోత ఆగింది.

గాలి విసుర్లుతప్ప మరో శబ్దం లేదు. ఆకులు రాలుస్తున్న నేరేడుచెట్టు గాలి వాయిద్యానికి లయ వేస్తోంది.

"ఏట్రా అలగ నిలబడి పోనారు?" మునసబుగారు గంభీరంగా అన్నారు.

ఎవ్వరూ మాట్లాడలేదు. తీక్షణంగా చూస్తున్నారు. ఆ చూపులకు ఆకుపచ్చటి ప్రదేశం గనక ఏదైనా వుంటే మాడి మసైపోకతప్పదు.

ఆ మూగమౌనం యుద్ధానికి ముందున్న ప్రశాంతతలా వుంది.

"ఏమైందిరా! మీరు అడ్డు తొలిగితే దేవుడు గుళ్ళోకి వెళ్తాడు. బాబావారు నిర్ణయించిన ముహూర్తం గనుక దాటిపోతే మళ్ళీ వూరికి అరిష్టం తప్పదు. మీకేమైనా సమస్యలుంటే ఆనక చర్చించుకుందాం. ముందు అడ్డుతొలగండి" కరణంగారు జనాంతికంగా అన్నారు.

సమాధానంగా ఏ పెదవీ కదల్లేదు.

కుల పెద్దలకు సహనం సన్నగిల్లింది. వాళ్ళను బతిమాలి బామాలడం నచ్చలేదు. అదే మరో సందర్భం అయ్యుంటే వులుకూ పలుకూ లేకుండా చూస్తున్న వాళ్ళ కనుగుడ్లు పీకేసి కోళ్ళకి దాణాగా పారేసేవాళ్ళు. వెనగ్గా వున్న పెద్దలు మెల్లమెల్లగా ముందుకొచ్చేరు.

"లింగం! అసలేం జరిగింది? మీరూ మాట్లాడరు. వాళ్ళూ మాట్లాడరు."

లింగం, సూరి అమాయకంగా ఒకళ్ళనొకళ్లు చూసుకున్నారు.

"ఓరి ఏసుపాదమా! ఏట్రా మీ గొడవ? మీరందరూ ఇలగ అడ్డం నుల్చుంటే దేవుడు నోపటికి ఎలగెల్తాడా? మీగ్గాని మతులు పోనాయ్రటా? దేవుడికే అడ్డం నుల్చుంటార్రా?" మునసబుగారు అందర్నీ కోపంగా చూస్తూ దాదాపు అరుస్తూ అన్నారు.

మునసబు గారి మాటలకు చిరుదరహాసం చిందేసింది ఏసుపాదంకి. కానీ బయటపడ్తే

తన్ని చంపేస్తారు. అందరి మనసుల్లోను అదేభావం మెదిలింది. పెద్దల ముందు అంత ధైర్యంగా నుల్చోవడం అదే ప్రథమం.

"బావూ! అందరం కల్సి కూలికూడా అడక్కుండా సెవటోర్చి గుడి కట్టినాం కదండీ! ఇన్నేల్లు మమల్ని గుల్లోకి ఎవలూ రానిచ్చినారుకాదు. అలగని మావెప్పుడూ అడగనేదు. ఇప్పుడు మా తరం అడుగు తున్నాం. మావందరం గుల్లోకి రావాల" అందరి తరపున ఓ వృద్ధుడు అసలు విషయం బయట పెట్టేడు.

"అంతేగాదు. పాత గుడికి పూజారి బేపనోల్లే సేసేరు. ఇల్లిప్పుడు మాత్రం మాలపల్లి ఇష్ణుమూర్తి గాడు వుంతాడు. ఇది గాంధీగారి కోరిక. దేసంలో సేనా సోట్ల మా కులపోల్లందరూ పూజారులై పోతున్నారు. అందుసేత మావోడ్ని పూజారి సెయ్యాల. అందరం కల్సి గుడి కట్టినాం. ఇందులో అందరికీ బాగం వుంది" - మరో యువ కంఠం ధీమాగా వెల్లడించేడు అందరి అభిప్రాయాన్ని, నిర్ణయాన్ని.

అంతే !

అందరూ నోరున్న మూగవాళ్ళ య్యేరు. 'ఇది కలయా?! వైష్ణవమాయా?!' అన్న అనుమానం వచ్చింది. పొరపాటున ఏదో విన్నామేమోనని డౌటొచ్చింది..

తాము నుల్చున్న భూమి చిన్న చిన్న ముక్కలుగా చీలిపోయినట్లయింది. ప్రళయం ముంచుకొచ్చినట్లు, ఆకాశం కూలినెత్తిమీద పడ్డట్లు,ఎదురుగామృత్యువు నవ్వుతూ పలకరిస్తున్నట్లు బిగుసుకు పోయేరు.

ఏనుగుల్ని బంధించడానికొచ్చిన పిపీలకం మందల్లాకన్పించేరు మాల మాదిగలు. వాళ్ళను చీల్చి చెండాడి ఆ రక్తంతో తర్పణం చెయ్యాలనిపించింది మునసబు, కరణాలకి.

క్షణం తర్వాత ఆశ్చర్యం నుంచి కోలు కోక తప్పింది కాదు.

దేవుడికి పట్టబోతున్న దౌర్భాగ్య స్థితికి, మైలపడబోతున్న ఆయన్నుతల్చు కోగానే పూజారిగారి కనుకొనల నుండి వెచ్చగా కన్నీటి బొట్లు రాలేయి.

'ఇదంతా ఏవిటి స్వామీ!'-అనినోరు లేని దేవుడ్ని అడిగేరు పూజారిగారు.

దేవుడు మాట్లాడలేదు.

"ఏట్రా! మీగ్గాని మతిగాలి పోనాదేటి? ఏటి మాట్టాడుతున్నారో మీకేమేనా తెలు స్తోందా?!" కుంటి సత్తి అన్నాడు.

"నంజికొడకల్లారా! మానావు కావరం బట్టి పోనాదిరా! మీయమ్మ మీరు పూజార్లు గావాలా?గుల్లోకొచ్చి పూజలు చెయ్యాలా? అల్లా కూత కూసినందుకు ముక్కలు కింద నరికెయ్యాల్రా. ఎంత మొగాలైపోన్రా" మునసబుగారు ఆవేశం అణుచుకోలేక పోయేరు. పుండు మీద కారం జల్లినట్ల యింది..

అగ్నికి ఆజ్యం పోసినట్లయింది.

"అల్లు గుల్లోకి ఎందుకు రాకూడదు. పూజార్లయితే తప్పేటి?" లింగం వకాల్తా పుచ్చుకున్నాడు.

"బాబులూ! ఆగండి. ఇప్పుడు చర్చ నీయాంశం కాదు. తరతరాలుగా వస్తున్న సాంప్రదాయాన్ని కాదనకండి. ఇప్పుడీ కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగ నీయండి. ముందుతప్పుకోండి. మీ సమస్య పరిష్కరించడానికి ఇది కాదు సమయం. వేళ మించిపోకముందే స్వామివార్ని ప్రతి ష్ఠించనివ్వండి" - పూజారిగారు బ్రతి మాలేరు.

"అల్లా సాంప్రదాయకం విప్పుడుతో పోవాల! ఇన్నాళ్లుగా మీ మాటను ఇన్నాం. విప్పుడు మా మాట మీరినాల"– అంటూ ముందుకొచ్చేడు సైదులు.

"ఏంటా నీమాట ఇనేది? ఇయ్యాల గాని కొమ్ములొచ్చేయేటి? మాటకు మాట సెప్పేంత గొప్పోలైపోనార్రేటా !" మునసబు.

పెద్దల మాటకు ఎదురు చెప్తున్న వాళ్ళను చూసి చాలమందికి కోపంవచ్చింది.

రోషాలు పెరగబోతున్నాయి–

కోపాగ్ని జ్వాలలు రెండువైపులనుంచి రాజుకొన్నాయి.

మాటలు పెరుగుతున్నాయి. వెనక నున్నవాళ్ళు ముందుకొస్తున్నారు.

"అయితే మీరనేదేవిట్రా ? వాడ్ని పూజార్ని చేస్తేగాని గుళ్ళోకి పోవడానికి వీల్లేదా? పూజారంటే గొడ్లసావిట్లో పేడ ఎత్తేవాడు కాదు. పొట్టచీలిస్తే అక్షరం ముక్క రావాలి. అర్థమైందా ? అనవసరంగా మొండి పట్లు పట్టక మర్యాదగా అడ్డులేవండి. ఎవరో స్వార్థపరుల మాటలు నమ్మి మీ తాహతు మర్చిపోతున్నారు"– కరణంగారు సూరిని చూస్తూ అన్నారు.

"మాకు ఎవలో సెప్పాల్సిన అవుసరంనేదు. అసలకి మావెందుకు రాకూడదో ముందు సెప్పండి..!"

"ఇది మొదటి నుంచీ వస్తున్న ఆచారం".

"అది ఇయాల్తో పోవాలని మావంతున్నాం."

"నువ్వేవలివోయ్ రూల్సు గురించి పెద్దనాయకుడ్లాగ మాట్టాడుతున్నావ్"

"ఇది ఈల్లకి పుట్టిన బుద్ధిగాదు. ఆ నాయుడుగాడు ఎలకస్నన్ల కోసరం రెపెట్టేనాడు."

"ఆరోన్ని మాటంటే మ రే ద గా వుండదు.."

"అంటే ఏటి సేత్తార్రా?"

"బాబూ! ఈ గొడవలెందుకు. ముందు విగ్రహ ప్రతిష్ట జరగనీయండి. ఇన్ని రోజులు కష్టపడింది ఇలా మాటా మాటా అనుకోడానికా ? ఈ సారికి ఇలా కానీయ్యండి. రాజుగారొచ్చిం తర్వాత అన్ని విషయాలు చక్కబరచుకోవచ్చు"– పూజారిగారు గొంతు చించుకున్నారు.

"రాజుగాడుగాని సొరగం నించి దిగొచ్చినాడేటి ?"

"నోరుజారకు సవ్వేంగా బతుకనేవు. మావు గాజులు తొడుక్కోనేదు."

"ఏ నంజికొడుకు అడ్డుతాడో సూత్తాను. పల్లకి కదిలించండి"– అంటూ మునసబు దారి చీల్చబోయేరు. ఎదురుగావున్నవాడి చొక్కా పట్టుకున్నారు.

"మీరు పేణాల్తో వుండాలంటే మరేదగా అడ్డునెగండి. నేదా..."– అంటూనే చాచి లెంపకాయ కొట్టేరు మునసబుగారు...

"ఆ నాయుడు నంజికొడుకు మాటలిని ఇంతకు తెగిత్తార్రా ! జాతి తక్కువనా కొడుకుల్ని సేరదీసినందుకు పెద్ద పెద్ద కబుర్లు సెప్తార్రా?" – ఆవేశం పెరిగిపోయింది మునసబుగారికి.

సూరి, లింగం తమ వర్గం వైపు చూసేరు.

"మునసబూ ! మాటలు మరేదగా రానీయ్. నాయుడ్ని మరో మాటంటే పేనాలో వుండవ్" – లింగం.

"ఎంగిలి కూడు తినే సంజికొడుకులు కూడా మాటలు నేర్సేరు. ఇంకా సూత్తారేటి? పల్లకి కదిలించండి" – అన్న మునసబుగారి కేకకి అందరిలో ధైర్యం వచ్చింది.

"ఎవ్రలా ఎంగిలి కుక్క? నువ్వా, మీ రాజుగాడు. గెడ్డపు నంజికొడుకును నాక్కొచ్చి ఆడ్ని బాబా అని సెప్పి అందర్నీ మోసం సెయ్యటంగాదురా".. లింగం మాట పూర్తి కాలేదు...

"మీ బతుకులకి రాజుగార్ని అంటార్రా" అంటూనే లింగం మొఖం మీద గుద్దేడు ఒకడు. రక్తం ముక్కుల్లోంచి కారింది.

అది నాంది...

ఒక్కసారి ఆహాకారాలు మిన్ను ముట్టేయి.

మూకుమ్మడిగా శత్రువుల్ని కమ్మేసినట్లు మాల, మాదిగలు చుట్టు ముట్టేరు.

పిల్లలు, పెద్దలు, స్త్రీలు, బాలింతలు మధ్యలో...అందరూ తమ వునికి మర్చిపోయేరు.

కర్రలు లేచేయి.

బుర్రలు కొబ్బరి కాయల్లా పగులుతున్నాయి. చిదిమిన రక్తం ఎగసి ఆకాశానికి రంగు పూస్తోంది.

ఎవరికి దొరికిన ఆయుధాలతో వాళ్ల యుద్ధం చేస్తున్నారు.

ఎముకలు విరుగుతున్నాయి, ప్రాణాలు పోతున్నాయి.

ఏడుపులు— పెడబొబ్బలు..

కన్నీళ్ళ వర్షం.. రక్తం వాగులు..

దెబ్బలకి తట్టుకోలేని వాళ్లు, కాళ్ళు చేతులు విరిగిన వాళ్లు పరిగెట్టే ప్రయత్నంలో వున్నారు.

"మీయమ్మ నాయుడుగార్ని తిడతారంట్రా" — అంటూనే మాదిగవాడ పెద్ద కొత్త గుడి కంచె పీకేడు. రాటతోపాటు ఫెన్సింగు తీగకూడ వచ్చింది. ఇరు వర్గాలు కట్టెలు అందుకొన్నాయి. ఇపుడు దేవాలయంకి దడిలేదు. తోసుకుంటూ, కుమ్ముకుంటూ కొత్త గుడిలోకి జొరబడ్డారు...

కింద పడ్డ పిల్లలు కాళ్ళ మధ్య నలిగిపోతూ ఏడుపులు—

పరిగెత్త బోయిన బాలింతరాలకి నెత్తిమీద కర్ర దెబ్బ పడింది—

'అమ్మో'—అన్న ఆమె పిలుపుకి భయపడిన దేవుడుకూడా రక్షించడానికి రాలేదు.

అక్కడ వురుముల వర్షం—

పిడుగుల పోట్లాట—

ఆడా, మొగా తారతమ్యంలేదు. విచక్షణాజ్ఞానం అసలేలేదు.రక్త శిక్తమైన తలలు, కాళ్లు, విరిగిన శరీరాలు..

రాజు గొప్పా!! నాయుడు గొప్పా!!

అదే వాళ్ళ సమస్య.

అదే మానవత్వాన్ని మర్చిపోయి రాక్షసత్వాన్ని మొలకింపచేసింది వారిలో.

అది మనిషి అజ్ఞానానికి పరాకాష్ఠ.

నాయకుల ఎత్తుగడలకు పరీక్షా సమయం, బలాబలాలకు రంగస్థలం.

లింగభేదాలులేవు.

వయస్సుతో సంబంధంలేదు.

విజ్ఞానంతో సంబంధంఅసలే లేదు—

అందరూ వొళ్లు మరచి కొట్టుకుంటున్నారు. తిట్టుకుంటున్నారు.కొబ్బరి కాయలు తలకాయలమీదే పగుల్తున్నాయి.

పళ్ళాలు ఫ్లయింగ్ సాసర్లలా గాల్లో ఎగుర్తున్నాయి.

పూలు,. పళ్ళు మట్టిలో కలిసేయి. ఆడవాళ్ళుకూడా గుంపులు గుంపులుగా చేరి దొరికినవాడ్ని దొరికినట్లు చేతికి .ఏదిదొరికితే దాంతో కొడ్తున్నారు. కళ్లల్లో ఇసుక పోస్తున్నారు.

బూతులు మంత్రాల్లా ప్రతిధ్వనిస్తున్నాయి.

శక్తిలేనివాళ్ళు వూళ్లోకి పరిగెత్తారు.

వూళ్ళో మిగిలిన వాళ్ళు ఈ తంతు తెల్సుకొని అయుధాల్తో పరుగెత్తుకొస్తు న్నారు.

దేవుడి పల్లకి మోస్తున్న నలుగురూ పల్లకి కిందకుదించి ప్రాణరక్షణ కోసం పోట్లాడక తప్పలేదు.

పల్లకిలో దేవుడు గజగజ వణికి పోయేడు.

తన భక్తుల్ని చూసి సిగ్గు పడ్డాడు.

పల్లకిని చుట్టుముట్టేరు కొందరు.

శివలింగాన్ని కింద పారెయ్యబోయేరు గానీ పూజారిగారు గట్టిగా వాటేసు కున్నారు.

"బాబూ ! మీ పట్టుదలలతో దేవుడ్నేం చెయ్యకండి. స్వామినేం చెయ్యకండి" పూజారిగారు బతిమాలేరు.

"ఈడూ రాజుగారి పచ్చవే ! నాగి పారెయ్యండెహ !!" అన్న వాడు మాటను గౌరవించి పూజారిగార్ని లాగి అవతల పారేసేరు.

ఓపిక తెచ్చుకొని లేవపోతున్న అయన్ను కాళ్ళతో డొక్కల్లో తన్నేరు.

"రాజుని రమ్మన్నా ! నిన్నెవల్లా కాసుకునేది ?!" అంటూ కర్రతో నెత్తి మీద కొట్టేరు.

పూజారిగారికి కపాలమోక్షం సిద్ధించింది. రక్తం ఎగజిమ్మింది. శరీరం అయన నమ్ముకొన్న దేవుడికి దూరంగా మట్టిలో దొర్లింది.

శివలింగాన్ని సాయం పట్టి విసిరేసేరు.

* * *

గాంధిగోరు సెప్పినట్లు కద్దరేసుకున్నందుకు పెజాసేవ చెయ్యాల్సిన బాద్యత మనపైన వుంది. పదవుల కోసరం మనం మనం కొట్టుకు సావకూడదు. నేకపోతే మద్దెలో వాడెవడో తన్నుకుపోతాడు. అందుకే సద్దుబాటు సేసుకొని పూర్ని పంచుకోవాల" – అంటున్నారు రెడ్డిగారు.

రాజు, సెందర్రావునాయుడు మౌనంగా వూర్కొన్నారు.

"మీలో మీకే సద్దుబాటు నేకపోతే పెజాసేవ ఎలగ సేత్తారు?! అందుసేత ఈపారి సర్పంచి పదవి రాజుగార్కి, పెద్ద కాంట్రాక్టులు నాయుడికి. ఇంతకు మించి మరో సాధనంనేదు. నేకపోతే పెజల ముందు తలెత్తుకు తిరగనేరు''

ఇద్దరిలో చలనం కనిపించింది.

తర్వాత షేకాండ్లిచ్చుకున్నారు.

ఆ తర్వాత ఆలింగనాలు కానిచ్చుకున్నారు.

"ఈ సంగత్తెల్సి పెజలు.."– బాంబు రాజు అనుమానం వెలిబుచ్చేడు.

"నువింత అమాయకుడవేటయ్యా! పెజలకి మనం ఏదిసెప్తే అది భగవత్ గీతతో సమానం. అల్లు మనం ఎన్ని సేసినా మనకే వోట్లేత్తారు, గెలిపెత్తారు. అంత కల్లు పోసి నాలుగు రాళ్ళు సేతిలో ఎట్టు. మన పెణాలికలు సెప్పు సాలు. మరింకేటి మనం గెలవటం కాయం. ఇది మనపెద్దలు సేసే పద్దతి."

జీపులోని మందుసీసాలు దించుకొచ్చేరు బాంబురాజు. సరిగ్గా అప్పుడే మునసబు రొప్పుతూ రోస్తూ పరిగెత్తుకొచ్చేడు.

వెంటనే నోటమాట రాలేదు.

"ఏటి మునసబుగారూ. ఏదేనా గొడవ జరిగిందేటి?"–మునసబు ముఖకవళికల్ని పరిశీలించి రెడ్డిగారు అడిగేరు.

"రాజుబావూ! కొత్త దేవలం కాడ

అందరూ సేరి కొట్టుకు సచ్చిపోతున్నారు. ఎవలు సెప్పినా ఆగటంనేదు.. పెద్ద యుద్దం నాగుంది. మీరొత్తేగాని ఆగదు."

"నిజవే!" అని రాజుగారు, నాయుడు ఒకేసారి అన్నారు.

అప్రయత్నంగా ఇద్దరూ కుర్చీలోంచి లేచేరు.

"మీరెల్లేటి సేత్తారు?"—అని రెడ్డిగారు అడిగేరు.

"కొట్లాట ఆపించేత్తాం." – నాయుడు ధీమాగా అన్నాడు.

"మీరిద్దరూ గాని కల్సెల్లితే అసలు ఇసయం బయటపడి ముందు మిమ్మల్ని సంపేత్తారు. ఇలాటియి మామూలే! అల నాడు వుప్పు కోసరం గాంధీగారు వుద్యమం సేత్తే బిటిషోడు ఏటిసేసేడు. కాల్చి పారేనాడు. అలాగని సెప్పి గాంధీగోరు వుద్యమం ఆపీనాడా ? పేణ త్యాగం సేసినాడే సొతంత్రం వచ్చేది. మనకి మాట్టేడే హక్కు నాగే కొట్టుకునేహక్కు గూడా వుంది. యేడి తగ్గేదాకా కొట్టుకుంటారు. ఆనక సర్దుకు పోతారు. ఇది మానవ ఇదానం. మరేం పర్వానేదు మునసబుగారు. కుసింత దాహంతీర్చుకోండి" – అని రెడ్డిగారు బలవంతం చెయ్యడంతో బోల్డు మొహమాటపడ్డారు మునసబుగారు.

"ఎలగుంది నేను సేసిన సద్దుబాటు!" సీసా పైకెత్తుతూ అడిగేరు రెడ్డిగారు.

"సెబాస్‌గా వుంది" –అన్నాయి మిగతా గ్లాసులు.

ఆ గలగలకి చెట్లు ఆకులు రాల్చేయి

* * *

"మాలపల్లికి అగ్గంటుకుంది.."– అన్న కేకకి అందరూ అటువైపు చూసేరు.

మాలపల్లి, మాదిగవాడ అగ్నికి ఆహుతి అవుతున్నాయి.

"ఎంత గోరం . . ఎంత గోరం.." అంటూ సంగ్రామాన్ని సగంలో వదిలేసి ఆవైపు పరిగెట్టేరు.

ఆకాశం కాలి నల్లబడ్తోంది.

కొత్త దేవాలయం వద్ద నేలంతా రక్తం మరకల్తో అసహ్యంగా వుంది.

గుండెలు పగిలేలా కన్నీటిరొద, చెరిగిన కుంకుమబొట్ల ఘోష ఇంకా చెరిగి పోలేదు.

కాళ్ళూ చేతులు విరిగినవాళ్లు, కొట్లాటలో అలిసినవాళ్ల ఇళ్ళదారి పట్టేరు.

బీభత్స వాతావరణం ఇంకా చెరిగి పోలేదు. మూలుగులూ, ఏడుపులూ అలుక్కుపోయున్నాయి.

అటు మాలపల్లిలో, మాదిగ వాడలో ఎగిసిన మంటలు చల్లారలేదు.

ఇటు ఎవరికోసం అని ఇంత జరిగిందో ఆ దేవుడు దుమ్ములో నడిరోడ్డున రక్తం మరకలమధ్య పడి ఉన్నాడు.

దేవుడిని ఆదుకోడానికి ఎవరూ లేరక్కడ. ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

రేపే ఎన్నికలు.

అదవగానే గెలిచిన నాయకులు ముందు కొత్త దేవాలయాన్నే పూర్తిచేయించి తీరుతారు.

నీళ్ళకన్నా దేవుడు ముఖ్యం.

గుడికట్టటానికి అందరూ చందాలిస్తారు. భక్తి ప్రకటించుకొంటారు మొక్కులు తీర్చుకొంటారు. తీరిగ్గా పాపాలు కడిగేసుకొంటారు.

ఈసారి కొత్త దేవాలయంకి ఏదేశాధినేతో ప్రారంభోత్సవంచేస్తాడు. గ్రాంటు కూడా ఇప్పిస్తాడు.

ఇంకేం కావాలి ? ★

# చతుర

## మెదడున్న మెషీను

ఆర్. టీ. సీ. వారు ఏదో గొప్ప మెషిన్ తయారు చేయించారనీ, ప్రత్యేక ప్రదర్శన ఇస్తున్నారనీ తెలిసి చూడటానికి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి ఎవరో ఆఫీసరట ఉపన్యాసం ఇస్తున్నాడు.

"ఇది మామూలు మెషిన్‌కాదు. ఇది మెదడు వుండి స్వయంగా ఆలోచించి పని చేయగల కంప్యూటర్. దేశంలో మొట్టమొదటిసారిగా ఇలాంటి కంప్యూటర్‌ను తయారుచేయించి ఉపయోగంలోకి తెస్తున్న ఘనత మా ఆర్. టీ. సీదే దీనితో ఎన్నోరకాల పనులు చేయించవచ్చును. దీన్ని టిక్కెట్లిచ్చి చిల్లరకూడా తిరిగి ఇచ్చేమెషిన్‌గా వుపయోగించవచ్చు.

"ఎంక్వయిరీస్‌లో మనిషికి బదులుగా దీన్ని నిలబెట్టవచ్చు. ప్రయాణీకులు అడిగే ప్రశ్నలన్నిటినీ ఇది కసురుకోకుండా ఓపిగ్గా, నమ్రతగా సమాధానాలు చెబుతుంది. ఆర్. టీ. సీ.కి వస్తున్న నష్టాల్ని నివారించేందుకు, సామర్థ్యం పెంచేందుకు, మా ఉద్యోగుల మీద ప్రజలకున్న అపోహలు తొలగించేందుకు ఈ మెషిన్ ఎంతో ఉపయోగపడుతుంది" అన్నారాయన మహోత్సాహంతో. తర్వాత మరో ఆఫీసరుగారు లేచి ఉపన్యసించారు. "దీన్ని స్వయంగా మా ఆర్.టీ.సీ. ఉద్యోగులూ, అధికారులే రూపకల్పన చేసి తయారుచేశారు. దీని ఉపయోగం అమోఘం. ఇప్పుడు ఒక చిన్న ప్రదర్శన ఇస్తాం. చూడండి"

ఉపన్యాసకుడు తన ఉపన్యాసం ఆపి మెషిన్ మీద ఉంచిన కవర్ తీశాడు. చూడ ముచ్చటగా ఉండి తళతళ మెరిసిపోతున్న మెషిన్ అందరికీ దర్శనమిచ్చింది.

"ఇప్పుడిది టిక్కెట్లెలా ఇస్తుందో చూడండి. చిల్లర కూడా అదే ఇస్తుంది"




అంటూ రెండు దోసిళ్ళచిల్లర, అయిదు పైసల నుంచి రూపాయివరకూ అన్ని నాణాలూ కలిసినది మెషిన్లో పోశాడు. ప్రేక్షకుల్లోంచి ఒకర్ని పిలిచి కావలసిన టిక్కెట్ తీసుకోమన్నాడు.

అతడు తటపటాయిస్తూ వచ్చి ఒక అర్థరూపాయి బిళ్ళ మెషిన్లో వేసి ముప్పై పైసల టిక్కెట్ కావాలన్నాడు. వెంటనే టిక్కెట్ వచ్చింది. అయిదు నిముషాలు చూసినా చిల్లరరాలేదు. టిక్కెట్ మీద చూస్తే "చిల్లరలేదు. కావాలంటే డిపోకు వచ్చి తీసుకోండి" అని ప్రింటుచేసి వుంది. ప్రేక్షకులంతా ఆశ్చర్యపోయారు.

# కతలు

ఆ డిమాన్‌స్ట్రేటర్ గారు కొంచెం కంగుతిని "అయ్యా! మెషిన్లో చిల్లర వుందిగానీ ఈ విభాగంలో ఏదో చిన్న లోపం వున్నట్లుంది. ఏమనుకోకండి.



ఇప్పుడు మరో డిమాన్‌స్ట్రేషన్" అంటూ ఒక ఉద్యోగిని పిలిచి ఒకస్విచ్ చూపి అది నొక్కమన్నాడు.

ఏదో అద్భుతం జరుగుతుందని ఎదురు చూస్తున్న ప్రేక్షకులకు మెషిన్లోంచి లేబిల్స్ ప్రింటయి రావటం కన్పించింది. వాటిమీద స్లోగన్లేమిటంటే "ఆర్. టీ. సీ. మాదే. మా స్వంత ఆస్తి" అని. స్విచ్ నొక్కిన ఆర్. టీ. సీ. ఉద్యోగి మొహం వెలవెల పోయింది. ప్రేక్షకులు మాత్రం ఉత్సాహంగా చప్పట్లు కొట్టారు.

డిమాన్‌స్ట్రేటర్ కంగారు పడుతూవచ్చి ఆ స్విచ్ ఆఫ్‌చేసి "క్షమించండి. మెషిన్లో ఈ విభాగంలో కూడా ఏదో చిన్న లోపం ఏర్పడినట్లు వుంది. ఈ లోపాలన్నీ వెంటనే సరిచేయిస్తాం. ఇప్పుడు చివరిగా గౌరవనీయులైన మంత్రిగారు ఈ మెషిన్ చేత పనిచేయిస్తారు" అంటూ ఆర్. టీ.సీ. మంత్రిగారిని ఆహ్వానించాడు.

మంత్రిగారు ఆపసోపాలుపడుతూ వచ్చి మెషిన్ మీద వున్న అన్ని స్విచ్ లలో ఏది నొక్కాలో తెలియక కాబోలు కళ్ళు మూసుకుని ఒక స్విచ్ నొక్కారు.

మరుక్షణం మెషిన్‌లోంచి ఒక వెండి ప్లేట్ బయటకు వచ్చింది. దానిమీద బంగారు అక్షరాలలో ఇలా ఉంది–

"ప్రజాక్షోభయే మా లక్ష్యం, దయచేసి ఇది స్వీకరించండి".

–గుంటక సాంబిరెడ్డి

# మాయలోకం

మా మంగళం సంగతి మీరెరుగరు కాని వాడూ ఓ రచయితే. ఎప్పుడూ కవితలూ, కథలూ రాస్తుండే వాడు. వాటికి ముస్తాబు పూర్తి చేసి పత్రికలకు పంపుతూ వుండేవాడు. కాని అవి తిరుగు టపాలోనే క్షేమంగా తిరిగొచ్చేవి. కరువులో అధికమాసమని యీ పోస్టు ఖర్చులు కూడా ఎందుకు దండగ అని మంగళం భార్య గొడవ మొదలు పెట్టిన తర్వాత రచనలు కట్టి పెట్టి బుద్ధిగా ఆఫీసు పనికే అంకితమయిపోయాడు. వాడు లోగడ రాసిన కవిత్వం కాయితాల్ని వాళ్ళావిడ కుంపటి అంటించుకోటానికి ఉపయోగిస్తూ "మొత్తానికి

యీ కాగితాలు ఉపయోగంగానే వున్నా
యండీ.పోనీ అప్పుడప్పుడు రాస్తుండండి"
అంటూ సలహా కూడా యిచ్చిందట.'

అలాంటి మంగళం ఓ రోజు నా
దగ్గరకొచ్చి "కనకమాలక్ష్మికి సన్మానమంట.
వెళ్దాం పద" అంటే సరే అని నేనూ



బయలుదేరాను. కనకమాలక్ష్మి కొత్త
కవితా సంపుటి 'కవితా వరద' ఆవి
ష్కరణ కూడా వుంది ఆ సభలో.
సన్మానసభ కళకళలాడిపోతోంది. పెద్ద
లంతా వచ్చారు. అంతా కనకమాలక్ష్మి
కవిత్వాన్ని తెగ పొగిడారు. ఆమె
కవిత్వం వరద అనీ, భావాలు బురద అనీ
ప్రాసలు వాలికిస్తూ ప్రసంగించాడో
పెద్దమనిషి. తనకు జరిగిన సన్మానానికి
కృతజ్ఞత తెలుపుతూ "నాటి మెల్లనుంచి
నేటి నా వరకు సాహిత్యలక్ష్మిని యధా
శక్తి నూతనాలంకారాలతో అలంకరిస్తూనే
వున్నాం" అంటూ ఉపన్యాసం మొదలు
పెట్టింది కనకమాలక్ష్మి.

"మెల్ల ఏమిట్రా?" అన్నాను అర్థం
కాక.

"మెల్లలేవేయ్. చిన్న అచ్చు తప్పు.
గొడవ చేయకు" అని విసుక్కున్నాడు
మంగళం.

సభంతా అయిపోయిన తర్వాత కనక
మాలక్ష్మి మంగళం దగ్గరికొచ్చి చాలా
ఆప్యాయంగా పలకరించింది "ఇందాక
మంత్రిగారితో తీయించుకున్న ఫొటోల్లో
మీరు కూడా వుండాల్సింది" అంది.

"నేనెందుకు లెండి" అన్నాడు
మంగళం నిర్లిప్తంగా.

తర్వాత "రేపు మర్చిపోకుండా
రండి..." అని నమస్కారం చేసి వెళ్ళి
పోయింది ఆవిడ.

"రేపెక్కడికిరా" అన్నాను.

"ఇంద్ర హోటల్‌కు. చిన్న పార్టీ
వుంది. నాకు డిన్నర్ యిచ్చి శాలువ
కప్పి సన్మానం చేస్తుంది కనకమాలక్ష్మి"
అన్నాడు మంగళం.

"నీకెందుకు సన్మానం?"

"ఎందుకా? ఆ కవిత్వమంతా రాసి
పెట్టింది నేనే కదా మరి!" అన్నాడు
మంగళం. —ఎస్.ఆర్. రావు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/402